శ్రీలక్ష్మీవేంకటరమణసహాయమ్.

శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్యులవారిచే

రచింపఁబడిన

# ద్వాదశస్తోత్రము



పండ్రెండధ్యాయములకు

ఆంధ్ర ప్రతిపదార్థ తాత్పర్యసహితము

ఇది

పండితులచేఁ బరిష్కరింపఁబడి

ద్వైతమతప్రకాశికా పత్రికాధిపతులగు

పిలుఖానా వేంకటసుబ్బారావుగారిచే

ప్రకటింపఁబడియె.

మంజువాణీ ముద్రాక్షరశాల.

ఏలూరు.

*Price 12 Annas.*] [వెల 12 అణాలు.

1910

PRINTER M. CHALAPATI ROW, PUBLISHER P. VENKATASUBBAROW, ELLORE.

శ్రీహయగ్రీవాయనమః.

# అథ శ్రీ సటీకా ద్వాదశస్తోత్రం ప్రారభ్యతే.

## ప్రథమాధ్యాయప్రారంభః.

శ్లో॥ వందే వంద్యం సదానందం। వాసుదేవం నిరంజనం। ఇందిరాపతిమాద్యాది। వరదేశవరప్రదం॥ ౧

అ॥ వంద్యం=నమస్కరించి స్తుతి పడదగినవాఁడును. సదానందం, సదా=ఎల్లప్పుడు, ఆనందం=ఆనందాదిగుణస్వరూపుఁడును, నిరంజనం=అజ్ఞానాది దోషరహితుఁడును, ఇందిరాపతిం=లక్ష్మీదేవికి భర్తయును, ఆద్యాదివరదేశవరప్రదం, ఆద్యాది=బ్రహ్మమొదలుగాఁగల, వరద=వరములనిచ్చువారికిని, ఈశ=ముఖ్యులకు, వరప్రదం=అభీష్టమునిచ్చువాఁడును, అగు, వాసుదేవం=సమస్తభూతములకును నివాసభూతుఁడును, క్రీడాదిగుణవిశిష్టుడునునగు శ్రీకృష్ణమూర్తివారినిగూర్చి, వందే=నమస్కరించి స్తుతించెదను. సదానందం, అనువిశేషణమునకు, సతాం=మంచివారికి, ఆనందః=ఆనందము, యస్మాత్సః=కలుగఁజేయువాఁడనియు, లేక, సత్=దుఃఖసంపర్కములేని, ఆనందః=ఆనందము. యస్యసః=కలవాఁడనియు, లేక, సదా=ఎల్లప్పుడు, ఆనందః=ఆనందస్వరూపుఁడు, లేక, సదానందః=ఆనందాదిగుణవిశిష్టుఁడనియు అర్థము చెప్పవచ్చును. ఇందిరాపతిం, అనువిశేషణముచే బ్రహ్మాదులకును ఐశ్వర్యదాయకురాలైన లక్ష్మీదేవికి స్వామియని చెప్పుటవలన విష్ణుసర్వోత్తమత్వము సూచింపఁబడినది. ఆద్యాదివరదేశవరప్రదం, అనుచోట, ఆద్యాదివరద=బ్రహ్మాదులకు అభీష్టము నిచ్చువాఁడా, ఈశ=భగవంతుఁడా, అని సంబోధనలుగాను, వరప్రదం=అభీష్టదాయకుఁడనునది, వాసుదేవం, అనుపదమునకు విశేషణముగాను అర్థము చెప్పవచ్చును.

తా॥ సత్పురుషుల కానందము గలిగించుటచే వందనస్తుతుల కర్హుఁడైనట్టియు నవిద్యాశూన్యుఁడైనట్టియుఁ, గృపాకటాక్షముచే బ్రహ్మాదుల కైశ్వర్యమొసఁగు లక్ష్మీదేవికి భర్తయగునట్టియు, వరములనిచ్చువారి కధికారులగు బ్రహ్మాదులకు సహితము వరమిచ్చునట్టియు, సకలలోకాశ్రయుఁడైన విష్ణుమూర్తికి నమస్కారము.

శ్లో॥ నమామినిఖిలాధీశ। కిరీటాఘృష్టపీఠవత్। హృత్తమశ్శమనేర్కాభం। శ్రీపతేః పాదపంకజం॥ ౨

భగవంతుని పాదాదిభ్రూమధ్యపర్యంతము అవయవములను ధ్యానపూర్వకముగ వర్ణించుచు, ఈశ్లోకమందు పాదపద్మములకు నమస్కరించుచున్నారు.

అ॥ నిఖిలాధీశ...పీఠవత్, నిఖిల=సమస్తమైన, అధీశ=బ్రహ్మాద్యధికారుల, కిరీట=కిరీటములచే, ఘృష్ట=ఒరయఁబడిన, పీఠవత్ = పీఠముగలదియు. హృత్తమశ్శమనేర్కాభం, హృత్తమః = హృదయాంధకారమును, (అజ్ఞానమును) శమనే=పోఁగొట్టుటయందు, అర్కాభం=సూర్యకాంతినిఁబోలినదియు, అగు, శ్రీపతేఃపాదపంకజం, శ్రీపతేః=సకలాశ్రయులైన లక్ష్మీపతియగు భగవంతుని, పాదపంకజం=చరణకమలద్వంద్వమును, నమామి=నమస్కరించుచున్నాను. నిఖిలాధీశేత్యాదివిశేషణముచే, భక్తాభీష్టప్రదత్వమును, హృత్తమశ్శమనేత్యాదివిశేషణముచే, అనిష్టనివారణసమర్థత్వమును సూచింపఁబడినది.

తా॥ సమస్తబ్రహ్మాద్యధికారుల కిరీటంబులచే నొరయఁబడిన పాదపీఠము గలిగి హృదయమందలి యజ్ఞానాంధకారనివారణంబునసూర్యునితో సమానుఁడగు శ్రియఃపతిచరణారవిందములను నమస్కరింతును.

శ్లో॥ జాంబూనదాంబరాధారం। నితంబంచింత్యమీశితుః। స్వర్ణమంజీరసంవీత। మారూఢంజగదంబయా॥ 3

ఈశ్లోకముచే భగవంతునికటిప్రదేశము నుతింపఁబడుచున్నది.

అ॥ జాంబునదాంబరాధారం, జాంబునద=బంగారు వికారమయిన, లేక, బంగారుచాయగల్గిన, అంబర=వస్త్రమునకు, ఆధారం=ఆధారమయినదియు, [అనగా పీతాంబరమును ధరించియున్నదనిభావము) స్వర్ణమంజీరసంవీతం, స్వర్ణ=బంగారపు, మంజీర=చిఱుగంటల మొలత్రాఁడుతో, సంవీతం=కూడికొనునదియు, (పీతాంబరముపైని ధరించినదియు) ఆరూఢంజగదంబయా, జగదంబయా=జగజ్జననియగు లక్ష్మీదేవిచేత, ఆరూఢం=ఆశ్రయింపఁబడినదియు, అగు, ఈశితుః=భగవంతుని, నితంబం=కటిప్రదేశము, చింత్యం=(మోక్షేచ్ఛగలవారికి) ధ్యానింపఁదగినది.

తా॥ సరిగదువ్వలువచే నావృతంబయి బంగారు మొలనూలుతోఁగూడి లోకంబులకుఁ దల్లియగు లక్ష్మీదేవిచే నాశ్రయింపఁబడిన భగవంతునికటిప్రదేశము మోక్షమునందిచ్ఛగలవారికి ధ్యానింపఁదగినది.

శ్లో॥ ఉదరం చింత్యమీశస్య। తనుత్వేప్యఖిలంభరం। వళిత్రయాంకితంనిత్య। ముపగూఢంశ్రియైకయా॥ 4

ఈశ్లోకముచే శ్రీహరియొక్క ఉదరప్రదేశమును వర్ణించుచున్నారు.

అ॥ తనుత్వేపి=అల్పమైనదైనను, అఖిలం=సమస్తపదార్థములకును, భరం=ఆశ్రయమైనదియు, వళిత్రయాంకితం=వళిత్రయము (మూడుగాఁగల సులక్షణముల) చేనొప్పుచున్నదియు, నిత్యం=ఎల్లప్పుడు, ఏకయా= సమానరహితురాలైన, శ్రియా=లక్ష్మీదేవిచే, ఉపగూఢం=కౌఁగిలింపఁబడినదియు, అగు, ఈశస్య=భగవంతుని ఉదరం=కుక్షిప్ర

దేశము (కడుపు) చింత్యం=స్మరింపదగినది. నిత్యమను పదము సర్వత్ర యోజనచేసికొనవలయును.

తా॥ వలిత్రయముతోడఁగూడి యనన్యసులభమైన రాతిక గల లక్ష్మీదేవిచేఁ గౌఁగిలించికొనఁబడి స్వల్పపరిమాణముగలదయ్యు ననంతశక్తిచే నన్ని లోకములను భరించు భగవంతుని యుదరము భక్తులకు స్మరింపఁదగినది.

శ్లో॥ స్మరణీయమురో విష్ణో। రిందిరావాసమీశితుః। అనంతమంతవదివ। భుజయోరంతరంగతం॥ ౫

ఈశ్లోకముచే శ్రీహరివక్షఃస్థలమును వర్ణించుచున్నారు.

అ॥ ఇందిరావాసం, ఇందిరా=లక్ష్మీదేవికి, ఆవాసం=యెల్లప్పుడు నివాసపట్టయినదియును, అనంతం=(దేశతః, కాలతః, గుణతః) మితములేనిదైనను, అంతవదివ=భక్తానుగ్రహముకొఱకట్టి కొలఁదికల దానివలె కనఁబడెడిదియును, భుజయోః=భుజములు, అంతరం=మధ్యమును, గతం=పొందియున్నదియునగు, ఈశితుః=సర్వనియామకుఁడైన, విష్ణోః=విష్ణుమూర్తివారియొక్క, ఉరః=వక్షఃస్థలము, స్మరణీయం=(భక్తులచే) స్మరింపఁబడవలసినది. అణోరణీయాన్ మహతో మహీయాన్, ఇత్యాది ప్రమాణములచే భగవంతుని యందును, ఆయన యొక్క వక్షఃస్థలము మొదలగు నవయవములందును, విరుద్ధధర్మములు స్వతస్సిద్ధములే. ఇట్టి విరుద్ధధర్మములు ఆయనయొక్క అద్భుతశక్తివలన ఆయన యందుండఁదగును.

తా॥ లక్ష్మీదేవికి నివాసస్థలమై పరిమాణము లేనిదయ్యును, భక్తానుగ్రహార్థము పరిమాణముగలదానివలె భుజమధ్యముఁబొందిన విష్ణుమూర్తివారియురస్థలము భక్తిపారవశ్యులకు ధ్యానింపఁదగినది.

శ్లో॥ శంఖచక్రగదాపద్మ। ధరాశ్చింత్యా హరేర్భుజాః। పీనవృత్తా జగద్రక్షా। కేవలోద్యోగినోఽనిశం॥ ౬

ఈశ్లోకముచే భుజములను వర్ణించుచున్నారు.

అ॥ శంఖచక్రగదా పద్మధరాః=పాంచజన్యశంఖము, సుదర్శనచక్రము, కౌమోదకీగద, కమలము, అను నాయుధవిశేషములను ధరించియున్నవియు, పీనవృత్తాః=స్థూలములుగాను, గుండ్రముగానుండునవియు, అనిశం=సర్వదా, జగద్రక్షా కేవలోద్యోగినః=ప్రపంచమున (సజ్జనులను) కాపాడుటయే ముఖ్యమయిన కార్యముగాఁగలవియు. అగు, హరేః=(పాపములనుబోఁగొట్టు) విష్ణుమూర్తివారియొక్క, భుజాః=చతుర్భుజములు, చింత్యాః=ధ్యానింపఁదగినవి.

తా॥ శంఖచక్రగదా పద్మశార్ఙ్గములను ధరించి బలిష్ఠంబులు వర్తులంబులు నయి సజ్జనుల రక్షించుకొఱకు నెల్లప్పుడు ప్రయత్నించు భక్తపాపనాశకుఁడైన నారాయణుని భుజములు పుణ్యాత్ములకు సర్వకాలము ధ్యానింపఁదగినవి.

శ్లో॥ సంతతం చింతయేత్కంఠం। భాస్వత్కౌస్తుభభాసకం। వైకుంఠస్యాఖిలావేదా। ఉద్గీర్యంతేనిశంయతః॥ ౨

ఈ శ్లోకముచే కంఠమును నుతించుచున్నారు.

అ॥ అఖిలాః=సాంగములైన, వేదాః=వేదములు, అనిశం=ఎడతెగక, యతః=దేనివలననుండి, ఉద్గీర్యంతే=ఉచ్చరింపఁబడుచున్నవో, (అట్టి) భాస్వత్కౌస్తుభభాసకం, భాస్వత్=కాంతిగల, కౌస్తుభ=కౌస్తుభమాణిక్యమును, భాసకం=ప్రకాశింపఁజేయునట్టి, వైకుంఠస్య=వైకుంఠవాసులైన శ్రీవిష్ణుమూర్తివారియొక్క, కంఠం=కంఠమును, సంతతం=ఎల్లప్పుడు, చింతయేత్=ధ్యానింపవలయును. శ్రీహరికంఠము స్వభావముచే సుందరమయినదియు, సమస్తవేదోచ్చారణ విశేషముచే విలక్షణ లావణ్యము గలదియు నగుటవలన ఆభరణములకుఁగూడ నలంకారము నిచ్చునదనుట న్యాయమే.

తా॥ ప్రకాశించు కౌస్తుభమాణిక్యమునకు సయితము స్వభావ సౌందర్యముచే నందము గలిగించునట్టిదియు సాఙ్గంబులగు వేదంబుల నుచ్చరించునదియు నగు వైకుంఠమూర్తివారి కంఠము నెల్లప్పుడు భక్తులు స్తుతింపవలసినది.

శ్లో॥ స్మరేతయామినీనాథ। సహస్రామితకాంతిమత్। భవతాపాపనోదీడ్యం। శ్రీపతేర్ముఖపంకజం॥ ౩

శ్రీహరియొక్క ముఖమును స్మరింపుచున్నారు.

అ॥ యామినీ...కాంతిమత్, యామినీనాథ సహస్ర=వేయిమంది చంద్రులకంటెను, అమిత=అపరిమితమయిన, కాంతిమత్=ప్రకాశముగలదియు, భవతాపాపనోది, (తనుస్మరించువారికి) భవతాప=సంసారసంబంధములైన తాపములను, అపనోది=శమింపఁజేయునదియు, ఈడ్యం= స్తుతింపఁదగినదియు, అగు, శ్రీపతేః= విష్ణుమూర్తివారియొక్క, ముఖపంకజం=ముఖపద్మము, స్మరేత=స్మరింపఁదగినది.

తా॥ సంసారంబునందలి యాధ్యాత్మికము మొదలగు సంతాపంబుల పరిమాపఁజేసి సహస్రచంద్రుల కాంతికెని పోలనశక్యంబై బ్రహ్మాదులచే సయితము సకలపురుషార్థసాధనంబగుటకు స్తోత్రముచేయఁదగిన శ్రియఃపతి ముఖపద్మము సుకృతుల నక్యము స్మరింపందగినది.

శ్లో॥ పూర్ణానన్యసుఖోద్భాసి। మందస్మితమధీశితుః। గోవిందస్యసదాచింత్యం। నిత్యానందపదప్రదం॥ ౪

శ్రీహరియొక్క మందహాసమును వర్ణించుచున్నారు.

అ॥ అధీశితుః=సర్వపాలకుఁడైన, గోవిందస్య=వేదప్రతిపాద్యుఁడైన విష్ణుమూర్తివారియొక్క, పూర్ణానన్య సుఖోద్భాసి, పూర్ణ=సంపూర్ణమును, అనన్య=అసాధారణమునైన, సుఖ=సుఖముచే ఉద్భాసి=మిగులఁ బ్రకాశించుచుండెడి, నిత్యానందపదప్రదం

తా॥ చరాచరాత్మకమైన ప్రపంచమునంతయు సృజించి, సంరక్షించి, నశింపఁజేయుశక్తి విశారదుఁడైన గృహస్థగు శ్రీవిష్ణుమూర్తివారికి యిదె నమస్కారము.

శ్లో॥ అమందగుణసారోపి। మందహాసేనవీక్షితః। నిత్యమిందిరయానంద। సాంద్రోయోనౌమితంహరిం॥ ౪

అ॥ ఆనందసాంద్రః=ఆనంద ఘనస్వరూపుఁడగు, యః=ఏవిష్ణుమూర్తి, అమందగుణసారోపి, అమంద=పూర్ణమైన, గుణ=జ్ఞానానందాది గుణములచే, సారః=సారభూతుఁడై, అపి=ఐనను, నిత్యం=సర్వదా, ఇందిరయా=లక్ష్మీదేవిచే, మందహాసేన=చిఱునగవుతో, వీక్షితః=చూడఁబడునో, తం=ఆ, హరిం=శ్రీహరిని, నౌమి=నమస్కరించెదను.

తా॥ ఏమహానుభావుఁడానందాది గుణములచే శ్రేష్ఠుఁడైయున్నను, ఎల్లకాలము లక్ష్మీదేవిచే మందహాసముతోఁ జూడఁబడి మిగుల నానందముఁ బొందునో, యట్టి శ్రీహరికి యిదె నమస్కారము.

శ్లో॥ వశీవశేనకస్యాపి। యోజితోవిజితాఖిలః। సర్వకర్తానక్రియతే। తంనమామిరమాపతిం॥ ౫

అ॥ యః=ఎవఁడు, వశీ=సమస్తమును తనవశమందుంచుకొనువాఁడును, కస్యాపి=ఎవనికిని (లేక బ్రహ్మకైనను) వశే=వశమందు, న=లేనివాఁడు, అనఁగా=ఎవనికీ లోఁబడనివాఁడును, అజితః=(ఇతరులచే) గెలువఁబడనివాఁడును, విజిత=గెలువఁబడిన, అఖిలః=ప్రపంచముగలవాఁడును, (అనఁగా విశ్వాతీతుఁడు) సర్వకర్తా=సమస్తము సృజించువాఁడును. న క్రియతే=ఇతరులచే సృష్టింపఁబడనివాఁడునునగునో, తం=ఆ, రమాపతిం=లక్ష్మీవల్లభుని నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ ఎవఁడు సకలలోకంబులను స్వాధీనముచేసికొని తానెవ్వరికిని లోఁబడక, అందఱను గెల్చి ఎవ్వరిచే గెలువఁబడక, సర్వము సృష్టించి తానెవ్వరిచే సృష్టింపఁబడకయుండునో, యట్టి రమాపతికి నమస్కారము.

శ్లో॥ అగుణాయగుణోద్రేక। స్వరూపాయాదికారిణే। విదారితారిసంఘాయ। వాసుదేవాయతేనమః॥ ౬

అ॥ అగుణాయ=ప్రాకృతగుణరహితుఁడును, గుణోద్రేకస్వరూపాయ, గుణ=జ్ఞానానందాదిగుణముల, ఉద్రేక=ఆధిక్యమే, స్వరూపాయ=స్వరూపముగాఁ గలవాఁడును, ఆదికారిణే=బ్రహ్మను సృష్టించినవాఁడును, విదారితారిసంఘాయ, విదారిత=భేదింపఁబడిన, అరి=శత్రువుల, సంఘాయ=సమూహము గలవాఁడును, వాసుదేవాయ=శ్రీవాసుదేవమూర్తియైన, తే=నీకు, నమః=నమస్కారము.

తా॥ హేయమయిన గుణములు లేనట్టియు, ఆనందాది గుణముల యాధిక్యమే యాకారముగాఁ గలిగినట్టియు, సృష్టికర్తయగు బ్రహ్మదేవునికి సయితము కారణభూతుఁడైనట్టియు, శత్రునాశకుఁడైనట్టియు, వాసుదేవమూర్తికి నమస్కారము.

శ్లో॥ ఆదిదేవాయ దేవానాం। పతయే సాధితారయే।అనాద్యజ్ఞానపారాయ। నమోవరవరాయ తే॥ ౭

అ॥ ఆదిదేవాయ=ముఖ్యదైవమును (లేక, సృష్టికిపూర్వమందు క్రీడించెడువాఁడవును) దేవానాం=బ్రహ్మాదిదేవతలకు, పతయే=పరిపాలకుఁడవును, సాధితారయే, సాధిత=వశింపఁజేయఁబడిన, అరయః=(రాక్షసులు) శత్రువులుగలవాఁడవును, అనాద్యజ్ఞానపారాయ, అనాది=ఆదిలేని, అజ్ఞాన=అజ్ఞానమును, పారాయ=తుదముట్టించు వాఁడవును, (అనఁగాపోఁగొట్టువాఁడవును) వరవరాయ, వర=బ్రహ్మాదులకంటె, వరాయ=శ్రేష్ఠుఁడవును, లేక, వర=లక్ష్మీదేవిమొదలగు వారిచే, వరాయ=కోరఁబడుచుండువాఁడవును, లేక, వర=సర్వోత్కృష్టమైన, వరాయ=మోక్షమనెడు వరమునిచ్చువాఁడవును, అగు, తే=నీకు, నమః=నమస్కారము.

తా॥ సృష్టికిఁ బూర్వకాలంబునఁ గ్రీడించుచున్నట్టియు, దేవతలకందఱకుఁ బ్రభువవైనట్టియు, బ్రహ్మాదులకంటె శ్రేష్ఠుఁడవైనట్టియు, ఆదిలేని యజ్ఞానమునకు వినాశకుఁడవయినట్టియు, రాక్షసనాశకుఁడవైనట్టియు నీకొఱకు నమస్కారము.

శ్లో॥ అజాయ జనయిత్రేచ। విజితాఖిలదానవ। అజాదిపూజ్యపాదాయ। నమస్తే గరుడధ్వజ॥ ౮

అ॥ హేవిజితాఖిలదానవ, అఖిల=సమస్త, దానవ=దైత్యులను, హేవిజిత=జయించినవాఁడా! హేగరుడధ్వజ=ఓశ్రీహరీ! అజాయ=పుట్టుకలే వాఁడవును, అస్య=ఈ ప్రపంచమును, జనయిత్రేచ=సృష్టించినవాఁడవును, అజాది...పాదాయ, అజాది=బ్రహ్మాదులచే, పూజ్య=సేవింపఁబడు, పాదాయ=చరణకమలములుగల, తే=నీకు, నమః=నమస్కారము, జనయిత్రే=అనుచోట నిత్యుఁడైన ఈజీవునకు అనాదికర్మ నిబంధనచే సంసారసంబంధమును ఘటింపఁజేసినవాఁడని యెఱుఁగఁదగును.

తా॥ రాక్షసులనందఱ నోడించిన యోగరుడధ్వజా! నీవుజన్మలేనివాఁడవు, సకలమునకు సృష్టికర్తవు, బ్రహ్మాదిదేవతలకుఁ బూజనీయములైన పాదములుగలవాఁడవు; అట్టినీకొఱకు నమస్కారము.

శ్లో॥ ఇందిరామందసాంద్రాగ్ర్య। కటాక్షప్రేక్షితాత్మనే। అస్మదిష్టైకకార్యాయ। పూర్ణాయహరయేనమః॥ ౯

అ॥ ఇందిరా=లక్ష్మీదేవియొక్క, అమంద=పూర్ణమై, సాంద్ర=ఘనమైన ప్రేమరసముగల, అగ్ర్య=ఉత్కృష్టమైన, కటాక్ష=క్రీఁగంటిచూపులచే, ప్రేక్షిత=మిగుల భక్తిచేతను, అనురాగముచేతను చూడఁబడు, ఆత్మనే=స్వరూపము గలిగినట్టియు, అస్మదిష్టైకకార్యాయ, అస్మత్=మాయొక్క, ఇష్ట=అభీష్టమే, ఏక=ముఖ్యమైన, కార్యాయ=నెఱవేర్పఁదగిన పనిగలిగినట్టియు (అనఁగా భక్తులకోరిక నెఱవేర్చుటయే ముఖ్యమైన పని

నాఁగలవాఁడని తాత్పర్యము) పూర్ణాయ=గుణపరిపూర్ణుఁడైన. హరయే=భక్తులపాపములనుబోఁగొట్టు శ్రీహరికి, నమః=నమస్కారము. అస్మదిష్టైకకార్యాయ అనుచోట, అస్మదిష్టాయ=మాయొక్క ప్రియమునకొఱకు, ఏకకార్యాయ=సమస్త వ్యాపారములను ముఖ్యోద్దేశపూర్వకముగ సమర్పణ చేయఁదగిన వాఁడును అని గూఢార్థము చెప్పఁబడెను. శ్రీమదాచార్యుల వారు త్తమాధి కారులగుటచే వారు శ్రేయః ప్రతిపాదనయును భగవంతుని యుద్దేశించియే చేయుదురనిభావము. ఇందుకుప్రమాణము. శ్లో॥ వేదాదేవార్థకాస్సర్వే। దేవానారాయణార్థకాః॥ నారాయణస్తుమోక్షార్థో। మోక్షోనాన్యార్థ ఇష్యతే॥ అ॥ వేదములన్నియు దేవతాప్రసాదము కొఱకును, దేవతాప్రసాదము శ్రీహరి కటాక్షము కొఱకును, శ్రీహరి కటాక్షము మోక్షము కొఱకు నైయున్నది. మోక్షమునకంటె ప్రయోజనాంతరము లేదు.

తా॥ లక్ష్మీదేవియొక్క సంతోషముతోఁ గూడిన శ్రేష్ఠమైన కటాక్షములచేఁ జూడఁబడిన యానందము గలిగినట్టియు, భక్తులకనుకూలములగు కార్యములను ముఖ్యముగాఁ జేయునట్టియు, జ్ఞానాదిగుణ పరిపూర్ణుఁడైనట్టియు, సేవకులకు పాపనాశకుఁడైనట్టియు, దేవునికొఱకు నమస్కారము.

ఇతి శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్య విరచితే ద్వాదశస్తోత్రే
ద్వితీయోఽధ్యాయః, శ్రీకృష్ణార్పణమస్తు.



## శ్రీహయగ్రీవాయనమః.

## తృతీయోఽధ్యాయప్రారంభః.

శ్లో॥ కురుభుంక్ష్వచకర్మనిజంనియతం। హరిపాదవినమ్రధియా సతతం। హరిరేవపరోహరిరేవగురుః। హరిరేవజగత్పితృమాతృగతిః॥

సచ్ఛాస్త్రము నంగీకరింపఁబడిన న్యాయశాస్త్రాది తర్కములచే భగవంతుని సర్వోత్తమత్వమును సాధింపఁగోరి దయార్ద్రహృదయులైన శ్రీమదానందతీర్థ భగవత్పాదులవారు, శ్రీవిష్ణ్వనుసంధానపూర్వకముగ స్వహితకర్మలను జేయవలయునని సజ్జనుల కుపదేశించుచున్నారు

అ॥ హరిరేవ=శ్రీహరియే, పరః=సర్వోత్కృష్టుఁడును, పాలకుఁడును, హరిరేవ=హరియే గురుః=హితోపదేశముచేయువాఁడును, హరిరేవ=హరియే, జగత్=ప్రపంచమునకు, పితృమాతృగతిః=(సృష్టించుటవలన) తండ్రియును [పోషించుటవలన] తల్లి

తా॥ బ్రహ్మ, లక్ష్మి మొదలగు సమస్తదైవతములకంటె నుత్కృష్టుఁడై, క్షరా క్షరాతీతుఁడైన శ్రీహరికంటెను స్తుత్యార్హమైన దైవతము ఈ జగత్తులోలేదు. ప్రపంచ సంబంధములగు నాలోచనలవలన ఏమి ప్రయోజనము? కాఁబట్టి నీమనస్సును సర్వదా శ్రీహరి పాదపద్మములయందే ఆసక్తి గలదానిని గాఁ జేయుము.

శ్లో॥ యదతోఽపిహరేఃపదసంస్మరణే। సకలంహ్యఘమాశులయం వ్రజతి। స్మరతస్తువిముక్తిపదం పరమం। స్ఫుటమేష్యతితత్కిమపాక్రియతే॥ 3

ఈశ్లోకమందు, శ్రీహరిపాదపద్మస్మరణ ప్రశస్త్యమే, సమస్తపాపక్షయకరమగు చున్నప్పుడు, సర్వదాతదను సంధానము, పాపహరమును, ముక్తిప్రదమును, అనివేఱు గ చెప్పనక్కఱలేదని యుపదేశించుచున్నారు.

అ॥ హరేః=శ్రీహరియొక్క, పదసంస్మరణే=చరణకమలధ్యానమునకై, లేక, స్వరూపధ్యానమునకై యతతః=యత్నముసేయువానికి, అపి=వెంటనే, సకలం=సమస్తమైన, అఘం=పాపము, హి= శ్లో॥ [illegible] తిపాపాని। దుష్టచిత్తైరపిస్మృతః। అనిచ్ఛయాపిసంస్పృష్టో। దహత్యేవహి [illegible]॥ ఎఱుఁగక తాఁకినను నిప్పుదహించురీతిని, దుష్టులుస్మరించినను, పాపములను శ్రీహరి [illegible] ను, అను ప్రమాణముచేఁ బ్రసిద్ధి నిశ్చయముగ, లయం=నాశమును, వ్రజతి=పొం [illegible] [నిరంతరమాదరబుద్ధితో] స్మరతస్తు= స్మరించువారికి, పరమం=ఉత్కృష్టమగు, స్ఫుటం=స్వరూపావిర్భావలక్షణమైన, విముక్తిపదం=మోక్షస్థానము, ఏష్యతి=లభించును గదా గనుక, (ఇట్టియుత్కృష్టఫలసాధనమైనస్మరణను] కిం=ఏల, అపాక్రియతే=వదిలివేయవలెను. (వదలఁగూడదని తాత్పర్యము)

తా॥ శ్రీహరిపాదధ్యానము చేయవలయునని ప్రయత్నించునంతనే సకలపాపములు నిశ్చయముగా నశించునని చెప్పఁబడినప్పుడు, ఆ [illegible] ను భక్తితో స్మరించు వారికి ప్రత్యక్షమోక్షపదవి ఎందుకుసమకూడదు? కాఁబట్టి యిట్టిఫలదాయకమైన స్మరణము నెన్నఁడును వదలఁగూడదు.

శ్లో॥ శృణుతామలసత్యవచః పరమం। శపథేరితముచ్ఛ్రితబాహుయుగం। నహరేఃపరమోనహరేస్సదృశః। పరమస్సతుసర్వచిదాత్మగణాత్॥ ౪

ఈశ్లోకమందు శ్రీహరియొక్క సర్వోత్తమత్వమును, శపథపూర్వకముగ చెప్పి చుస్తుతించుచున్నారు.

అ॥ హరేః=శ్రీహరికంటె, పరమః=ఎక్కువయినవాఁడు, న=లేఁడు, హరేః=శ్రీహరితో, సదృశః=తుల్యుఁడును, న=లేఁడు, సః=ఆశ్రీహరియే, సర్వచిదాత్మగణాత్= సమస్తచేతన సమూహముకంటెను, పరమః=[గుణములచేత] నుత్కృష్టుఁడు, [ఈప్రకారముగ] ఉచ్ఛ్రితబాహుయుగం=చేతు లెపైకెత్తి, శపథేరితం=శపథముతోఁ జెప్పఁబ

డివ, పరమ=ముఖ్యమయిన, అమల సత్యవచః=దోషరహితమయిన,యథార్థవాక్యమును, లేక— అమల=నిర్మలుఁడగు, సత్య=విష్ణుమూర్తివారి యవతారమైన వేదవ్యాసులవారివాక్యమును, శృణుత=వినుఁడి [ఆయనను ధ్యానింపుఁడని భావము] ఇందుకు ప్రమాణము లు— శ్లో॥ సత్యంసత్యంపునస్సత్య। ముద్ధృత్యభుజముచ్యతే। వేదశాస్త్రాత్పరంనాస్తిన దైవంకేశవాత్పరం॥ నాస్తినారాయణసమం। నభూతంనభవిష్యతి। ఏతేనసత్యవాక్యేన। సర్వార్థాన్ సాధయామ్యహం॥ నతస్యకార్యంకరణంచవిద్యతే। నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే। పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే। స్వాభావికీజ్ఞానబలక్రియాచ॥ నత్వత్సమోస్త్యభ్యధికఃకుతోన్యో। లోకత్రయేప్యప్రతిమప్రభావః॥ ఇత్యాది.

తా॥ దోషరహితమైనయీసత్య [వ్యాస] వాక్యమును వినుము. చేతులుపైకెత్తియిదియేసత్యమని వ్యాసులవారుద్ఘోషించిరి. శ్రీహరికంటె గొప్పదైవత మెందునులేదు. ఆయనకు సమానమైనవారును నెవ్వరునులేరు. ఈచేతనసమూహము లన్నిటికంటె ఆయనయే శ్రేష్ఠుఁడు.

శ్లో॥ యదినామపరోనభవేత్సహరిః। కథమస్యవశేజగదేతదభూత్। యదినామనతస్యవశేసకలం। కథమేవతునిత్యసుఖంనభవేత్॥

శ్రీహరి సర్వోత్తముఁడని యుక్తిచే సాధించి స్తుతించుచున్నారు.

అ॥ సహరిః=ఆవిష్ణుమూర్తి, యదినామ=ఒకవేళ, పరః=పరుఁడే, నభవేత్=కాకపోయినయెడల, అస్య=ఈవిష్ణుమూర్తివారియొక్క, వశే=అధీనమందు, ఏతత్=ఈ, జగత్=ప్రపంచము, కథం=ఎట్లుగా, అభూత్=ఉండుచు. (జగతు విష్ణుమూర్తి వారి వశమందున్నది గనుక నాయన సర్వోత్తముఁడని తాత్పర్యము) తస్య=అప్రసిద్ధుఁడగు శ్రీహరియొక్క, వశే=అధీనమందు. సకలం=సమస్తమును, యదినామ=ఒకవేళ నభవేత్=లేకయే పోయినయెడల, నిత్యసుఖమేవ=నిత్యసుఖమే, తు=అవశ్యముగ, కథం=ఏల, నభవేత్=లేకపోవును. శ్రీహరి సర్వనియామకుఁడు కాకపోయినయెడల, వారు వారుకోరినట్లు వారివారికి నిత్యసుఖము లభించుచుండును. అట్లు లభించుటలేదుగనుక, శ్రీహరి సర్వనియామకుఁడు, సర్వజగత్తు ఆయన స్వాధీనమందున్నదిగనుక, ఆయన సర్వోత్తముఁడని యేర్పడిది.

తా॥ ఒకవేళ శ్రీమహావిష్ణువే సర్వోత్కృష్టుఁడు కానియెడల, ఈ ప్రపంచము ఆయనచేత నెందుకున్నది? అట్టి నియామకుని వశమందే ఈ ప్రపంచములేనియెడల ప్రతివానికి నిత్యసుఖప్రాప్తి యెందుకు లభించలేదు.

శ్లో॥ నచకర్మవిమామలకాలగుణ। ప్రభృతీశమచిత్తనుతద్ధియతః। చిదచిత్తనుసర్వమసౌతుహరి। ర్యమయేదితివైదికమస్తివచః॥ ఉ

స్వతంత్రకారణత్వము కర్మకేగలదని కొందఱును, అజ్ఞానమునకుఁగలదని మఱికొందఱును, రాగాదిదోషములకుఁగలదని యింకగొందఱును, కాలమునకుఁగలదని వేఱొకకొందఱును, ప్రకృతికిఁగలదని వెండియుఁగొందఱును, స్వభావాదులకుఁగలదని మఱికొంద

ష్ఠించుట కెవ్వరును గదా. స్వతంత్ర, కారణత్వ, సర్వోత్తమత్వములు, శ్రీహరికే కాని ఇతరులకు లేవని యిట్లు చెప్పవచ్చును? అను యంశమును సమర్థించుచున్నారు.

అ॥ కర్మ...ప్రభృతి, కర్మ=కర్మయు, విమా=అజ్ఞానము, మల=కామాదిదోషములు, కాల=కాలము, గుణ=సత్త్వరజస్తమోగుణములు, ప్రభృతి=మొదలగాఁగలవి (వీనియు) ఈశం=సమర్థమైన స్వతంత్రకారణము, హి=నిశ్చయముగ, నచ=కాదు. యతః=ఎందువలననఁగా, తత్=పూర్వోక్తమైన కర్మాదికమంతయు, అచిత్తను=జడస్వరూపము. అసౌ=ఈ, హరిస్తు=శ్రీహరియైన, చిదచిత్తను=చేతనా చేతనాత్మకమైన, సర్వం=సమస్తమైనజగత్తును, యమయేదితి=ప్రేరణచేయుచుండునని (శ్రీహరిప్రేరణలేక యేమియు జరుగనేరదు) వైదికం=వేదసంబంధమైన, వచః=వాక్యము (యః పృథివ్యాంతిష్ఠన్ యస్యపృథివీ శరీరం యంపృథివీనవేద యః పృథివీమంతరో యమయతి నచు తేత్వక్రియతే కించనారే, ఇత్యాదిప్రమాణములు) అస్తి=కలదు.

తా॥ కర్మ, అజ్ఞానము, అరిషడ్వర్గములు, కాలము, త్రిగుణములు, మొదలగునవన్నియు జడములనఁదగియున్నవి కావున నిందేవియు స్వతంత్రకారణములు కాలేవు, చేతనా చేతనాత్మకమైన యీయీప్రపంచమునంతను, శ్రీహరియే ప్రేరకుఁడని శ్రుతులుద్ఘోషించుచున్నవి.

శ్లో॥ వ్యవహారభిదాపిగురోర్జగతాం। నతుచిత్తగతా సహిచోద్యపరం। బహవఃపురుషాః పురుషప్రవరో। హరిరిత్యవదత్స్వయమేవహరిః॥ ౭

శ్రీహరికి సర్వోత్తమత్వము లేదనియు "ఐతదాత్మ్యమిదంసర్వం" అనునీమొదలగు శ్రుతులనుబట్టి జీవేశ్వరులకు అభేదమనియు, సంసారదశయందుఁ గనఁబడుచున్న భేదము వ్యావహారికమనియు, మతాంతరులుచేయు వాదమును నిరసించుచున్నారు.

అ॥ జగతః=జగత్తునకు, గురోః=హితోపదేశకులైన శ్రీవేదవ్యాసమూర్తికి వ్యవహారభిదా=జీవేశ్వరులకుఁగల భేదము వ్యావహారికమని, నతుచిత్తగతా=అభిప్రాయ మెంతమాత్రమును కాదు. హి=నిశ్చయము, హరిః=శ్రీహరియైన, సః=ఆవేదవ్యాసులవారే, పరం=ఉత్కృష్టుఁడైన పరమాత్మనుగూర్చి, చోద్య=శంకించి [శ్లో॥ బహవఃపురుషాబ్రహ్మ। న్నుతాహో ఏక ఏవతు। ఇత్యాదిభారతోక్తి] పురుషాః=చేతనులు, బహవః=అనేకులుగలరనియు, హరిః=శ్రీహరి, పురుషప్రవరః=పురుషోత్తముఁడనియు, ఇతి=ఈలాగున, స్వయమేవ=స్వయముగానే, అవదత్=చెప్పిరి- [శ్రీవేదవ్యాసులవారు విష్ణుమూర్తియనుటకు ప్రమాణము- శ్లో॥ కృష్ణద్వైపాయనంవ్యాసం। విద్ధినారాయణం ప్రభుం। కోహ్యన్యఃపుండరీకాక్షా। న్మహాభారతకృద్భవేత్॥ అ॥ కృష్ణద్వైయపాయనులైన వేదవ్యాసులవారిని శ్రీమన్నారాయణమూర్తిగాఁ దెలిసికొనవలయు. పుండరీకాక్షునికంటె వేఱొకరు మహాభారతమునిట్లు రచింపఁగలరు.

తా॥ జీవేశ్వరాదిభేదము కేవలవ్యావహారికమన్నమాట జగద్గురువులగు శ్రీ వేదవ్యాసమూర్తి వాక్యములకు విరుద్ధము. శ్రీ వేదవ్యాసులవారే హరికంటె పరమైన వస్తువు వేఱొకటి లేదనియు, నెఱిఁగిన వారలే పురుషులనియు, శ్రీహరియొక్కఁడే పురుషోత్తముఁడనియుఁ దెలిపియున్నారు.

శ్లో॥ చతురాననపూర్వవిముక్తగణాః, హరిమేత్యతుపూర్వవదేవసదా। నియతోచ్చవినీచతయైవనిజాం। స్థితిమాపురితిస్మ పరంవచనం॥

జీవేశ్వరభేదము సత్యమనుటకు హేత్వంతరమునుఁ జెప్పుచున్నారు.

అ॥ చతురానన...గణాః, చతురానన=చతుర్ముఖబ్రహ్మ, పూర్వ=మొదలు గాఁగల, విముక్తగణాః=ముక్తసంఘములు, హరిం=శ్రీహరిని, ఏత్య=పొంది, పూర్వవదేవ=సంసారావస్థయందువలెనె, నియతోచ్చవినీచతయా, నియత=నియతమైన, ఉచ్చ=ఆధిక్యమును, వినీచతయా=తక్కువతనముగలిగి, సదా=ఎల్లప్పుడు, నిజాం=తమతమయోగ్యతానుసారమైన, స్థితిం=ముక్తిస్థానమును, ఆపుః=పొందుదురు. ఇతి=ఈలాగున, పరంవచనం=వేదవాక్యము, (సైషానందస్య మీమాంసా భవతి॥ ఇత్యాదితైత్తిరీయశ్రుతియును, రుద్రంసమాశ్రితాదేవా। రుద్రోబ్రహ్మణమాశ్రితః। బ్రహ్మామామాశ్రితోనిత్యం। నాహంకించిదుపాశ్రితః, అను భారతవచనమును) స్మ=ప్రసిద్ధముగలదు జుమీ.

తా॥ చతుర్ముఖబ్రహ్మ మొదలుగాఁగల ముక్తగణములు సహితము, తమతమయోగ్యతలననుసరించి, ఉచ్చనీచాత్మకమైన ముక్తిస్థానములనే పొందుచున్నారని వేదము చెప్పుచున్నది. కాఁబట్టి జీవేశ్వరులకు భేదముకలదనుటయే సత్యసిద్ధాంతము.

శ్లో॥ ఆనందతీర్థసన్నామ్నా। పూర్ణప్రజ్ఞాభిధాయుజా। కృతం హర్యష్టకంభక్త్యా। పఠతఃప్రీయతేహరిః॥

"యస్యదేవేపరాభక్తిర్యథాదేవేతథాగురౌ" అను శ్రుతివాక్యమునుబట్టి, తమయిష్టదేవతయందువలెనే, గురువునందుఁగూడ భక్తిగలిగి యుండవలయుననియు, అట్టిభక్తి గురువుయొక్క మహిమ జ్ఞానముచేతనే కల్గుననియు, తెలుపుటకై జగద్గురువులైన శ్రీమదానందతీర్థులవారు తమ స్వరూపమును జ్ఞాపకముచేయుచు, స్తోత్రఫలమును చెప్పుచున్నారు.

అ॥ ఆనందతీర్థసన్నామ్నా, ఆనందతీర్థ, ఆనంద=బ్రహ్మవిషయకమైన, తీర్థ=శాస్త్రముగలిగినవారని యర్థముగల, సన్నామ్నా, సత్=ఉత్కృష్టమైన, నామ్నా=నామధేయముగలిగినట్టియు, పూర్ణప్రజ్ఞాభిధాయుజా, పూర్ణ=(ఇతరులచే సాకల్యముగఁ దెలియఁబడని) పరిపూర్ణమైన, ప్రజ్ఞ=సామర్థ్యముగలవారని అర్థమిచ్చెడు, అభిధాయుజా=నామముగలిగిన శ్రీమదాచార్యులవారిచే, కృతం=రచింపఁబడిన, హర్యష్టకం=శ్రీహరివిషయకమైన, ఎనిమిదిశ్లోకములను, భక్త్యా=భక్తితో, పఠతః=పఠనచేయుచున్నవానికి, హరిః=శ్రీహరి, ప్రీయతే=ప్రసన్నుఁడగును.

తా॥ వేదాంతశాస్త్రసంపన్నులును, అనన్య ప్రజ్ఞాపూర్ణులును, నగు ఆనందతీర్థులను నామముగల, శ్రీపూర్ణప్రజ్ఞాచార్యులవారిచేఁ జేయఁబడిన, యీయాచార్యాష్టకమును భక్తితోఁ బఠించువారికి శ్రీహరి ప్రసన్నుఁడగును.

ఇతి శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్య విరచితే ద్వాదశస్తోత్రే తృతీయోఽధ్యాయః, శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీహయగ్రీవాయనమః.

## చతుర్థోఽధ్యాయప్రారంభః.

**శ్లో॥ నిజపూర్ణసుఖామితబోధతనుః। పరశక్తిరనంతగుణః పరమః। అజరామరణస్సకలార్తిహరః। కమలాపతిరీడ్యతమోఽవతునః॥**

ఈయధ్యాయమందు శ్రీహరిభక్త్యర్థమై సర్వావస్థాప్రేరకత్వాది మహిమను వర్ణించుచు నిర్దోషఅనంతకళ్యాణ గుణస్వరూపియగు శ్రీకృష్ణమూర్తి వారిని స్తుతించుచున్నారు.

అ॥ నిజ...తనుః, నిజ=అనన్యసాధారణమైనట్టియు, పూర్ణ=అనంతమైనట్టియు, సుఖ=ఆనందమును, అమితబోధ=పూర్ణజ్ఞానమును, తనుః=స్వరూపముగాఁగలట్టియు,పరశక్తిః=లోకవిలక్షణమైన సామర్థ్యముగలట్టియు, అనంతగుణః=లెక్కింప శక్యముగానిగుణములుగలట్టియు, పరమః=సర్వోత్తముఁడైనట్టియు, అజరామరణః=జరామరణములులేనట్టియు. సకలార్తిహరః, సకల=సమస్తమైన సజ్జనులయొక్క, ఆర్తి=పీడను, హరః=పోఁగొట్టునట్టియు, ఈడ్యతమః=ముఖ్యస్తుతియోగ్యుఁడైనట్టియు, కమలాపతిః=లక్ష్మీదేవికి భర్తయైనశ్రీహరి, నః=భక్తులయినమమ్మును, అవతు=రక్షించుఁగాక.

తా॥ జ్ఞానానందస్వరూపుఁడై పరిపూర్ణుఁడై, సర్వసమర్థుఁడై, అనంత సుగుణములుకలవాఁడై, జరామరణరహితుఁడై, ఆర్తిహరుఁడై, స్తుత్యార్హుఁడైన, లక్ష్మీనాయకుఁడగు శ్రీహరిమమ్ము రక్షించునుగాక.

**యదసుప్తిగతోఽపి హరిస్సుఖవాన్। సుఖరూపిణ మాహురతోనిగమాః। స్వమతిప్రభవం జగదస్యయతః। పరబోధతనుంచతతః**

**ఖపతిం।**

పూర్వశ్లోకోక్త విశేషణములనే స్వప్రమాణముగ నుపపాదన చేయుచు స్తోత్రము న చేయుచున్నారు.

అ॥ యత్ = ఏకారణమువలన, హరిః = శ్రీహరి, అసుప్తిగతోపి = నిద్రలేనివాఁడై యున్నను, సుఖవాన్ = సౌఖ్యవంతుఁడో, అతః = ఆకారణమువలన (ఆయనను) నిగమాః = వేదములు, (శ్రుతి ..... ఆనందో బ్రహ్మేతివ్యజానాత్॥ ఏతమానందమయమాత్మాన ముప సంక్రామతి। సద్దేహః సుఖగంధశ్చ। జ్ఞానభాస్సత్పరాక్రమః। జ్ఞానజ్ఞానస్సుఖస్సుఖః। సవిష్ణుః పరమాత్మవః। విజ్ఞానమానందం బ్రహ్మేత్యాదివేదవాక్యములు) సుఖరూపిణం = ఆనందస్వరూపునిగ, ఆహుః = చెప్పుచున్నవి యతః = ఏకారణమువలన, అస్య = ఈవిష్ణుమూర్తివారివలననుండి, జగత్ = జగత్తు, స్వమతిప్రభవం, స్వమతి = సంకల్పమాత్రముచే, ప్రభవం = సృష్టింపఁబడినదో, తతః = ఆ కారణమువలననుండి, ఖపతిం, ఖ = ఇంద్రియములకు, పతిం = ప్రేరకునిఁగాను పరబోధతనుం చ = అలౌకిక జ్ఞానస్వరూపునిగాను వేదములు చెప్పుచున్నవి.

తా॥ సర్వదా జాగ్రత్స్వరూపుఁడయ్యును. ఆనందమూర్తియగు శ్రీహరి సంకల్పమాత్రముచే జగత్తును సృష్టించినందున, ఆతఁడు ఇంద్రియప్రేరకుఁడును పరమజ్ఞానస్వరూపుఁడును నైయున్నాఁడు

శ్లో॥ బహుచిత్రజగద్బహుధాకరణా। త్పరశక్తిరనంతగుణః పరమః। సుఖరూపమముష్యపదం పరమం। స్మరతస్తుభవిష్యతితత్సతతం॥

శ్రీహరియొక్క పరశక్తిత్వమును సమర్థించుచు, అనేక అవాంతరభేదములు కలిగిన జగత్తు ఆయనచే సృష్టింపఁబడునని చెప్పుచున్నారు.

అ॥ బహుచిత్రం = అనేకభేదములుగలిగి యాశ్చర్యరూపమగు, జగత్ = జగత్తును, బహుధాకరణాత్ = పలువిధములుగా నిర్మించుటవలన, (శ్రీహరి) పరశక్తిః = విలక్షణమైన శక్తిగలవాఁడును, అనంతగుణః = లెక్కింప శక్యముగాని గుణములుగలవాఁడును, పరమః = సర్వోత్తముఁడును, (అయియున్నాఁడు) అముష్య = ఈవిష్ణుమూర్తియొక్క, సుఖరూపం = ఆనందస్వరూపమును, పరమం = ఉత్తమమైన, పదం = జ్ఞానమువలన పొందఁదగిన స్థానమును, సతతం = యెల్లప్పుడు, స్మరతస్తు = స్మరించినపురుషునికి, తత్ = ఆస్థానముఁ అనఁగా మోక్షస్థానము, భవిష్యతి = కలుగును శ్రీహరిస్మరణచే జ్ఞానముకలిగి, సకలకర్మక్షయమై ముక్తి కలుగును గనుక శ్రీహరి ముముక్షువులకు సర్వదాస్మరింపఁదగినవాఁడని భావము.

తా॥ మిక్కిలివిచిత్రమైన యీప్రపంచమును అనేకవిధముల నిర్మించినట్టియు, విలక్షణశక్తిగలట్టియు, గుణపూర్ణత, సర్వోత్తమత్వము, ఆనందము స్వభావగుణములు గా గలయట్టియు శ్రీహరియొక్క లోకము (వైకుంఠము) ఆయనను, సర్వదా స్మరణ చేయువారికి తప్పక లభించును.

శ్లో॥ స్మరణేహిపరేశితురస్యవిభోః। ర్మలినానిమనాంసి కుతఃక రణం। విమలంహిపదంపరమంస్వరతం। తరుణార్కసవర్ణ మజస్య హరేః॥ ౪

శ్రీహరిస్మరణము కేవలము ముక్తిప్రాపకమేకాక, మనోదోషపరిహారకముగూడక గునని చెప్పుచున్నారు.

అ। అస్య=ఈ, విభోః=సర్వవ్యాపకుఁ డయిన, పరేశితుః=బ్రహ్మాది నియామకుఁడయిన, శ్రీహరియొక్క, స్మరణే=స్మరణముచేయఁబడుచుండఁగ, మనాంసి=అంతఃకరణములు, మలినాని=కామాదిదోషకలుషములు, కుతః=ఎట్లగును. [భగవన్నామస్మరణము చేయువారి మనస్సులు దోషయుక్తములు కావని తాత్పర్యము] కరణం=మనోమాలిన్యమునకు హేతుభూత మయిన విషయానురాగము మొదలగు నవియు కలుగవు. (శ్లో॥ నారాయణోనామ నరోనరాణాం। ప్రసహ్యచోరః కథితః పృథివ్యాం। అనేక జన్మార్జితపాపసంచయం। హరత్యశేషం స్మృతమాత్రఏవ॥ హరిర్హరతిపాపాని। దుష్టచిత్తైరపిస్మృతః। అనిచ్ఛయాపి సంస్పృష్టో। దహత్యేవహిపావకః॥) హి=ప్రమాణసిద్ధము. (కారణము లేనప్పుడు కార్యమును గలుగదనిభావము) ధ్యానము చేయవలసిన శ్రీహరిస్వరూపమును వివరించుచున్నారు. అజస్య=జన్మాది వికారరహితుఁ డయిన, హరేః=శ్రీహరియొక్క, పదం=స్వరూపము, విమలం=నిర్దోషమయినది. పరం=ఉత్కృష్టమయినది. అం=అకారశబ్దవాచ్యమయినది. '[శ్లో॥ అకారస్సర్వవాగాత్మా। పరబ్రహ్మాభిధాయకః।' అనిప్రమాణము.] స్వరతం=తనయందు తానే రమించు స్వభావము కలది. తరుణార్కసవర్ణం, తరుణార్క=బాలసూర్యునితో, సవర్ణం=సమ మగు కాంతిగలది. హి=నిశ్చయముగ స్మరింపుఁడని అధ్యాహార్యము. దూరమందుండు పాపమును అనాదికాలమునుండియున్న అజ్ఞానమును, బోఁగొట్టు వాఁడనియును, విభోః=ఈశితుః, అను విశేషణములకు ముఖ్యతాత్పర్యము. శ్రీహరిస్వరూపము మనోగతమయిన అజ్ఞానమును నివారణచేయునని తరుణార్కసవర్ణం, అనువిశేషణము ద్యోతకము చేయుచున్నది.

తా॥ శ్రీహరిస్మరణము చేయువానికి చిత్తశుద్ధికలుగును. శ్రీహరిస్వరూపము నిర్దోషమయినది. శ్రేష్ఠమయినది. బాలసూర్యునితో సమానమగు కాంతిగలది.

శ్లో॥ విమలైః శ్రుతిశాణనిశాతతమైః। సుమనోసిభిరాశునిహత్యదృఢం। బలినంనిజవైరిణమాత్మతమో। భిదమీశమనంతముపాస్వహరిం॥ ౫

అఖండస్మరణచే సకలదోషనివృత్తియగునని తాత్పర్యముతోను పాసనోపాయము నుచెప్పుచున్నారు.

అ॥ఓ శిష్యులారా! అ॥ శ్రుతి...తమైః శ్రుతి=శ్రుతులనెడు, శాణ=సానయందు, నిశాతతమైః=లెస్సగా పదునుపెట్టఁబడి, విమలైః=స్వచ్ఛములైయున్న, సుమనోసిభిః,

సుమనః=సౌభాగ్యమైన మనస్సులనెడి, అసిభిః=కత్తులచే, అళు=శీఘ్రముగ, బలినం=బలాఢ్యుఁడైన, నిజవైరిణం=రాగాదిదోష సమూహమనెడు శత్రువును, దృఢం=నిర్మూలముగ, నిహత్య=నాశనముచేసి, ఆత్మతమోభిదం, ఆత్మ=జీవస్వరూపమును ఆవరించిన, తమః=అజ్ఞానమును, భిదం=పోఁగొట్టునట్టియు,అనంతం=గుణతఃఅపరిచ్ఛిన్నుఁడైనట్టియు, ఈశం=సర్వనియామకుఁడైనట్టియు, హరిం=శ్రీహరిని, ఉపాస్య=ఉపాసనచేయుఁడు.

తా॥ వేదచోదితజ్ఞానమువలన మనస్సును దృఢముచేసికొని, దానిచే అరిషడ్వర్గమును బోఁగొట్టుకొని, అజ్ఞానమును నివృత్తిచేసికొని, అనంతుఁడై, లోకబాధుఁడైన శ్రీహరిని ఉపాసనచేయవలయు.

శ్లో॥ సహివిశ్వసృజోవిభుశంభుపురందరసూర్యముఖానపరానపరాన్ । సృజతీడ్యతమోవతిహంతినిజం పదమాపయతిప్రణతాన్ సుధియా॥ ౬

సకలజగజ్జన్మాది కారణుఁడగుటవలన శ్రీహరియే ఉపాస్యుఁడనిచెప్పుచున్నారు.

అ॥ ఈడ్యతమః=బ్రహ్మాదులకు స్తవనీయుఁడైన. సః=(ఉపాస్యుఁడని పైశ్లోకమందుచెప్పబడిన) శ్రీహరి, విశ్వసృజః, విశ్వ=సమస్తప్రపంచమును, సృజః=సృజించెడు, విభు...పరాన్, విభు=బ్రహ్మ,శంభు=రుద్రుఁడు,పురందర=ఇంద్రుడు,సూర్య=సూర్యుఁడు, ముఖాన్=మొదలగుదేవతలను, అపరాన్=గంధర్వమానుషాదులను, అపరాన్=ఇతరమైన దైత్యాదిసమస్తచేతనగణములను, అచేతనగణములను, (ప్రతికల్పమందును) సృజతి=సృజించును. అవతి=రక్షించును, హంతి=లయముచేయును. సుధియా=భగవదేకనిష్టమైనసద్బుద్ధితో, ప్రణతాన్=నమస్కరించెడిభక్తులను, నిజం=స్వకీయమైన, పదం=వైకుంఠాఖ్యస్థానమును, ఆపయతి = పొందింపఁజేయును. హి = ప్రమాణప్రసిద్ధము.
శ్లో॥ ఉత్పత్తిస్థితిసంహారా। నియతిర్జ్ఞానమావృతిః। బంధమోక్షౌచపురుషా। ద్యస్మాత్స హరిరేకరాట్॥ శ్రుతులు- ఏకః పురస్తాద్యఇదంబభూవ । యతోబభూవు భువనస్య గోపాః। యమప్యేతిభువనం సాంపరాయె। సనోహరిర్ఘృతమిహాయక్షేత్తుదేవః॥ యతోవా ఇమానిభూతాని జాయంతే యేనజాతాని జీవంతియత్ప్రయంత్యభిసంవిశంతీతి। (ఇట్టి జగదుత్పత్త్యాది హేతుభూతుఁడైన శ్రీహరిని ఉపాసనచేయుఁడని పూర్వశ్లోకముతో నన్వయము.)

తా॥ బ్రహ్మాదులకు స్తవనీయుఁడైన శ్రీహరి సర్వప్రపంచమును, బ్రహ్మను, శివుని, ఇంద్రుని, సూర్యుని, సమస్తచేతనాచేతనములను సృజించి, రక్షించి, లయింపఁజేయుచున్నాఁడు ఆయనతనభక్తులకు వైకుంఠమొసఁగును,

శ్లో॥ పరమోపిరమేశితురస్యసమో। నహికశ్చిదభూన్నభవిష్యతిచ। క్వచిదద్యతనోపినపూర్ణసదా। గణితేడ్యగుణానుభవైకతనోః॥

శ్రీహరికివలె అన్యులెవ్వరికిని ఏకాలమందును జగత్కర్తృత్వాది లక్షణములు లేవని చెప్పుచున్నారు.

అ॥ పూర్ణ...తనోః, పూర్ణ=ఒక్కొక్కటి అనంతమైనట్టియు, సత్=దోషరహితమైనట్టియు, అ=సర్వవిధములచేతను, అగణిత=అసంఖ్యాకమైనట్టియు, ఈడ్య=స్తోత్రార్హమైనట్టియు, గుణ=ఆనందాదిగుణములును, అనుభవ=జ్ఞానమును, ఏక=ముఖ్యమైన, తనోః=స్వరూపముగాఁగలిగిన, అస్య=ఈ, రమేశితుః=లక్ష్మీపతియగు శ్రీహరికంటె, కశ్చిత్=ఎవరును, క్వచిత్=ఏదేశకాలములందును, పరమః=అధికుఁడును, సమోపి=[ఆయనతో] సమానుఁడును, నాభూత్=పూర్వమందు లేఁడు. అద్యతనోపి=వర్తమానమందును, న=లేఁడు. నచభవిష్యతి=ముందును గలుఁగఁబోఁడు. హి=("నాస్తి నారాయణసమం। నభూతం నభవిష్యతి। ఏతేనసత్యవాక్యేన। సర్వార్థాన్ సాధయామ్యహం॥ అను భారతవాక్యము) ప్రమాణసిద్ధము.

తా॥ అనంతములు. దోషరహితములు, నగు గుణములను గలిగి జ్ఞానస్వరూపుఁడైన శ్రీహరితో సమానుఁడుగాని, అధికుఁడుగాని భూతభవిష్యద్వర్తమానముల నెందును నుండఁడు.

శ్లో॥ ఇతిదేవవరస్యహరేస్తవనం। కృతవాన్మునిరుత్తమమాదరతః। సుఖతీర్థపదాభిహితఃపఠత స్తదిదంభవతిధ్రువముచ్చసుఖం॥ ౮

ఈ అధ్యాయస్తుతిఫలమును చెప్పుచున్నారు.

అ॥ ఇతి=ఇట్లు, దేవవరస్య=సర్వోత్తముఁడైన, హరేః=శ్రీహరియొక్క, ఉత్తమం=శాస్త్రార్థసారభూతమైన, స్తవనం=స్తోత్రమును, మునిః=మననశీలుఁగను, సుఖతీర్థపదాభిహితః, సుఖతీర్థ=ఆనందతీర్థులవారనెడు, పద=నామముచే, అభిహితః=పిలువఁబడువారగు, శ్రీమదానందతీర్థ భగవత్పాదులవారు, ఆదరతః=భక్తితో, కృతవాన్=రచించిరి. తదిదం=ఆ ఈస్తోత్రమును, పఠతః=పఠించెడుపురుషునికి, ఉచ్చసుఖం=ఉత్కృష్టమైనసౌఖ్యము, ధ్రువం=నిశ్చయముగ, భవతి=కలుగును, గాన ఈ స్తోత్రము భగవద్భక్తులెల్లరును పఠించి ముక్తినిబొందవలయు.

తా॥ దేవోత్తముఁడైన శ్రీహరిస్తవమును, అత్యాదరముతో మననశీలురగు శ్రీమదానందతీర్థ భగవత్పాదులవారు రచించిరి. ఈ స్తవమును జదువువారికి నిశ్చయముగ ఉత్కృష్టమయిన సౌఖ్యము కలుగును.

ఇతి శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్యవిరచి
ద్వాదశస్తోత్రే చతుర్థోధ్యాయః
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీహయగ్రీవాయనమః.

## పంచమోధ్యాయప్రారంభం.

ఈయధ్యాయమందు శ్రీమదాచార్యులవారు శ్రీహరియొక్క వాసుదేవాది వ్యూహరూపములను స్తుతించుచున్నారు.

శ్లో॥ వాసుదేవాపరిమేయసుధామన్ శుద్ధసదోదిత సుందరీకాంత । ధరాధరధారణవేధురధర్తః సౌధృతిదీధితివేధృవిధాతః॥ ౧

అ॥ హేవాసు, దేవ=సర్వభూతములందును అంతర్యామివై క్రీడాదిగుణవిశిష్టుండవైన యోమహానుభావా! అపరిమేయసుధామన్, అపరిమేయ=ఇంతయనిపరిమాణములేని [అనఁగా] అపరిమితమైన, సు=శోభాయుక్తమగు, ధామన్=వైకుంఠాదిస్థానములుగలవాఁడా! లేక కాంతిగలవాఁడా! లేక హేఅపరిమేయ, హేసుధామన్ అనివిడఁదీసి సంబోధనలుగాఁ జెప్పనచ్చును. అపరిమేయ=ఊహింపశక్యముగానివాఁడా! అవాఙ్మానసగోచరుఁడని భావము] సుధామన్=సు=యోగ్యమగు, ధామన్=స్థానముగలవాఁడా! హేశుద్ధ=అతినిర్మలమయినవాఁడా [అనఁగా] నిర్దోషుఁడా! హేసదోచిత=సదావ్యక్తమైనవాఁడా! లేక,సత్=సజ్జనులచే, లేక ముఖ్యప్రాణమూర్తిచే,లేకముఖ్యప్రాణమూర్తికంటె, ఆ=విశేషముగ, ఉత్=ఉత్కృష్టుఁడవని, ఇత=తెలియఁబడినవాఁడా, లేక స్మరింపఁబడినవాఁడా, లేక సత్=దోషరహితములగు వేదములచే, లేక సత్పురుషులచే, లేక ముఖ్యప్రాణమూర్తిచే, ఆ=విశేషముగ, ఉత్=ఉత్కృష్టుఁడవని, ఇత=అధ్యయనము చేయఁబడినవాఁడా! లేక సత్=సజ్జనులకు, ఆ=లెస్సగా, ఉదిత=వ్యక్తమైనవాఁడా! అనఁగా సజ్జనరక్షణార్థమై యవతారముల నెత్తినవాఁడా! లేక సదా=సర్వకాలములందును, ఉదిత=ఉత్పత్తినిఁగలుగఁజేయుచుండువాఁడా! లేక అస్తమయము లేనివాఁడా! హేసుందరీకాంత, సుందరీ=లక్ష్మీదేవికి, కాంత=వల్లభుఁడా! హేధరాధర, ధరా=భూమిని, ధర=ధరించినవాఁడా! లేక ధర=మందరగోవర్ధనాది పర్వతములను, ఆ=లెస్సగా, ధర=ధరించినవాఁడా! లేక ధరాధరధారణ, ధరాధర=మందరాదిపర్వతములను, ధారణ=ధరించినవాఁడా! లేక ధరాధరధ, ధరాధర=మందరాదిపర్వతములను, ధ=ధరించినవాఁడా! ఆరణవేధుర, ఆ=లెస్సగా, రణ=యుద్ధమందు, వేధుర=శత్రువులను బాధపెట్టువాఁడా! లేక దైత్యులను వేధించువాఁడా! లేక ఆరణ, ఆ=విశేషమైన, రణ=గతిప్రదుఁడా! వేధురధర్తః, వేధుర=శేషమూర్తిని, ధర్తః=ధరించినవాఁడా! (అనఁగా శేషునికాధారుఁడనుట) లేక వేధుర=బాధపెట్టువాఁడా! (అనగా ప్రళయకాలమందు సంకర్షణముఖాగ్నిచే సర్వసంహారము చేయువాఁడనుట) ధర్తః=సర్వజగద్ధారకుఁడా! హేసౌధృతిదీధితివేధృవిధాతః, సౌధృతి=ప్రశస్తమగు ధైర్యము, దీధితి=ప్రకాశము గల, వేధృ=చతుర్ముఖబ్రహ్మను, విధాతః=సృష్టిచేసినవాఁడా! లేక సౌధృతి=సౌభాగ్యమగు ధైర్యముగల జ్ఞానులను, శూరులను, దీధితి=ప్రకాశమానదయచేసెను. వేధా=

చతుర్ముఖబ్రహ్మను, విధాతః=సృజించినవాఁడా! లేక సాధృతి=అనుకూలముగా జగదాధారకులైన సూర్యచంద్రాగ్నులకు, దీధితి=కాంతిప్రదుఁడైనట్టియు (యదాదిత్యగతం తేజో। జగద్భాసయతేఖిలం। యచ్చంద్రమసియచ్చాగ్నౌ। తత్తేజోవిద్ధిమామకం॥ సూర్యునియందు, చంద్రునియందు, అగ్నియందును, ఏతేజస్సు అంతర్గతమై సమస్త జగత్తులను ప్రకాశింపఁజేయుచున్నదో, అట్టితేజస్సు నాసంబంధమైనదని చెప్పెడు భగవద్వాక్యము ప్రమాణము) వేధృవిధాతః=చతుర్ముఖుని సృజించినట్టియు మహానుభావుఁడా! ఇట్టిరోవాసుదేవమూర్తీ, బంధంరంధయ, బంధం=సంసారబంధమును, రంధయ=భస్మముచేయుమని రెండవశ్లోకముతో నన్వయము.

తా॥ సర్వభూతాంతర్యామివైనట్టియు, పరిమాణరహితుఁడవైనట్టియు, అవాఙ్మనస గోచరుడవైనట్టియు, వేదముచేఁ దెలియఁదగినవాఁడవైనట్టియు, మందరాది పర్వతములను ధరించినట్టియు, సర్వప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్నట్టియు, చతుర్ముఖాదులకు సృష్టికర్తవైనట్టియు, వాసుదేవమూర్తి! సంసారబంధమును భస్మముచేయుము.

శ్లో॥ అధికబంధం రంధయబోధా। చ్ఛింధిపిధానం బంధురమద్ధా। కేశవకేశవ శాసకవందే। పాశధరార్చిత శూరపరేశ॥ ౨

అ॥ హేబంధురమ, రమ=లక్ష్మీదేవి, బంధు=ముఖ్యబంధువు రాలుగాఁ గలవాఁడా! లేక, బంధు=బంధువులైన బ్రహ్మాదులను, రమ=సంతోషింపఁజేయువాఁడా! (బాంధవావిష్ణుభక్తాశ్చ, అనుపురాణోక్తిప్రమాణము.) హేద్ధా, ద=కళత్రమనఁగా శ్రీవత్సరూపముతో నున్న లక్ష్మీదేవిని, ధ=(వక్షస్థలమున) ధరించినవాఁడా! బోధాత్=జ్ఞానమునుండి అనఁగా జ్ఞానమును గలుగజేసి, పిధానం=ఆచ్ఛాదకమయిన యజ్ఞానమును, ఛింది=ఛేదించుము. బంధురమద్ధా అనుపదమును, బంధురం, అద్ధా, అనివిభజించవచ్చును. అప్పుడు, బంధురం=బంధకస్వభావముగల, పిధానం=అజ్ఞానమును, అద్ధా=ప్రత్యక్షముగ, ఛింది=ఛేదించుమని అన్వయము. హే అధిక=సర్వోత్తముఁడవయిన శ్రీహరీ, లేక, అ=బ్రహ్మదేవునికి, ధీక, ధీ=బుద్ధిని, క=సుఖమునిచ్చువాఁడా! లేక- అ=చతుర్ముఖునికిని, ధీ=సరస్వతికిని, క=సుఖమునిచ్చువాఁడా! బంధం=అనాది సంసార బంధమును, రంధయ=భస్మముచేయుము. అధికనంథం అనియేకపదముగా నైనను జెప్పవచ్చును. బోధాచ్ఛింది అనక బోధఛింది అనియును పాఠాంతరముగలదు, అప్పుడు బోధ అనఁగా జ్ఞానస్వరూపా! అని విష్ణుసంబోధనముగా నర్థముచెప్పుకొనవలయును. మొదటిశ్లోకమందును ఈశ్లోకముయొక్క పూర్వార్థమందున్న విశేషణములకు సార్థక్యమేమనఁగా, సదోదిత, ధర్తః, వేధుర, అను విశేషణములచే జగత్సృష్టి స్థితి, సంహారకర్తృత్వము చెప్పఁబడుచున్నది. సాధృతి దీధితి, బోధ, పిధానం ఛింది, బంధంరంధయ, అనువిశేషణములచేతను వాక్యములచేతను, ప్రకాశకత్వము, అజ్ఞాననివర్తకత్వము, జ్ఞానప్రదత్వము, మోక్షదాతృత్వమును జెప్పఁబడుచున్నవి. ఇందువలన జ్ఞానమును గలుగఁజేసి యజ్ఞానమును బోఁగొట్టి, అనాదిసంసారబంధమును నివర్తిచేయుటకుఁ బ్రార్థించుచున్నామని ముఖ్యతాత్పర్యమేర్ప

డుచున్నది. వాసుదేవ- అనుపదమువలన వాసుదేవ వ్యూహాంగతమైన, అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవ, నారాయణరూపములైదును గ్రహింపఁబడును. లేక, వాసుదేవ, అపరిమేయసుధామన్, సదోదిత, సుందరీకాంత, ధర్తః, అనుపదములు క్రమముగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, నారాయణ, అనిరుద్ధమూర్తులయొక్క సంబోధనలుగాఁ జెప్పవచ్చును. ఎట్లన- హే వాసుదేవ, వాసు=సర్వప్రపంచమందున్న, దేవ=ప్రభువా, హే అపరిమేయసుధామన్=ప్రళయకాలమందు సూర్యచంద్రాగ్నులకాంతికంటెను త్కృష్టకాంతిగల సంకర్షణమూర్తీ! (యస్స్వోగ్రరంజ్వలజ్జ్వాల తేజసా దాహ్యకారాయితం, అను వాక్యము ప్రమాణము) హే సదోదిత, స=శ్రేష్ఠులగు, జీవోత్తములైన బ్రహ్మవాయువులను, ద=వాంఛార్హలైన, సరస్వతీ, భారతులను. ఉదిత=పుట్టించు, ప్రద్యుమ్నమూర్తీ! (ప్రమాణము, ప్రద్యుమ్నతశ్చాపికృతౌ స్త్రియౌ ద్వే ప్రజజ్ఞతు ర్మహతత్త్వపూర్వకౌ) హే సుందరీకాంత=శ్రీలక్ష్మీనాయకుఁడైన నారాయణమూర్తీ! హే ధర్తః=స్థితికర్తయైన యనిరుద్ధమూర్తీ! (స్థిత్యై పునస్స భగవాననిరుద్ధనామా, అని ప్రమాణము) ఇట్లు పంచవ్యూహరూపములను స్తుతించి, కేశవాది ద్వాదశవ్యూహరూపములను స్తుతించుచున్నారు. హే కేశవ, క=చతుర్ముఖుని, ఈశ=రుద్రుని, వ=సృష్టిలయవ్యాపారములందు ప్రవర్తింపఁజేయువాఁడా! లేక-కేశ=బ్రహ్మరుద్రులకు, వ=జ్ఞానమును గలుగఁజేయువాఁడా! లేక క=వాయుమూర్తి, ఈశ=నియామకుడుగాఁగల వానికి, అనఁగా వాయుభక్తులకు, వ=జ్ఞానమునిచ్చువాఁడా! కేశవ కేశవ, యని ఆదరార్థమందు ద్విరుక్తియనియైనఁ జెప్పవచ్చును. లేక- కేశవకేశవయని ఏకపదముగ జెప్పఁగా నవచ్చును. అర్థము. క=సూర్యుఁడు, ఈశ=రుద్రుఁడు, వ=వాయుమూర్తి, క=చతుర్ముఖప్రపత్ర, వీరలకు, ఈశ=శ్రేష్ఠమగు, వ=జ్ఞానమును, లేక కాంతిని గలుగఁజేయువాఁడా! హే శాసక=శిక్షకుఁడా! హే కేశవశాసక. అనియేకపదముగఁ జెప్పనవచ్చును. క=బ్రహ్మ, ఈశ=రుద్రుఁడు, వ=వరుణుఁడు, మన్మథుఁడును (వీరికి) శాసక=శిక్షకుఁడా! హే పాశధరార్చిత, పాశధర=వరుణునిచే, అర్చిత=(లక్ష్మీవివాహకాలమందు) పూజింపఁబడినవాఁడా! లేక - హే పాశ, ప=చక్రవర్తులకు, లేక - వాయుమూర్తికి, అ=విశేషవను, శ=సుఖమునిచ్చువాఁడా! లేక- పా=పార్వతీదేవికి, శ=సుఖమునిచ్చువాఁడా! హే ధరార్చిత, ధరా=భూదేవిచే, అర్చిత=పూజింపఁబడువాఁడా! లేక-ధర=పర్వతములందనగా, వేంకటాచల,నీలాచల,సింహాచల,భద్రాచల,అష్టాదిపర్వతములందు, అర్చిత=పూజింపఁబడుచున్నవాఁడా! హే శూరవరేశ, శూరవర=శూరశ్రేష్ఠులకు, ఈశ=నియామకుఁడా! లేక-శూరవర=శూరశ్రేష్ఠులలో, ఈశ=ప్రభువా!=అతిశూరుఁడా! లేక- శూర=రావణాదులకు, వర=వరములిచ్చుబ్రహ్మాదులకు, ఈశ=నియామకుఁడా! హే శూరవర, హే ఈశ, అనివిడఁదీయవచ్చును, శూర=అతిశూరుఁడైన వాయుమూర్తికిని, వ=వరుణమన్మథులకును, ర=సుఖమునిచ్చువాఁడా! హే వర, వ=సర్వసుఖకరుఁడైన, వాయుమూర్తికి, లేక వరుణమన్మథులకు, ర=సుఖకరుఁడా! లేక-వ=గరుడమూర్తియందుండి, ర=విహరించువాఁడా! గరుడవాహనుఁడనియర్థము- హే ఈశ=

సమర్థుఁడా! హేవరేశ, అనిత్యసంబోధనవచ్చును. వర=వాయురుద్రులకు, ఈశ=నియామకుఁడా! ఇట్టికేశవమూర్తి (నిన్ను) వందే=నమస్కరించి స్తుతించుచున్నాను.

తా॥ లక్ష్మీదేవి ముఖ్యబంధువురాలుగాఁగలట్టియు బ్రహ్మాదులను సంతోషింపఁజేయువాఁడవైనట్టియు, లక్ష్మీదేవిని వక్షస్థలమందు ధరించినట్టియు, బ్రహ్మాదులకు సుఖము నిచ్చునట్టియు, సర్వోత్తముఁడవైన శ్రీహరీ అజ్ఞానమునుబోఁగొట్టి జ్ఞానమునుదయచేయుము.

శ్లో॥ నారాయణామలకారణవందే। కారణకారణపూర్ణవరేణ్య। మాధవమాధవసాధకవందే। బాధకబోధకశుద్ధసమాధే॥ 3

అ॥ హేనారాయణ=గుణపూర్ణుఁడా! నిర్దోషుఁడా! తెలిసికొనఁబడఁదగినవాఁడా! పొందఁబడఁదగినవాఁడా! హేఅమలకారణ=నిర్వికారముగు కారణమైనవాఁడా! (అనఁగా పరిణామకారణము కాఁడనుట) లేక—అమలక, అమల=నిర్దోషుఁడైన, క=బ్రహ్మకు, లేక—వాయుమూర్తికి, అరణ=రక్షకుఁడా! హేకారణకారణ, కారణ=జగత్కారణములైన ప్రకృత్యాదులకు, కారణ=శక్తిని గలుగఁజేయుటకుఁ గారణమైనవాఁడా! లేక- క=సూర్యుఁడు, అ=బ్రహ్మ, ర=శివుఁడు, అగ్ని, మన్మథుఁడు, న వీరికి, ణ=సుఖమునిచ్చువాఁడా! లేక, క=సూర్యునికి, అరణ=రక్షకుఁడా! క=వాయుమూర్తికి, అనఁగా- ఆయనయొక్క హనుమదాద్యవతారరూపములకు, అరణ=రక్షకుఁడా! హేపూర్ణ=సర్వదేశ కాలగుణములందును పరిపూర్ణుఁడా! హేవరేణ్య=బ్రహ్మాదులచే నుపాసనచేయఁబడి పొందఁబడు సర్వోత్తముఁడా! (నిన్ను) వందే=నమస్కరించిస్తుతించెదను. హేమాధవ, మా=లక్ష్మీదేవికి, ధవ=పతీ! హేమాధవ, మా=జ్ఞానమును, ధ=ధరించినజ్ఞానులయందు, వ=విశేషసాన్నిధ్యము గలిగియుండువాఁడా! లేక-ధ=జ్ఞానులను, వ=ఉపదేశార్థము ప్రవర్తింపఁజేయువాఁడా! లే- మాధవమాధవయని యాదరార్థము దుద్విరుక్తియని చెప్పవచ్చును. లేక- మాధవమాధవయని యేకపదముగాఁ దీసికొనవచ్చును. మాధవ=శ్రీహరివిషయమైన, మా=జ్ఞానము, ధ=ధరించిన=జ్ఞానులకు, వ=కాంతిని, అనఁగా స్వరూపానందరూపమైన మోక్షమును దయచేయువాఁడా! లేక-మాధవమాధవ, మాధవ=మధుకులమందవతరించిన మా=లక్ష్మీదేవికి, ధవ=స్వామియైనవాఁడా! హేసాధక=భక్తుల యభిలాషలను దీర్చువాఁడా! లేక—స=శ్రేష్ఠులైనవారిని, ఆ=లెస్సగా, ధ=పోషణము, క=చేయువాఁడా! లేక-స=గణపతి, అ=రుద్రుఁడు, ధ=కుబేరుఁడు, వీరికి-క=సుఖముగలుగఁజేయువాఁడా! బాధక=[శత్రువులను] బాధించువాఁడా! లేక—బా=సంకోచము, ధ=ధరించిన దేవకీవసుదేవులకు, క=సుఖముకలుగఁజేసినవాఁడా! లేక—బ=గర్భమందు. లేక-బాల్యమందు, అ=విష్ణుసంబంధమైనభక్తిని, ధ=ధరించిన పరీక్షిన్మహారాజునకు, క=సుఖమును గలుగఁజేసినవాఁడా! లేక—బ=కలహామును, ఆ=లెస్సగా, ధ=ధరించిన పాండవులకు. క=సుఖముగలుగఁజేసినవాఁడా! లేక—బ=గురువైన బ్రహ్మకు, అనఁగా బ్రహ్మాది సమస్తమైనవారికి, ఆ=లెస్సగా, ధ=ధారణము, అనఁగా ఆధారము, క=కలుగఁజేసినవాఁడా! (బ్రహ్మరుద్రాదులకు గర్భమం

డల్లరను ధరించినవాఁడని కారము) లేక-బ=పక్షియందు గమనము గలవానిచే, అ=లెస్సగా, ధ=ధరింపఁబడినట్టియు, క=కపిలావతారము గలిగినట్టియు నారాయణుఁడా! హేబోధక=(దేవతలకు వేదవ్యాసకపిల దత్తాత్రేయాది రూపములతో నవతరించి) సమ్యగ్జ్ఞానమును గలుఁగఁజేయువాఁడా! లేక- బ=జగద్గురువైన బ్రహ్మను, లేక- వరుణునికి, ఉ=ఉత్కృష్టమయిన, ధ=పోషణము, క=సుఖమును గలుఁగఁజేయువాఁడా! బాధకబోధక అనియేక పదముగఁ దీసికొన వచ్చును. బ=వరుణుఁడు, అ=రుద్రుఁడు, ధ=కుబేరుఁడు, క=బ్రహ్మవాయువులు, వీరలకు, బోధక=సమ్యగ్జ్ఞానమును గలుఁగఁజేయువాఁడా! హే శుద్ధసమాధే, శుద్ధ=నిర్మలమయిన, సమాధే=(సుజనరక్షార్థము నారాయణ కపిలాది రూపముల యందు) చిత్తైకాగ్రత గలవాఁడా! లేక- శుద్ధ=పరిశుద్ధులయిన, స=బ్రహ్మను, మా=లక్ష్మిని, ధే=ధరించినవాఁడా! లేక- హే శుద్ధ=పరమపవిత్రుఁడా! హే సమాధే, సమ=లక్ష్మీదేవితోఁ గూడికొనియున్న, అధి=సర్వోత్తముఁడా! ఇట్టిమాధవమూర్తివయిన నీకు, వందే=నమస్కరించి స్తోత్రించుచున్నాను.

తా॥ నిర్దోషులయిన బ్రహ్మాదులకు గారణమయినవాఁడా, జగత్కారణమయిన ప్రకృత్యాదులకు మూలమయినవాఁడా, పరిపూర్ణుఁడా, బ్రహ్మాదులచేత నుపాసింపఁ దగినవాఁడా, లక్ష్మీపతీ, మాయకధిపతియయినవాఁడా, నిర్మలమయినవాఁడా, ఏకాగ్రచిత్తముగలవాఁడా, గుణపరిపూర్ణుఁడవైన నారాయణుఁడా, నీకు నమస్కారము.

శ్లో॥ గోవిందగోవిందపురందర వందే। స్కందసనందన వందిత పాద। విష్ణోస్రజిష్ణోగ్రసిష్ణోవివందే। కృష్ణసదుష్ణవధిష్ణోసుధృష్ణో॥ ౭

అ॥ హేగోవింద, గోః=వేదములచే, వింద=తెలియఁబడువాఁడా! లేక-వేదములను బొందువాఁడా! హేగోవింద=భూమిని, లేక- స్వర్గమును, లేక-దిక్కులను, పొందువాఁడా! అనఁగా సర్వత్ర వ్యాపించినవాఁడా! గోవిం గోవిందయని ఏకపదముగాఁ జెప్పుకొనవచ్చును. గోవిందగ, గోవిం=గోవిందని, గ=తెలిసినవారిచే, (అనఁగాజ్ఞానులచే) ఉ=విశేషముగా, విందు=పొందఁబడువాఁడా! లేక-గోవింద=భగవంతుని, గ=పొందినముక్తులచే, విందు=లెస్సగా తెలిసికొనఁబడినవాఁడా! హేపురందర, పురం=లింగశరీరమును. దర=(గంగజాహ్నవీస్నానముచే) విదారణచేయువాఁడా! హేస్కందసనందన వందితపాద, స్కంద=కుమారస్వామిచేతను, సనందన=సనందనునిచేతను, వందిత=నమస్కరింపఁబడిన, పాద=పాదపద్మములుగలవాఁడా! స్కందసునందన, యనుపాఠమందు, స్కంద=కుమారస్వామిచేతను, సునందన=సౌభాగ్యమైన, కుమారుఁడుగాఁగలిగిన శివునిచే, అని అర్థము. స్కందసునంద, నవందితపాద, అని చెప్పవచ్చును. హేస్కందసునంద, స్కంద=స్కందునికి, సునంద=అనుకూలమైన సంతోషమును గలుఁగఁజేయువాఁడా! హేనవందితపాద, న=గణేశునిచే, వందిత=నమస్కరింపఁబడిన, పాద=పాదపద్మములు గలవాఁడా! ఇట్టి గోవిందమూర్తీ, నిన్ను, వందే=నమస్కరించి స్తుతించెదను. హేవిష్ణో=సర్వత్ర వ్యాపించినవాఁడా! హేస్రజిష్ణో=జగత్తును సృజించు స్వ

భావముగలవాఁడా! హే గ్రసిష్ణో=జగత్తును లయము చేయు స్వభావము గలవాఁ
డా! హే కృష్ణ=పూర్ణసుఖము గలవాఁడా! లేక—సకల జగన్నియామకుఁడవై ఆ
కర్షణ చేయువాఁడా! అనఁగా స్వవశమందుంచుకొనువాఁడా! లేక-కృష్ణ (కృ+ష+
ణ,) ష=స్వర్గసంబంధమైన ణ=సుఖమును, కృ=కలుగఁజేయు వాఁడా! లేక
ష=గర్భమోక్షణము, ణ=సమ్యగ్జ్ఞానమును, కృ=కలుగఁజేయువాఁడా! హే సదుష్ట
వధిష్ణో, సత్=సత్పురుషులకు, ఉష్ణ=సంతాపకరులైనవారిని, వధిష్ణో=వధించు స్వభావము
గలవాఁడా! హే సుధృష్ణో, సు=అనుకూలముగ, ధృష్ణో=ధర్మమర్యాదను స్థాపించువాఁ
డా! (ఇట్టి విష్ణుమూర్తి నిన్ను) వి=విశేషముగ, వందే=నమస్కరించి స్తుతించెదను.

తా॥ వేదములచేఁ దెలియఁబడువాఁడా! భూమ్యంతరిక్షములను బొందువాఁడా-
లింగశరీర విదారణ చేయువాఁడా, కుమారసనందనాదులచే నమస్కరింపఁబడు పాదార
విందము గలవాఁడా, సర్వవ్యాపకుఁడా, [జగత్సృష్టినిలయములను జేయు స్వభావము గల
వాఁడా, సర్వము నాకర్షించువాఁడా, సత్పురుషులకు నపకారము చేయువారిని వధించు
వాఁడా, ధర్మమార్గస్థాపకుఁడా, నీకు నమస్కరించుచున్నాఁడను.

శ్లో॥ మధుసూదనదానవసాధన వందే । దైవతమోదితవేదిత
పాద। త్రివిక్రమవిక్రమనిష్క్రమవందే। సుక్రమసంక్రమ హుంకృత
వక్త్ర॥ ౫

అ॥ హే మధుసూదన, మధు=మధువను రాక్షసుని, సూదన=సంహరించినవా
డా! లేక- మధు=ఆనందసాధకమైన, సూద, సు=ఆరోగ్యమైన, ఉద=కర్మలయందు,
న=ప్రవర్తింపఁజేయువాఁడా! హే దానవసాధన, దానవ=రాక్షసుల, సాధన=సంహ
రించువాఁడా! లేక-(ద+అన+వ+స+అధన=దానవసాదన, సాధన అను పాఠము గల
దు) ద=శరణమయిన లక్ష్మీదేవియు, పుత్రుఁడగు బ్రహ్మయు, అ=ముఖ్యప్రాణ
మూర్తి, వ=వరుణ, మన్మథ, గరుడమూర్తులు, వీరికి, సాదన=ఆశ్రయమయిన వాఁడా!
లేక- దానవసాధన అను పాఠమందు పూర్వోక్త బ్రహ్మవాయ్వాదులకు ప్రళయమందు య
థాయోగ్యమయిన లయమును గలుగఁజేయువాఁడా! లేక- దానవ, సాదన, అని వేఱు
వేఱు పదములుగాఁ జెప్పవచ్చును. హే దానవ, దాన=లక్ష్మీబ్రహ్మవాయువులను,
వ=జగద్వ్యాపారమందు ప్రవర్తింపఁజేయువాఁడా! లేక- వారికి- వ=జ్ఞానప్రకాశముల
ను గలుగఁజేయువాఁడా! హే సాదన, సా=ధర్మహేతువైన, లేక- దేహకాంతిని,
ద=దయచేయునట్టి, న=పురుషోత్తమా! లేక- స=శ్రేష్ఠులయిన ముక్తియోగ్యులకు!
అ=లెస్సగా, ద=సమ్యగ్జ్ఞానము, వైరాగ్యము, ముక్తియు, న=కలుగఁజేయువాఁడా
సాధన అను పాఠమందు, హే సాధన=ప్రళయమందు సర్వసంహారము చేయువాఁడా!
హే దైవతమోదిత, దైవత=దేవతలకు, మోదిత=సుఖమునిచ్చువాఁడా! లేక- హే దైవత
మ=ఉత్తమ భాగ్యము గలవాఁడా! హే ఉదిత, ఉది=సముద్రమందు,
త=శయనించినవాఁడా! లేక- ఉది=కర్మనిష్ఠునికి, త=జ్ఞానప్రదుఁడా! దైవత మో

దన అను పాఠమందు, దైవత=దేవతలను, మోదన = సంతోషింపఁ జేయు వాఁడా! లేక- హే దైవతమ, దైవత=దేవతలకు, మా=జ్ఞానము నిచ్చువాఁడా! హే ఉదన, ఉద=కర్మను, న=పొందించువాఁడా! (యోగ్యతానుసారమైన కర్మ చేయించువాఁడని భావము) హే వేదితపాద, వేదిత=భక్తులకుఁ దెలియఁజేయఁబడిన, పాద=పాదమహిమగలవాఁడా! (ఇట్టి మధుసూదనమూర్తీ, వందే=(నీకు) నమస్కరించి స్తుతించెదను. హే త్రివిక్రమ, త్రి=మూఁడులోకములందు, లేక కాలములందు, విక్రమ=అప్రతిహతమైన పరాక్రమముగలవాఁడా! లేక- బలివిజయకాలమందు, త్రి=మూఁడైన, విక్రమ=పాదనిక్షేపములుగల వాఁడా! లేక- త్రి=మూఁడులోకములందు, లేక- కాలములందును, వి=గరుడమూర్తితో, క్రమ=సంచారముగలవాఁడా! లేక - త్రి=మూఁడైనవర్ణాశ్రమాచారవిషయమై, విక్రమ=విశేషక్రమములుగలవాఁడా! జనాదిసజ్జనశిక్షకొఱకు వర్ణాశ్రమాచారముల నవలంబించిన వాఁడా! హే విక్రమ=ఆదరము ద్విరుక్తి, లేక- హే త్రివిక్రమ విక్రమ, యని ఏకపదముగఁ దీసికొనవచ్చును. అర్థము. త్రి=మూఁడులోకములందును మూఁడుకాలములందును, వి=పరమాత్మతోఁగూడ, క్రమ=సంచారము చేయు, వి=పక్షియైన గరుత్మంతునిపైఁ గూర్చుండి, క్రమ=సంచారముగల వాఁడా! లేక- త్రివిక్రమవి=గరుడమూర్తి, క్రమ=సంచరణశక్తిఁ గలుగఁజేయు వాఁడా! హే నిష్క్రమ=వర్ణాశ్రమాచార బద్ధత లేనివాఁడా! హే సుక్రమ=వాసుదేవాది వ్యూహక్రమము గలవాఁడా! లేక- సు=సౌభాగ్యమైన, క్రమ=విహారములు గలవాఁడా! హే సంక్రమ= న్యాయ యుద్ధము గల వాఁడా! లేక- సుక్రమసంక్రమ అని ఏకపదముగఁ దీసికొనవచ్చును. సుక్రమ=యుక్తక్రమముగు, సంక్రమ= యుద్ధముగలవాఁడా! న్యాయ యుద్ధము చేయువాఁడని భావము. హే హుంకృత వక్త్ర= మహాప్రళయ కాలమందు సర్వసంహారకరమైన వక్త్రముగలవాఁడా! లేక- సుక్రమ సంక్రమ హుంకృతవక్త్ర, అని ఏకపదముగఁ దీసికొనవచ్చును. అ॥ న్యాయ యుద్ధమందు హుంకారధ్వనిగల వక్త్రముగలవాఁడా! లేక- సంక్రమ హుంకృత వక్త్ర అని చెప్పవచ్చును. అ॥ యుద్ధమందు హుంకారయుక్తమైన వక్త్రముగలవాఁడా ఇట్టి త్రివిక్రమమూర్తీ! నీకు, వందే=నమస్కరించి స్తుతించెదను.

తా॥ మధుసూదనుని సంహరించినవాఁడా- రాక్షసులను సంహరించు వాఁడా- దేవతలకు సుఖముఁ గలుగఁజేయు వాఁడా భక్తులకుఁ దెలియఁజేయఁబడిన పాదమహిమ గలవాఁడా, మూఁడు లోకములయందు అప్రతిహతమైన పరాక్రమముగలవాఁడా క్రమ సంచారము గలవాఁడా- సౌభాగ్యవిహారముగలవాఁడా న్యాయ యుద్ధముగలవాఁడా హుంకారధ్వని చేయు వక్త్రముగలవాఁడా- నీకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ వామనవామనభామనవందే। సామనసీమనశామనసానో।
శ్రీధరశ్రీధరశంధరవందే। భూధరవార్ధరకంధరధారిన్॥ ౬

అ॥ హే వామన, (భక్తులకు) వామ= సౌందర్యమును, లేక- ధనమును, న=కలుగఁజేయువాఁడా! హే వామన, (అభక్తులకు) వామ=అమంగళము, సంహా

రము, న=చేయుచుంటివాఁడా! లేక- పొట్టియగు వామనావతార మెత్తినవాఁడా
వామన=అపరశబ్దవాచ్యుండగు ద్విరుక్తి. లేక- హేవాము, హేనవా మఁగాని విడఁదీ
యవచ్చును. హేవాము వ=వాయు వరుణ మన్మథ గరుడ మూర్తులకు, అ=విశేష
ముగ, మ=జ్ఞానమును గలుఁగఁ జేయువాఁడా! లేక- వ=వాయు వరుణ మన్మథ గ
రుడ మూర్తులకు, అమ=భగవద్విషయికమైన జ్ఞానమును గలుఁగ జేయువాఁడా!
హేనవామన, నవ=నవవ్యాకరణాభిజ్ఞులైన దేవతలకు, అ=విశేషముగా మన=జ్ఞానముఁ
గలుఁగఁజేయువాఁడా! లేక, నవ=నవబ్రహ్మలకు, లేక, న=విఘ్నేశ్వరుఁడు, వ=వా
యువరుణ మన్మథ గరుడమూర్తులు, వీరికి, అమన, అ=అకారవాచ్య విష్ణుసంబంధమైన,
మన=జ్ఞానమును గలుఁగఁజేయువాఁడా! హేవాము, హేనవ, హేఅమన, అని మూఁడు
పదములుగా విడఁదీయవచ్చును. అ॥ హేవామ(పూర్వోక్తార్థమే) హేనవ=లక్ష్మీబ్ర
హ్మాదులకు మాటిమాటికిఁ గ్రొత్తక్రొత్తగాఁ గనఁబడువాఁడా! లేక- న=అభిన్నమైన,
వ=జ్ఞానము, లేక- కాంతిగలవాఁడా! లేక- న=గణపతికి, వ=జ్ఞానము, కాంతి ని
చ్చువాఁడా! హేఅమన, అ=బ్రహ్మరుద్రులకు, మ=జ్ఞానమును, న=కలుఁగఁజే
యువాఁడా! లేక అ=బ్రహ్మరుద్రులయొక్క, మన=మననమునకు విషయుఁడా! హే
వామన వామనయని ఏకపదముగాఁ దీసికొనవచ్చును. అ॥ వామన=పొట్టిస్వరూపముగ
ల సనకాది పాషండులను, వామ=ఎడమభాగమును, న=పొందించువాఁడా! హేభామ
న=దీప్తిజ్ఞానములుగలవాఁడా! లేక- భా=భార్యయగు లక్ష్మీదేవికి, మ=రతిసుఖమును
న=కలుగఁజేయువాఁడా! భ=శివునికి అ=విశేషముగు, మన=మననశక్తి నిచ్చువాఁడా!
లేక మ=సుఖమును, న=కలుఁగఁజేయువాఁడా! లేక (భక్తులకు) భా=కాంతిని, మ=జ్ఞా
నమును, న=కలుఁగఁజేయువాఁడా! లేక (దైత్యులకు) భామం=క్రోధమును, న=కలుఁ
గఁజేయువాఁడా! భ, అమన, అని విడఁదీయవచ్చును. అ॥ భ=ప్రకాశస్వరూపుఁడా!
హే అమన=మననములేనివాఁడా! (అనఁగా- భగవంతునికి వేఱుపాస్యుఁడొకఁడు లేఁడ
ని భావము) హేసామన, సామ=సమత్వమును, న=పొందినవాఁడా! [అనఁగా- వైష
మ్యనైఘృణ్యములు లేనివాఁడా! లేక- స్వస్వరూపములందు సమత్వమును పొందినవాఁడా!
లేక-సామ=సామగానముచే, న=పొందఁదగినవాఁడా! లేక-సా=శ్రేష్ఠురాలైనలక్ష్మీదేవికి,
మన=మననశక్తినిచ్చువాఁడా! స,అ,మ,న, అని వేఱువేఱుపదములుగాఁ దీసికొనవచ్చును. స=
సారరూపుఁడా! హేఅ=కారణస్వరూపుఁడా! మ=జ్ఞానస్వరూపుఁడా! న=ఆనందస్వరూ
పుఁడా! హేసీమన, సీమ=ధర్మముయొక్క హద్దును, న=ప్రవర్తింపఁ జేయువాఁడా! లేక-
సీ=జ్ఞానవంతులకు, మ=సుఖమును, న=కలుఁగఁజేయువాఁడా! హే శామన, శామ=శ
మాదిసంపత్తిని, న=(తనభక్తులకు) కలుఁగజేయువాఁడా! లేక- శా=లక్ష్మీదేవికి, మ=
సుఖమును, న=కలుఁగఁ జేయువాఁడా! లేక- శా=లక్ష్మీదేవికి, మన=మననశక్తినిచ్చువాఁ
డా! శా=దేవపూజచేత, లేక- క్షమచేత, మ=సుఖమును, న=(భక్తులకుఁ)గలుఁగఁజేయు
వాఁడా! లేక- (భక్తులకు) శా=శోభను, మ=సుఖమును, న=కలుఁగఁ జేయు వాఁడా!
లేక- శ=శివునికి, అ=విశేషమయిన, మ=సుఖమును, న=కలుఁగఁజేయువాఁడా! లేక-

దుఘటాట కార్యనిర్వాహక రూపముగు యశస్సుచేత, లేక-బ్రహ్మమీమాంసాశాస్త్రము చేత, అ=విశేషముగా, మన=ధ్యానింపఁబడువాఁడా ! లేక- శ=ఋషులచే, అ=విశే షముగ, మన=ధ్యానింపఁబడువాఁడా ! లేక-శ=శ్రేయస్సుకొఱకు, అ=విశేషముగ, మ న=ధ్యానింపఁబడువాఁడా ! లేక-ముక్తులచే, లేక-రాజైనదశరథునిచే, అ=విశేషముగ మన=ధ్యానింపఁబడువాఁడా ! లేక—హేశ=మంగళస్వరూపుఁడా ! హేఅమన,అ=బ్ర హ్మరుద్రాదులచేన=ధ్యానింపఁబడువాఁడా! లేక-అత్యంతజ్ఞానరూపీ! హేసానో=సర్వ శశిఖరమువలెనున్నతమైనవాఁడా ! లేక-స=శ్రేష్ఠులైనబ్రహ్మాదులయొక్క, లేక, వేద ములయొక్క, అ=విశేషమైన, నో=స్తోత్రముగలవాఁడా ! అనఁగా-వారివలనవిశేషస్తో త్రము చేయఁబడువాఁడని భావము శామనసానో, అనిఏకపదముగఁదీసికొనవచ్చును. అ॥ శా=లక్ష్మీదేవి, ము=రుద్రచంద్రవహ్నిబ్రహ్మలు, న=వినాయకుఁడు, వీరియొక్క, సానో శ=రాజైనదశరథునికి,అ=విశేషమైన, మ=సుఖమును,న=కలుగఁజేయువాఁడా! లేక-శ= (స+ అ+నః, సంబోధన) సానో=విశేషమగుస్తోత్రములతోఁగూడుకొనినవాఁడా! లేక, శా=లక్ష్మీదేవియొక్క,మ=పరిమళద్రవ్యరూపుఁడయిన భగవంతుని, న=పొందినముక్తుల యొక్క, సానో=స్తోత్రములతోఁ గూడుకొనినవాఁడా! లేక, శా=లక్ష్మీదేవిచే, మనసా =మనస్సుతో, (అనో అనుపదముయొక్క సంబోధన) అనో=అనుసరింపఁబడువాఁడా! ఇట్టిరామమూర్తిని నిన్ను, వందే=నమస్కరించి స్తుతించెదను. శ్రీధర, శ్రీ=(శరీరమం దు) కాంతిని, (వక్షస్థలమున) లక్ష్మీదేవిని, (వదనమున) వేదవాక్కులను, ధర=ధరించిన వాఁడా ! శ్రీధర, శ్రీ=లక్ష్మీదేవికి, ధ=ఆలింగనమును, లేక-సామర్థ్యమును, ర= దయచేయువాఁడా ! శ్రీధరశ్రీధర అని ఏకపదముగాఁ దీసికొనవచ్చును. అ॥ శ్రీ=స రస్వతి, ధ=కుబేరుఁడు, ర=శివ, వహ్ని, కాములు, శ్రీ=లక్ష్మీదేవి, (వీరికి) ధ=సా మర్థ్యమును, ర=దయచేయువాఁడా! లేక-శ్రీ=లక్ష్మీసరస్వతులకు, ధ=సామర్థ్యమును, ర=సుఖమునుకలుఁగఁజేయునట్టి, శ్రీధర=శ్రీధరమూర్తీ ! హేశంధర, శ =దుఃఖాసంభి న్నమైననిరతిశయసుఖమును, ధర=ధరించినవాఁడా ! సింధుర అనుపాఠమందు, సింధ= సముద్రమందు, ర=క్రీడించువాఁడా ! హేభూధర, భూ=భూమిని , ధర=వరాహరూ పముతో ధరించినవాఁడా ! హేవార్ధర, వాః=మహాప్రళయమందు ప్రకృత్యాత్మకమైన జలమును, ధర=ధరించినవాఁడా ! హేకంధర, కం=జలమును (మహాప్రళయమందు) ధ ర=ధరించినవాఁడా! వార్ధరకంధర, అనియేకపదముగాఁ దీసికొనవచ్చును. అ॥ వార్ధర= మేఘమువలె, కంధర=జలమునుధరించినవాఁడా ! హేధారిన్=ధరించఁబడిన చక్రముగ లవాఁడా ! కంధర, ధారిన్, అనియేకపదముగాఁ దీసికొనవచ్చును. అ॥ కం=మూర్తి కసుఖమును, ధర=ధరించినముక్తులకు, ధారిన్=ఆధారుఁడు, పోషకుఁడునైనవాఁడా ! ఇట్టిశ్రీధరమూర్తీ నిన్ను వందే=నమస్కరించిస్తుతించెదను.

తా॥ భక్తులకు సౌందర్యాది గుణములను గలుఁగఁజేయువాఁడా అమంగళములను బోఁగొట్టువాఁడా వామనావతారమెత్తినవాఁడా లక్ష్మీదేవికి సుఖమునుగలుగఁజేయువాఁ డాసామగానముచేఁ బొందఁదగినవాఁడా ధర్మమును బ్రవర్తింపఁజేయువాఁడా శరణాగతసం

పత్తుమకళలం గఁ జేయువాఁడా. ఋషులచే ధ్యానింపఁదగినవాఁడా మంగళస్వరూపుఁడా వేదములచే స్తుతింపఁదగినవాఁడా నీకు నమస్కారము.

శ్లో॥ హృషీకేశ సుకేశ పరేశ వివందే। శరణేశ కళేశ బలేశ సుఖేశ।
పద్మనాభ శుభోద్భవ వందే। సంభృతలోకభరాభర భూరే॥ 2

అ॥ హే హృషీకేశ=సర్వేంద్రియనియామకా! లేక-హృషీ=సంతోషింపఁజేయఁబడిన, కేశ=బ్రహ్మరుద్రులుగలవాఁడా! అనఁగా బ్రహ్మరుద్రులకు మోక్షమునిచ్చునాఁడని భావము. హే సుకేశ, సు=ఆనందరూపములైన, కేశ=శుక్ల, కృష్ణ, కేశములుగలవాఁడా! హే పరేశ, పర=శ్రేష్ఠులైన బ్రహ్మాదులకు, ఈశ=నియామకుఁడా! సుకేశపరేశ అనియేకపదముగా దీసికొనవచ్చును. సుకేశ, సు=మంగళకరమైన, కేశ=కేశములుగలిగిన, పరా=బ్రహ్మాదులకంటె నుత్తమురాలైన లక్ష్మీదేవికి, ఈశ=నియామకుఁడా! హే శరణేశ, శరణ, ఈశ, అని వేఱుగాఁ జెప్పినప్పుడు, శరణ=రక్షకుఁడా! ఈశ=సర్వనియామకుఁడా! ఏకపదముగాఁ దీసికొనినప్పుడు, శరణ=నివాసస్థానములయిన శ్వేతద్వీప, అనంతాసన, వైకుంఠములందు, ఈ=లక్ష్మీదేవికి, శ=సుఖము నిచ్చువాఁడా! లేక-ఈశ. ఈ=లక్ష్మీదేవికి, శ=సుఖప్రదమైన, శరణ=గృహములుగలవాఁడా! లేక—శరణ=రక్షించువానికిని, ఈశ=రక్షకుఁడా! [పరమరక్షకుఁడని భావము] కళేశ, కళ=అఱువదినాల్గు విద్యలకును, లేక—కళా=లక్ష్మీదేవికిని, ఈశ=ప్రభువా! లేక=క-ఉదకమును. లేక—బ్రహ్మను, ల=మహాప్రళయమునందు గ్రహించు, ఈశ=స్వామీ! చలేశ, చలా=చంచలురాలైన లక్ష్మీదేవికి, ఈశ=నియామకుఁడా! బలేశ, అను పాఠమందు, బల=బలవంతులైన వాయ్వాదులకు, ఈశ=నియామకుఁడా! లేక-బల=బలరామునికి, ఈశ=ప్రభువా! హే సుఖేశ, సు=ఆనందమయమైన, ఖ=ఇంద్రియములుగల ముక్తులకు, ఈశ=నియామకుఁడా! లేక, సు=సౌభాగ్యముగు ఖ=శ్రీరంగ, అయోధ్యాది క్షేత్రములయందు నెలకొనియున్న, ఈశ=స్వామీ! లేక- సు=సుజనులైన, ఖ=దీనులకు, ఈశ=ప్రభువా! లేక- సు=ఆనందప్రదమైన, ఖ=స్వర్గమునకు, ఈశ=నియామకుఁడా! లేక-సు=సౌభాగ్యమైన, ఖ=పరాపరతత్వ నిశ్చయముగల జ్ఞానులకు, ఈశ=నియామకుఁడా! లేక-సు=సౌభాగ్యమయిన, ఖ=శాంతులనఁగా జీవన్ముక్తులకు, ఈశ=నియామకుఁడా! లేక-సు=ఆనందరూపియగు, ఖ=గరుత్మంతుఁడు, వినాయకుఁడును, వీరికి, ఈశ=నియామకుఁడా! బలేశ సుఖేశ అని ఏకపదముగఁ దీసికొనవచ్చును. అ॥ బలేశ=బలదేవతయగు వాయుమూర్తియొక్క, లేక-బల=వాయుమూర్తి, ఈ=లక్ష్మీదేవి, శ=శివుఁడు, వీరియొక్క. సుఖ=సుఖమునకు, ఈశ=నియామకుఁడా! హే సుఖ. హే ఈశ అని విడఁదీయవచ్చును, హే సుఖ, సు=ఆనందమయమైన, ఖ-ఇంద్రియములుగలవాఁడా! హే ఈశ, ఈ=పర్వతగుహ- అనఁగా మందరగుహకు, ఈశ=రక్షకుఁడా! ఇట్టి హృషీకేశమూర్తి, నిన్ను, వి=విశేషముగ, వందే=నమస్కరించి స్తుతించెదను. హే పద్మనాభ, పద్మ=

పద్మము, నాభ=నాభియందుగలవాఁడా! లేక, పద్మ=పద్మమువంటి, నాభ=నాభిగల వాఁడా, లేక- ప=వాయుమూర్తి, ద=పుత్రుఁడైన మన్మథుఁడు, భార్యాయగు లక్ష్మీదే వి, మ=శివచంద్ర, అగ్ని, బ్రహ్మలు, న=వినాయకుఁడు, వీరికందఱికిని ఆభ=కాంతి నిచ్చువాఁడా! హేపద్మనాభ అని విభజింపవచ్చును. హేపద్మ, పద=పాదముల యందు, మ=లక్ష్మీదేవిగలవాఁడా! లేక- ప=వాయుమూర్తికి. ద=పుత్రులైనటువం టి బ్రహ్మలకు, మ=జ్ఞానము నిచ్చువాఁడా! హేనాభ, న=వినాయకునకు, ఆభ=కాం తినిచ్చువాఁడా! లేక-న, ఆ, భ, న, అ= లేక పోనటువంటి అనఁగా నిశేషముగా కలిగియున్న, భ = కాంతిగలవాఁడా! హేశుభోద్భవ, శుభ=మోక్షాద్యశేషమంగళము లను, ఉద్భవ = ఉత్పత్తిచేయువాఁడా! హేపద్మనాభ శుభోద్భవ అని ఏక పదముగఁదీ సికొన వచ్చును. పద్మ - పద్మమువంటి. నాభ = అతికాంతిగల, శుభా = పరమమంగళ స్వరూపు రాలయిన లక్ష్మీదేవికి, ఉత్ = ఉత్కృష్ట మయిన, భవ = ఐశ్వర్యము నిచ్చు వాఁడా? హే సంభృత లోకభర, సం=విశేషముగా, భృత=భరింపఁబడిన, లోకభర=(బ్రహ్మాదులు) లోకభారము-గలవాఁడా. హే ఆభర=విశేషాతిశయము గల వాఁడా! హే పూరే= పూర్ణగుణములుగలవాఁడా! సంభృతలోక, భరాభర, అనివిడదీ యవచ్చును. అ॥ సంభృతలోక= అనుకూలముగా ధరించబడిన లోకములుగలవాఁడా! భరాభర, భర= అతిశయముచే, ఆభర= అతిశయుఁడా! (మిగులనతిశయుఁడని భా వము) లేక - భరాభరభూః = అతిశయాతిశయులైన వారికాశ్రయుఁడా! హేఏ= ఏకారశబ్దవాచ్యుఁడా! ఇట్టిపద్మనాభమూర్తిని నిన్ను, వందే =నమస్కరించిస్తుతిం చెదను.

తా॥ ఇంద్రియనియామకుఁడా ఆనందరూపకేశములుగలవాఁడా బ్రహ్మాదులకుని యామకుఁడా సర్వశక్తులకుప్రభువా బలాధికులకుఁబ్రభువా ఆనందమయసుఖస్వరూపుఁడా పద్మమునాభియందుగలవాఁడా మోక్షాదిశుభములనుదయచేయువాఁడా లోకభారమునువ హించినవాఁడా అతిశయాతిశయులైన వారికాశ్రయుఁడా ఇట్టిపద్మనాభమూర్తిని నీకున మస్కరించుచున్నాము.

శ్లో॥ దామోదరదూరతరాంతరవందే। దారితపారగపారపర స్మాత్। ఆనందతీర్థమునీంద్రకృతా। హరిగీతిరియంపరమాదరతః॥

అ॥ హేదామోదర, దామ = పలుపు, ఉదర = (యశోదచేఁ గట్టఁబడ్డప్పుడు) ఉదరమందుఁ గలవాఁడా, లేక- దా = దానముచేయునట్టియు, మా = విష్ణుస్మరణ గల ట్టియు యోగ్యులకు, ఉద = కర్మము, ర = వారివారి యోగ్యతానుసారముగ దయచే యువాఁడా, లేక- హేదామ, దా = సర్వమునిచ్చువాఁడా, మ = సర్వజ్ఞుఁడా, హే ఉదర, ఉ = ఉత్కృష్టమయిన, దర = శంఖముగలవాఁడా, హే దూరతరాంతర, దూ రతర = మిగులదూరమయిన, అంతర = పరిమాణముగలవాఁడా! (సర్వవ్యాపియనియు, అతిస్థూలపరిమాణము గలవాఁడనియును భావము) లేక- హేదూరతర = అత్యంత దూ

రక్షకుఁడా! [అభక్తులకని యర్థము] హే అంతర = అతిసమీపస్థుఁడా! (భక్తులకనియర్థము) పరస్మాత్ = కర్మకంటె నుత్తమోపాయమయిన జ్ఞానసాధనమువలన, దారిత = బ్రద్దలు కొట్టఁబడిన అనఁగా పోఁగొట్టఁబడిన సంసారము యొక్క, పారగ = చివరమాచిన ముక్తులకు, పార = ఆశ్రయుఁడా! లేక - దారితపార, దారిత = నాశనముచేయఁబడిన. పార = శత్రుసమూహముగలవాఁడా ? హే గప, గ = గణనాయకుని, లేక - గంధర్వులను, లేక - గాంధారరాగమును, ప = పరిపాలనచేయువాడా ! హే అర, అ = అకారవాచ్యుఁడును, ర = సుఖస్వరూపుఁడునగు వాఁడా ! పరస్మాత్ అనునది, హే పరస్మ, హే అత్, అని రెండుపదములుగా విడఁదీయవచ్చును. హే పరస్మ = పర = సర్వోత్తముఁడైనతన యొక్కయు. స = జీవోత్తముఁడైనవా ! యుమూర్తియొక్కయు, మ = జ్ఞానమును కలుగఁజేయువాఁడా ! హే అత్ ప్రళయ = మందు సర్వవినాశము చేయువాఁడా ! లేక - హే పరస్మాత్, పర = శత్రువులయొక్క స = సాకారమును, మా = జ్ఞానమును, అత్ = వినాశము చేయువాఁడా! పర, స్మ, అత్, అనిమూడుపదములుగా విడఁదీయవచ్చును. హే పర, ప = వాయుమూర్తియం, దు, ర = ఆసక్తి, అనఁగా భక్తిని కలుగ జేయువాఁడా! స్మ, స = వాయు, మూర్తికి, మ = హరిస్మరణసర్వదా కలుగఁజేయువాఁడా! హే అత్ = సర్వసంహారక ఇట్టి దామోదరమూర్తీ! వందే = (విష్ణు) నమస్కరించిస్తుతించెదను. స్తుతిఫలమును చెప్పుచున్నారు ఇయం = ఈ, హరిగీతిః = శ్రీహరిని గూర్చిన గానయోగ్యమయిన స్తుతిని, పరమాదరతః = అత్యంతభక్తిపూర్వకముగ, ఆనందతీర్థమునీంద్రకృతా, ఆనంద తీర్థుల వారనెడు, మునీంద్ర = మునిశ్రేష్ఠులచే, కృతా = రచించఁబడినది.

తా॥ నాశముదరముఁదుఁ గలవాఁడా! మిగులశూరము నుండు పరిమాణము గలవాఁడా! పగలఁగొట్టఁబడిన సంసారాంతముగలవాఁడా! నాశనము చేయఁబడిన శత్రు సమూహముగలవాఁడా! సర్వోత్తమమయిన జ్ఞానమును గలుగఁజేయువాఁడా! నీకునమస్కారము.

పరలోకవిలోకన సూర్యనిభా హరిభక్తి వర్ధనశౌండతమా॥ అ॥ ఈస్తుతి చదివెడి వారికిని, వినువారికిని, పరలోకవిలోకనసూర్యనిభా, పరలోక = వైకుంఠలోకమును, విలోకన = చూచుటయందు, సూర్యనిభా = సూర్యునితోసమానమయినది. (అనఁగా సూర్యునివలన సమస్తలోకము మెట్లుకనఁబడునో, ఈస్తోత్రమభ్యసించినవారికి శ్రీహరిలోకము సులభముగ కనఁబడునని భావము) మఱియును ఈస్తుతి, హరిభక్తివివర్ధన శౌండతమా, హరి = శ్రీహరియందు, భక్తి = మాహాత్మ్యజ్ఞాన పూర్వకమయినభక్తిని, వివర్ధన = వృద్ధిపొందించుటయందు, శౌండతమా = అత్యంతసమర్థమయినది.

తా॥ ఆనందతీర్థులవారనెడి మునిశ్రేష్ఠులచే రచింపఁబడిన ఈస్తుతిని చదివినవారికిని వినినవారికిని, సూర్యతేజస్సువలె లోకమంతయుఁ గనుపించినట్టుల శ్రీహరిలోకము సిద్ధించును. శ్రీహరియందు భక్తిపూర్వకమయిన జ్ఞానమును వృద్ధిపొందించుటయందు అత్యంత సమర్థమయినది.

ఇతి శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్య విరచితే ద్వాదశస్తోత్రే

పంచమోఽధ్యాయః. శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీగురుభ్యోనమః.

## షష్ఠాధ్యాయప్రారంభః.

---

ఈ అధ్యాయమందు శ్రీహరియొక్క నిర్దోషపూర్ణానందాదిగుణవిశిష్టమైన మత్స్యాది దశావతారములను వర్ణించుచున్నారు. ఈ మత్స్యాద్యవతారచర్యలనుస్మరించుట మోక్షసాధనమనుటకు ప్రమాణము. శ్లో॥ మత్స్యకూర్మవరాహాద్యైః రవతారైఃకృతాని మే. కర్మాణ్యనంతపుణ్యాని స్మరతాంమోక్షదానిచ॥ అ॥ మత్స్యకూర్మవరాహాద్యవతారములెత్తి నాచేఁజేయఁబడిన చర్యలు అనంతపుణ్యప్రదములు. స్మరించినవారికి మోక్షము నిచ్చునవని భగవద్వాక్యము

శ్లో॥ మత్స్యకరూపలయోదవిహారిన్। వేదవినేత్ర చతుర్ముఖవంద్య।
కూర్మస్వరూపక మందరధారిన్। లోకవిధారక దేవవరేణ్య॥ ౧

అ॥ హేమత్స్యకరూప, మత్స్యక=మత్స్యమువంటి, రూప=రూపమును ధరించినవాఁడా, లేక, మత్స్యక=మత్స్యమువంటి, కరూప=సుఖస్వరూపము గలవాఁడా, లేక, హేమత్స్య, మత్=దైత్యులయొక్క మదమును, స్య=ఖండించిన మత్స్యావతారము నెత్తినవాఁడా! హేకరూప=సుఖస్వరూపుఁడా, లయోదవిహారిన్, లయోద=ప్రళయసముద్రజలమందు, విహారిన్=క్రీడించువాఁడా, లేక - హేలయోద(లయ × ఉ × ద)లయ=లయవ్యాపారమును, ఉ=మదురినికి, ద=ఇచ్చువాఁడా, విహారిన్=వివిధమైన హారములు గలవాఁడా, హేవేదవినేత్రచతుర్ముఖవంద్య, వేదవినేత్ర=వేదములను ప్రవర్తింపఁజేసేడు, చతుర్ముఖ=బ్రహ్మకు, వంద్య=స్తోత్రము చేయఁబడువాఁడా, లేక, హేవేదవినేత్ర=వేదములను బ్రహ్మనుగూర్చి తెచ్చినట్టియు, చతుర్ముఖవంద్య=బ్రహ్మచే స్తోత్రము చేయఁబడినట్టి

యా, మహానుభావా! (వేదవిశేత్రిచతుర్ముఖవంద్య అను పాఠమామందు) వేదవిశేత్రి వే
ద=వేదములను, వి=విశేషముగ, శేత్రి=(సోమకాసురుని సంహరించి) పైకిదెచ్చినవాఁ
డా! లేక, వేద=వేదములను, వి=గరుత్మంతునికి, శేత్రి=తెచ్చినవాఁడా, అనఁగా=
ఉపదేశించినవాఁడా, లేక, వేద=వేదవిషయములందు, విశేత్రి=విశేషదృష్టి అనఁగాజ్ఞాన
ముగల,చతుర్ముఖవంద్య=బ్రహ్మచే నమస్కరింపఁబడువాఁడా, ఈసంబోధనలన్నిటికిని మం
దరధారిన్ గోవిందవందే అనుఆరవశ్లోకములోనివందే అనుక్రియాపదముతో నన్వయము.
ప్రతిపదము స్తుతిరూపమేయగుటవలన క్రియాసంబంధములేక పోవుటదోషముకాదు,
కూర్మస్వరూపక=కూర్మావతారా! కు+ఉ+ర్మ=కూర్మ, కు=పృథివిలో భూదేవితో
వేంకటాచలముమొదలగు పర్వతములందు, ఉ=ఉత్కృష్టముగా, ర్మ=రమించువాఁడు,
లేక, కు=భూదేవికి, ఉ=ఉత్కృష్టమైన, ర్మ, ర=సుఖము, మ=జ్ఞానమునుదయచేయు
వాఁడు, స్వరూపక, క=సుఖము, స్వరూప=స్వరూపము గాఁగలవాఁడు, (అవతారప్ర
యోజనముచెప్పుచున్నారు) హేమందరధారిన్, మందర=మందరపర్వతమును, ధారిన్ =
ధరించినవాఁడా! (అమృతముకొఱకు సముద్రమథనముచేయుకాలములో సముద్రమందు
మునిఁగిపోవుచున్న మందరపర్వతమును ధరించినవాఁడని తాత్పర్యము) లోకవిధారక,
లోక=లోకమునుఅనఁగా చతుర్దశభువనాత్మకమైన బ్రహ్మాండమును, విధారక=ఆదికూ
ర్మరూపముచే ధరించిన మహానుభావా! దేవవరేణ్య, దేవ=దేవతలచే, వరేణ్య=వరింపఁ
బడువాఁడా అనఁగా సేవింపఁబడువాఁడా, లేక=దేవ, వరేణ్య, అని భిన్నపదములుగా
నైనను చెప్పవచ్చును. ఇట్టికూర్మావతారమైన నీకు నమస్కరించుచున్నానని యన్వయము

తా॥ మత్స్యావతారమునుధరించి విశేషముగు మహాప్రళయ సముద్రజలమందు వి
హారించినట్టియు, వేదములను బ్రవర్తింపఁజేసిన బ్రహ్మదేవునిచే స్తుతింపబడినట్టియు, కూ
ర్మావతారమునుధరించి మందరపర్వతమును ధరించినట్టియు, చతుర్దశభువనములను ధ
రించినట్టియు, దేవశ్రేష్ఠుఁడవైననీకు నమస్కారము.

శ్లో॥ సూకరరూపక దానవశత్రో। భూమివిధారక యజ్ఞవరాం
గ। దేవనృసింహహిరణ్యకశత్రో। సర్వభయాంతకదైవతబంధో॥ ౨

అ॥ హేసూకరరూపక, సూకర=వరాహ, రూప=రూపమునుధరించిన, క=సు
ఖముచుమూర్తి, లేక- హేసూకర=ఓవరాహమూర్తీ, హేరూపక, రూప=స్వరూపా
త్మకమయిన సమస్తప్రపంచమునకు, క= సుఖమునిచ్చువాఁడా! (యజ్ఞములు వరాహ
మూర్తియొక్క అంగములుగనుకను, మేఘములు యజ్ఞములవలన పుట్టినవిగనుకను, మే
ఘములచే సర్వసస్యసమృద్ధిగా గుటవలనను, సమస్తప్రపంచమునకు సుఖప్రదుఁడు వరాహ
మూర్తియనుట సయుక్తికముగనే యున్నది) లేక, సూకర,సూ=గర్భమోక్షమును, కర=
జీవునికిఁగలుగఁజేయువాఁడా! దానవశత్రో, దానవ=హిరణ్యాక్షునికి, శత్రో=శత్రు
వైనవాఁడా! భూమివిధారక=భూమిని(దంష్ట్రాగ్రమందు)ధరించినమూర్తి! లేక, భూ =
భూమికి, వి=గరుత్మంతునికి, ధ=కుబేరునికి, అ=రుద్రునికి, ర=అగ్నికి, (లేక, కామని

శ) ని, క=సుఖప్రదుఁడా! లేక, హే భూమివిధ, భూమి=భూమియందు, వి=గరుత్మం తుని చే, ధ=ధరింపఁబడువాఁడా (అనఁగా గరుడవాహనారూఢుఁడవై భూమియందు సంచరించువాఁడవని తాత్పర్యము) హే అరక, అ=బ్రహ్మరుద్రులకును, ర=సుఖమును, క=కలుఁగఁజేయువాఁడా! లేక, అ=బ్రహ్మరుద్రులకును, ర=అగ్ని కాములకును, క=సుఖమునిచ్చువాఁడా, లేక, అర=దోషములను, క=పరిహారముచేయువాఁడా! లేక, అర=దోషాభిమానులగు రాక్షసులను, క=అగ్నివలె దహించువాఁడా! యజ్ఞవరాంగ, యజ్ఞవర=యజ్ఞశ్రేష్ఠములైన అశ్వమేధాదులు, అంగ=అవయవములయందుఁ గలఁవాఁడా! లేక-హే యజ్ఞ=యజ్ఞభోక్తగనుక యజ్ఞనామము గలవాఁడా! వరాంగ, వర=సర్వ జీవోత్తముఁడైన బ్రహ్మ, అంగ=స్వశరీరమందు గలవాఁడా! అనఁగా బ్రహ్మకు సర్వాంగసాయుజ్యము నిచ్చువాఁడని భావము) లేక- యజ్ఞవర=సర్వయజ్ఞపతీ! హే అంగ=అప్రధానమైన జగత్తునకు నియామకుఁడుగానుండువాఁడా! లేక-అం=మోక్షప్రదుఁడైన వాసుదేవమూర్తిని, గ=పొందించువాఁడా! ఇట్టి వరాహమూర్తివైన నిన్ను నమస్కరించుచున్నానని యన్వయము- దేవ=క్రీడాదిగుణములుగలవాఁడా! లేక-దివ్యమైన ప్రకాశముగలవాఁడా! నృసింహ=నరసింహరూపమును ధరించినవాఁడా! లేక-దేవ=దేవతలకును, నృ=మనుష్యులకును, (అనఁగా దేవాది సమస్తమయినవారికిని) సింహ=(మృగములకు సింహమేలాగో ఆలాగున నే) ప్రభువా! హిరణ్యకశతో, హిరణ్యక=(ప్రహ్లాదుని రక్షించుటకై) హిరణ్యకశిపుని, శతో=సంహారించినవాఁడా! సర్వభయాంతక, సర్వభయ=సమస్తభయములను, అంతక=(స్వనామస్మరణచే) పోఁగొట్టువాఁడా! లేక-సర్వభయ=సమస్తమయినవారికిని భయమునుగలుగఁజేయువాఁడా! అంతక=భయమును బోఁగొట్టువాఁడా! (భయకృద్భయనాశనః అని ప్రమాణవాక్యము) లేక-అం=బ్రహ్మకును, రుద్రునికిని, త=అనుకూలమయిన జ్ఞానోపదేశమును, క=చేయువాఁడా! దైవతబంధో, దైవత=దేవతలకు, బంధో=బంధువా! లేక- దైవ=దేవతలకు, త=జ్ఞానోపదేశకుఁడైనవాయుమూర్తికి, బంధో=బంధువా! ("ఉరుక్రమస్యసహిబంధురిత్థా" అను శ్రుతిప్రమాణము) లేక-అంతకదైవతబంధో అనునది ఏకపదముగాఁ దీసికొనవచ్చును. అ॥ అంతకదైవత= సంహారకుఁడగుటచే అంతకుఁడను పేరఁ బరగు వైవస్వతునికి, లేక-శివునికి, బంధో=బంధువా! ఇట్టి నృసింహమూర్తివైన నీకు నమస్కరించెదనని యన్వయము.

తా॥ హిరణ్యాక్షునకు శత్రువై భూమిని కోరచికొరను ధరించినట్టియు, అశ్వమేధాది క్రతువులు అవయవములందుగలట్టియు, వరాహావతారమెత్తినట్టియు, హిరణ్యాక్షశత్రువై, సమస్తమయిన రాక్షసగణములకు భయంకరుఁడవైనట్టియు, దేవతలకు బంధువైనట్టియు, నృసింహావతారమును ధరించిన నీకు నమస్కరించెదను.

శ్లో॥ వామనవామనమాణవవేష। దైత్యవరాంతకకారణరూప।
రామభృగూద్వహసూర్జితదీప్తే। క్షత్రకులాంతకశంభువరేణ్య॥ ॥ 8 ॥

అ॥ వామన= బలిచక్రవర్తియొందుఁగల దైత్యులయొక్క- రైశ్వర్యమును, లేక- ద ర్పమును నాశనము చేయువాఁడా! లేక- వామ=శోభాయమానమయిన జ్ఞానభక్త్యాదిగుణ ములచే, నః=శక్యుఁడా! వామన=పొట్టిదైనస్వరూపముగల వామనమూర్తీ! మాణవవేష, మాణవ=బ్రహ్మచారియొక్క- వేషమువంటి, వేష=వేషమునుధరించినవాఁడా! దైత్యవరాంతక, దైత్యవర=బలివిజయకాలమందువచ్చిన దైత్యశ్రేష్ఠులను,అంతక=నాశనముచేసినవాఁడా! లేక- దైత్యవర, దైత్య=బలిచక్రవర్తికి, వర=(పాతాళలోకమందు రాజ్యము చేయుమని) వరమునిచ్చినవాఁడా! అంతక, అంతి=రమ్యమయిన (దుఃఖమిశ్రితముకాని, అనఁగా నిరతిశయమయిన) క=సుఖముగలవాఁడా, లేక- అంత=రమ్యులయినభక్తులకు, క=సుఖమునిచ్చువాఁడా! అంతకకారణరూప, అంతక=నాశనమునకు, కారణ=కారణమయిన, రూప=సంకర్షణరూపము గలవాఁడా! లేక, అంతక= రమ్యసుఖమునకు, అనఁగా మోక్షానందమునకు, కారణ=కారణమునుదయచేయువాఁడా! రూప=సర్వరూపములను ధరించినవాఁడా! లేక, కారణరూప=(మోక్షానందమునకు) కారణము నుదయచేయు స్వరూపముగలవాఁడా! ఇట్టివామనమూర్తీనిన్ను నమస్కరించుచున్నానని అన్వయము, రామ=సమస్తలోకములందును క్రీడించుచున్నవాఁడా! భృగూద్వహ- భృగు=భృగువంశస్థులసంతతిని, ఉద్వహ=ఉద్ధరించినమూర్తీ, నూర్జితదీప్తే, నూర్జిత=ఉత్కృష్టమయిన, దీప్తే=కాంతిగలవాఁడా! క్షత్రకులాంతక, క్షత్రకుల=బ్రహ్మద్వేషులై దుష్టులైన క్షత్రియవంశములను, అంతక=నాశనముచేసినవాఁడా! శంభువరేణ్య, శంభు=శివునిచే, వరేణ్య= సేవింపఁబడువాఁడా! ఇట్టిపరశురామమూర్తీ నిన్ను నమస్కరించెదనని యన్వయము.

తా॥ రాక్షసులయొక్క- యైశ్వర్యమును సంహరించినవాఁడవును. పొట్టివాఁడవును, బ్రహ్మచారిరూపమును ధరించినవాఁడవును. రాక్షసశ్రేష్ఠులను వధించినవాఁడవును, బలిచక్రవర్తికి వరమునిచ్చినవాఁడవును, వామనావతారమెత్తినవాఁడవును. సమస్తలోకములయందు క్రీడించినవాఁడవును, భృగువంశస్థుల నుద్ధరించినవాఁడవును, ఉత్కృష్టమయిన కాంతిగలవాఁడవును, శివునిచే సేవింపఁబడినవాఁడవును, పరశురామమూర్తివియు నైన నీకు నమస్కారము.

శ్లో॥ రాఘవ రాఘవ రాక్షసశత్రో। మారుతివల్లభ జానకికాంత
దేవకినందన సుందరరూప। రుక్మిణివల్లభ పాండవబంధో॥ ౮

అ॥ రాఘవ=రఘుకులమందుద్భవించినవాఁడా! రాఘవ, [రా+అఘ×వ] అఘ=పాపమును, రా=నాశనము చేయువాఁడును, వ=వాంఛితములుదయచేయువాఁడును గనుక రాఘవః, ఇట్టిరాఘవమూర్తీ, [వ్రమాణము-అఘంరావయతె యస్మాత్ వ్వకారోవాంఛితప్రదః] లేక, అఘ= అఘసంబంధముగలవారు, అనఁగా. దోషాభిమానులైన రాక్షసులను, ర=నాశనముచేయునట్టియు, వ=జ్ఞానస్వరూపముగలట్టియు శ్రీరామమూర్తీ! రాక్షసశత్రో, రాక్షస=సుబాహుమారీచరావణకుంభకర్ణాది రాక్షసులను, శత్రో=సంహరించిన

నాశకమునందమువులుగలవాఁడా ! లేక, నందితగోకులవందితపాద, నందిత=(గోవర్ధనోద్ధరణము చే) సంతోషింపఁజేయఁబడిన, గోకుల=గోకులముచే, వందిత=నమస్కరింపఁబడిన, పాద=పాదములుగలవాఁడా! నిన్ను నమస్కరించుచున్నానని అన్వయము.

తా॥ దేవకీదేవిపుత్రుడవును, నందునికుమారుఁడవును, బృందావనమందు సంచరించునట్టియు, గోకులమునకు చంద్రుఁడైనట్టియు, కందమూలఫలములనుతినునట్టియు, చక్కనిరూపముగలట్టియు, సంతోషించిన గోకులముచే నమస్కరించఁబడిన పాదపద్మములు గలట్టియు మహాత్ముఁడవగునట్టి నీకు నమస్కారము.

శ్లో॥ ఇంద్రసుతావకనందకహస్త। చందనచర్చితసుందరినాథ।
ఇందీవరోదరదళనయన। మందరధారిన్ గోవింద వందే॥ ౬

అ॥ ఇంద్రసుతావక, ఇంద్రసుత=అర్జునుని, అవక=శత్రువులవలనఁ బ్రయోగింపఁబడిన అస్త్రములవలననుండి రక్షించినవాఁడా! లేక- ఇంద్రసుత= అర్జునునికి, అవ=రక్షణమును, క=సుఖమును దయచేయువాఁడా! నందకహస్త=నందకమను పేరుగల ఖడ్గముహస్తమందు గలవాఁడా! లేక- నంద=ఆనందమును, క=కలుగఁజేయునట్టి, హస్త=హస్తముగలవాఁడా! నందసుహస్త, అను పాఠమందు, నంద=ఆనందకరమయినవస్తువు, సుహస్త=యోగ్యమయిన హస్తములందుగలవాఁడా! లేక- నంద=గోపాలుర కానందకరమయిన గోవర్ధనపర్వతము, సుహస్త=యోగ్యమయిన హస్తమందు గలవాఁడా చందనచర్చిత=(భక్తులచే) పూయఁబడిన చందనముగలవాఁడా! సుందరీనాథ, సుందరీ=గోపస్త్రీలకు, నాథ=స్వామీ ! లేక, చందనచర్చితసుందరినాథ=చందనముపూసికొనిన గోపస్త్రీలకు ప్రాణవల్లభుఁడా! ఇందీవరోదరదళనయన, ఇందీవర=తామరకమలముల యొక్క, ఉదర=మధ్యభాగమునందలి. దళ=దళములవలె విశాలరమణీయములైన, నయన=నేత్రములుగలవాఁడా! మందరధారిన్, మందర, మంద=అవివేకులయిన, గో=గోపాలకులను, ర=సంతోషింపఁజేసిన గోవర్ధనపర్వతమును, ధారిన్=ధరించినవాఁడా! గోవింద=వేదములచేఁ బ్రతిపాదనచేయఁబడు స్వరూపముగలవాఁడా ! ఇట్టి శ్రీకృష్ణమూర్తిని న్ను, వందే=నమస్కరించి స్తుతించుచున్నాను.

తా॥ ఇంద్రపుత్రుఁడగు అర్జునుని రక్షించినట్టియు, ఖడ్గమును ధరించినట్టియు, గోపబాలుర కానందకరమయిన గోవర్ధనపర్వతమెత్తినట్టియు, మంచిగంధము పూసికొన్న, సౌందర్యముగల గోపస్త్రీలకు ప్రాణవల్లభుఁడవైనట్టియు, తామరకమలముయొక్క మధ్యభాగమందలి దళములవలె విశాలరమణీయములయిన నేత్రములుగలట్టియు, వేదములచే దెలియఁబడు స్వరూపముగలట్టియు, నీకునమస్కారము.

శ్లో॥ చంద్రకళాననకుందసుహాస। నందితదైవతనందసుపూర్ణ।
దైత్యవిమోహకనిత్యసుఖాదే। దేవసుబోధకబుద్ధస్వరూప॥ ౭

అ॥ చంద్రకళానన. చంద్రకళ=అనేక చంద్రులవలె ఆహ్లాదకరమైన, ఆనన=ముఖముగలవాఁడా ! లేక—చంద్ర=చంద్రునివలె, క=సుఖమును, ల=కలుగఁజేసెడు, అ

నన=ముఖముగలవాఁడా! కుందసుహాస, కుంద=కుందపుష్పమువలె ప్రకాశమైన,హాస=మందహాసముగలవాఁడా! లేశ—చంద్రశతానన కుందసుహాస, చంద్రశతానన=అనేక చంద్రులవలె నాహ్లాదకరమైన ముఖమందు, కుందసుహాస=కుందపుష్పములవలె శోభించెడి చిఱునవ్వుగలవాఁడా! నందితదైవత, నందిత=(భూభారహరణముచే) సంతోషింపఁ జేయఁబడిన, దైవత=బ్రహ్మాదులుగలవాఁడా! నందసుపూర్ణ, నంద=అలౌకికానందముచే, సుపూర్ణ=సంపూర్ణుడా! ఇట్టి శ్రీకృష్ణమూర్తీ నిన్ను నమస్కరించి స్తుతించుచున్నానని యన్వయము. (ఈ యధ్యాయమందు 'దేవకీనందన' అను శ్లోకమారంభించి అనేక గానలను వర్ణించుచు శ్రీమదానందతీర్థులవారు శ్రీకృష్ణస్తవమును విశేషముగఁ జేయుటకుఁ గారణము- శ్రీకృష్ణావతారము ఈ యుగమున కత్యంత సన్నిహితమైనద్వాపరయుగాంతమందలి దగుటచేతనే. ఇట్లే పంచరాత్రగమోక్తమైన కార్తీకమాహాత్మ్యమందలి దశావతార స్తవమందు శ్రీకృష్ణవిషయమైన గానలు విశేషముగ వర్ణింపఁబడియున్నవి. ఈ ద్వాదశస్తోత్రములను పఠించుచు శ్రీమదాచార్యులవారు శ్రీకృష్ణవిగ్రహమును సముద్ర తీరము నుండి ఉడిపీ పట్టణమునకు తెచ్చిరని సాంప్రదాయము గలదు) దైత్యవిమోహక, దైత్య=సత్సంపదా యజ్ఞులైన మునిజన సహవాస లాభముచే హరిభక్తిపూర్వకముగాఁ గర్మలు చేయుచున్న) దైత్యులకు, విమోహక=(వేదవిరుద్ధమయిన కొన్ని మతముల నేర్పఁ చి కుశాస్త్రములను నిర్మాణముచేసి) విపరీతజ్ఞానము గలుగఁజేసిన, (బుద్ధమూర్తీ!) నిత్యసుఖాదే, (ముక్తియోగ్యులయిన జీవులయొక్క) నిత్యసుఖ=మోక్షసుఖమునకు, ఆదె=కారణమైనవాఁడా! దేవసుబోధక=బుద్ధావతార కృతమయిన శాస్త్రములనఁగా, (శూన్యవాదము, జగత్క్షణికము వాదము, ఈమొదలయిన వాదములుగల శాస్త్రములయొక్క నిజార్థమును) దేవతలకు లెస్సగా బోధించిన వాఁడా! బుద్ధస్వరూప=జ్ఞానస్వరూపియగు బుద్ధావతారా! నిన్ను నమస్కరించెదనని యన్వయము.

తా॥ అనేకమంది చంద్రులవలె నాహ్లాదకరమయిన ముఖముగలట్టియు, కుంద పుష్పమువలె శోభించెడి మందహాసముగలట్టియు, బ్రహ్మాదిదేవతలకు సంతోషముగలుగఁజేసినట్టియు, ఆనందముతో నిండియున్నట్టియు, రాక్షసులను మోహపెట్టినట్టియు, ఎల్లప్పుడు సుఖమునిచ్చునట్టియు, దేవతలకు బోధచేయునట్టియు, బుద్ధావతారుఁడవైన నీకు నమస్కారము.

శ్లో॥ దుష్టకులాంతకకల్కిస్వరూప। ధర్మవివర్ధనమూలయుగాదే।
నారాయణామలకారణమూర్తే। పూర్ణగుణార్ణవనిత్యవిబోధ॥ ౮

కల్క్యవతారమును స్తుతించి, పిమ్మట పూర్వోక్తావతారములన్నిటికిని మూలరూపమైన నారాయణమూర్తికిని భేదములేదని సూచించుచు నారాయణమూర్తిని స్తుతించుచున్నారు.

అ॥ దుష్టకులాంతక, (కల్పాంతమందు) దుష్టకుల=అతినీచమైన యవనకులమునకు అంతక=నాశనముచేసినవాఁడా! కల్కిస్వరూప=యుగాంతమందు దైత్యులను సంహరిం

చు కల్కిమూర్తీ! ధర్మవివర్ధన, ధర్మ=సమస్తమైనవారిచేతను చేయఁబడుధర్మార్థకామాది రూపమైన ధర్మములను, వివర్ధన=(ప్రవర్తింపఁజేసి) వృద్ధిపొందించువాఁడా! మూలయుగాదే, మూలయుగ=కృతయుగమునకు, ఆదే=కారణమైనవాఁడా! అనఁగా ప్రవర్తకుఁడా! లేక-మూల=సకలజగత్తునకు మూలమైన మూలప్రకృతియును, అప్రకృతికి భిన్నమైన లక్ష్మీదేవి, వీరితో, యుక్=కూడియున్న సర్వప్రపంచమునకును, ఆదే=ఆదికారణమైన వాఁడా! (శ్రీ)హరియొక్క రూపములలో "పంచాత్మక స్వ భగవాన్ ద్వ్యష్టాత్మకో భూత్పంచ ద్వయీశతసహస్రపరిమితశ్చ" అను ప్రమాణానుసారముగ దశావతార వర్ణనానంతరము శతావతారరూపములకును పలతుకమైన నారాయణరూపమును స్తుతించుచున్నారు.) హే నారాయణ=సమస్తగుణములకు నాశ్రయమైనవాఁడా! అమలకారణమూర్తే, అమల=నిర్వికారమైన, కారణమూర్తే=కారణస్వరూపము గలవాఁడా! (అనఁగా నిమిత్తకారణముగాని ఉపాదాన కారణము కాదని తాత్పర్యము.) లేక-హే అమల=అవతార రూపములందును గర్భసంక్రమణాది దోషములు లేనివాఁడా! కారణమూర్తి=సజ్జనులకు నభీష్టసిద్ధిని, అనిష్టపరిహారమును జేయుటకు కారణమయిన విగ్రహముగలవాఁడా! పూర్ణగుణార్ణవ, పూర్ణగుణ=సంపూర్ణమయిన గుణములకు, అర్ణవ=సముద్రమువంటివాఁడా! నిత్యవిబోధ, నిత్య=నిత్యమయిన అనఁగా నాశనములేని, విబోధ=జ్ఞానముగలవాఁడా! లేక- నిత్య=(౧ అనిత్యత్వము, ౨ దేహహాని, ౩ దుఃఖప్రాప్తి, ౪ అపూర్ణత్వమనెడు చతుర్విధ) నాశములులేనివాఁడా! వి=గరుడమూర్తికి, బోధ=తత్త్వోపదేశమును జేసినవాఁడా! ఇట్టినారాయణమూర్తీ నిన్ను నమస్కరించి స్తుతించుచున్నానని యన్వయము. ఈశ్లోకమందు నారాయణ స్తుత్యనంతరము విశ్వశబ్దార్థమయిన పూర్ణశబ్దప్రయోగముచే విశ్వాదిసహస్రమూర్తి స్తవమును, పృ అనుధాతువుయొక్క అర్థమయిన పాలనాదిగుణములను బోధించెడి గుణార్ణవ శబ్దప్రయోగముచేత వరాదిబహురూపస్తవమును, పరాజయాదిదోషములులేవని యర్థమిచ్చెడి అమలశబ్దప్రయోగముచే అజితాద్యనంతావతారస్తవమును శ్రీమదానందతీర్థ భగవత్పాదులవారిచేఁ జేయఁబడెనని యూహింపవలయును, నారాయణశబ్దప్రయోగముచే సమస్తావతార రూపములకును మూలరూపమునకును భేదములేదని సూచింపఁబడినది.

తా॥ దుష్టకులమును నశింపఁజేయునట్టియు, ధర్మమును వృద్ధిపొందించునట్టియు, కృతయుగమునకు కారణుఁడవైనట్టియు, జలమునివాసముగాగలట్టియు, నిర్మలమైనకారణ స్వరూపముగలట్టియు, సంపూర్ణమైన మంచిగుణములకు సముద్రుఁడవైనట్టియు సమస్తము బోధించునట్టియు, కల్కిమూర్తివైన నీకునమస్కారము.

శ్లో॥ ఆనందతీర్థమునీంద్రకృతా హరిగాథా। పాపహరాశుభని
త్య సుఖార్థా॥ ౯

ఈస్తుతియొక్క ఫలమునుచెప్పి అధ్యాయమును ముగించుచున్నారు.

అ॥ ఆనంద...కృతా, ఆనంద=(విచింతమాత్రముననే) ఆనందమును గలుగఁజే యుట=లేక, అ=లెస్సయైన అనఁగా విశేషమయిన, నంద=సుఖమును గలుగఁజేసెడు, తీర్థ=శాస్త్రముగలట్టియును, మునీంద్ర=మునిశ్రేష్ఠులైనట్టియును, శ్రీమదానంద తీర్థులవారిచే, కృతా=రచింపఁబడిన, హరిగాథా=శ్రీహరిస్తవము, పాపహరా, పాప=భక్తికి ప్రతిబంధకములగానున్న) పాపములను, హరా=(పఠనశ్రవణాదులచేఁ) బోగొట్టునది. శుభా=(శుద్ధిమూలమైనదియును సర్వజ్ఞాచార్యులవారిచేఁ జేయఁబడినదియును నగుటవలన) మంగళరూపమైనది నిత్యసుఖార్థా, నిత్యసుఖ=మోక్షసుఖము. అర్థా=ప్రయోజనము గాఁగలది. అనఁగా మోక్షసుఖమునకు కారణభూతమైన దనుట. కావున నిరవధికనిర్దోషకళ్యాణగుణ సముద్రుఁడైన అనంతావతారాత్మక శ్రీహరిని మోక్షేచ్ఛగలవారందఱును స్తుతించి నమస్కరింపవలయునని తాత్పర్యము.

ఇతి శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్యవిరచితే ద్వాదశస్తోత్రే షష్ఠోధ్యాయః॥

శ్రీకృష్ణార్పణమస్తు.

తా॥ ఆనందతీర్థ మునీంద్రులవారిచేఁ జేయఁబడిన విష్ణుమూర్తివారికథలో అందలిపాపములను పోగొట్టి, శుభప్రదములను, సుఖమును మోక్షమును నిచ్చునదియునగు ఆరవయధ్యాయము.

సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీగురుభ్యోనమః.

## సప్తమోధ్యాయప్రారంభః.

ఈ యధ్యాయమందు ఏశ్రీహరియొక్క కటాక్షబలముగల లక్ష్మీదేవి బ్రహ్మాదిదేవతలకు కడగంటి చూపుచేతనే సర్వాభీష్టములను జగత్తు సృజించుశక్తి మొదలగు శక్తులను నిచ్చుటకు సమర్థురాలయ్యెనో అట్టి శ్రీహరియొక్క సర్వోత్తమత్వ విషయమై సంశయము లేశమాత్రమయినను లేదనెడు భావముతో స్తుతించుచున్నారు.

**శ్లో॥ విశ్వస్థితిప్రళయసర్గమహావిభూతి। వృత్తిప్రకాశనియమావృతిబంధమోక్షాః। యస్యాఅపాంగలవమాత్రతఊర్జితా సా। శ్రీర్యత్కటాక్షబలవత్యజితంనమామి॥ ౧**

అ॥ యస్యాః=ఏలక్ష్మీదేవియొక్క, అపాంగలవమాత్రతః=కటాక్ష లేశమాత్రము వలననే, విశ్వ...మోక్షాః విశ్వ=ప్రపంచముయొక్క, స్థితి=పాలనము, ప్రళయ=నాశ

నము, సర్గ=ఉత్పత్తి, మహావిభూతి=మహైశ్వర్యము, వృత్తి=జీవనము, ప్రకాశ=జ్ఞానము, నియమ=ప్రేరణము, ఆవృతి=ఆవరణము, బంధ=సంసారబంధము, మోక్షః=(సంసార) నివృత్తియును, (కల్గుచున్నవో, సా=ఆ, ఊర్జితా=ఉత్కృష్టురాలైన అనఁగా బ్రహ్మాదులకంటె శ్రేష్ఠురాలైన, శ్రీః=లక్ష్మీదేవి, యత్కటాక్షబలవతీ, యత్=ఏశ్రీహరి యొక్క, కటాక్షబలవతీ=కటాక్షబలముకలిగియున్నదో, అట్టి, అజితం=ఎవరివలనను పరాజితుఁడుగాని అజితనామకశ్రీహరిని [అజితాద్యనంతావతార రూపములుగలవాఁడని యుఁ జెప్పవచ్చును] నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ ప్రపంచముయొక్క సృష్టి, స్థితి, వినాశన, ఐశ్వర్య, ప్రకాశ, నియమ బంధ, మోక్షాదులకు కారణ భూతురాలయిన శ్రీమహాలక్ష్మియెవరి అనుగ్రహము పూర్ణముగా గలిగియున్నదో, ఎవరివలనను పరాజితుఁడుగాని, అనవతారముగల విష్ణుమూర్తిని నమస్కరించెదను.

శ్లో॥ బ్రహ్మేశశక్రరవిధర్మ శశాంకపూర్వ । గీర్వాణసంతతిరియం యదపాంగలేశం। ఆశ్రిత్యవిశ్వవిజయం విసృజత్యచింత్యా । శ్రీర్యత్కటాక్ష బలవత్యజితం నమామి॥ ౨

ఈశ్లోకమందు బ్రహ్మాదిదేవాళ్లకు నయిన విజయము లక్ష్మీకటాక్షసాధ్య మనిచెప్పి ఆలక్ష్మీదేవికి శ్రీహరియాశ్రయుఁడని స్తుతించుచున్నారు.

అ॥ ఇయం=ప్రత్యక్షప్రసిద్ధమయిన, బ్రహ్మ=చతుర్ముఖుఁడు, ఈశ=రుద్రుఁడు, శక్ర=ఇంద్రుఁడు. రవి=సూర్యుఁడు, ధర్మ=యమ ధర్మరాజు, శశాంక=చంద్రుఁడు, పూర్వ=మొదలగు, గీర్వాణసంతతిః=దేవసమూహము, యదపాంగలేశం, యత్=యే లక్ష్మీదేవియొక్క, అపాంగలేశం=కటాక్షలేశమును, ఆశ్రిత్య=ఆధారముగాఁ జేసికొని, విశ్వవిజయం, విశ్వ=ప్రపంచము యొక్క, విజయం=అభ్యుదయమును, విసృజతి=వారి వారి యోగ్యతాభేదమును బట్టి, అనేకవిధములుగాఁ జేయుచున్నారో (అట్టి) అచింత్యా=(ఇట్టిమహిమగలదని సంపూర్ణముగా) ధ్యానించుటకు శక్యముగాని, శ్రీః=లక్ష్మీదేవి, యత్కటాక్షబలవతీ=యేశ్రీహరియొక్క కటాక్షబలము గలిగి యున్నదో, అట్టి, అజితం=అజితనామకుఁడయిన శ్రీహరిని, నమామి=నమస్కరించుచున్నాను. అచింత్యాం అనుపాఠమందు అచింత్యుఁడయిన అనఁగా సాకల్యముగాఁ దెలియఁబడఁజాలని, అజితం=అజితనామకపరమాత్మను, నమామి=నమస్కరించుచున్నానని యన్వయము-

తా॥ బ్రహ్మ, రుద్ర, ఇంద్ర, సూర్య, యమ, చంద్రాది దేవతలు ఏ లక్ష్మీదేవి యొక్క కటాక్షలేశమును అధారముచేసికొని ప్రపంచస్థితిని పలువిధములుగఁ జేయుచున్నారో అట్టిలక్ష్మీదేవి యేశ్రీహరి కటాక్షము కలిగియున్నదో అట్టి అజితనామక పరమాత్మను నమస్కరించుచున్నాను.

శ్లో॥ ధర్మార్థకామసుమతిప్రచయాద్యశేష। సన్మంగళంవిదధతే యదపాంగలేశం। ఆశ్రిత్యతత్ప్రణతసత్ప్రణతా అపీడ్యా। శ్రీ... మి॥

ఈశ్లోకమందు సకలపురుషార్థముల నిచ్చుటకు దేవతలకుంగూడ లక్ష్మీకృపాకటాక్షము కారణమని చెప్పుచున్నారు.

అ॥ తత్ప్రణత సత్ప్రణతాః, తత్=ధర్మాదులయందు, ప్రణత=ఆసక్తిగల, సత్=సజ్జనులచే, ప్రణతాః=నమస్కరింపబడెడి (ఇంద్రాదిదేవతలు) ఈడ్యా అపి=స్తోత్రార్హులైనప్పటికిని, యదపాంగలేశమాశ్రిత్య=ఏలక్ష్మీదేవియొక్క కటాక్షలేశమును ఆధారముగాచేసికొని, ధర్మార్థ...సన్మంగళం, ధర్మ=ధర్మము, అర్థ=అర్థము, కామ=కామము. సుమతి=మోక్షసాధన భూతమైనసద్జ్ఞానము, ప్రచయ=ధర్మాద్యభివృద్ధియు, ఆది=మొదలుగాగల, సన్మంగళం=అనుకూలమైన పురుషార్థమును, లేక-సత్=సాధువులకు, మంగళం=మంగళమును, విదధతే=చేయుదురో, అట్టి, శ్రీః=లక్ష్మీదేవి, యత్కటాక్ష బలవత్యజితం నమామి, యత్కటాక్షబలవతీ=ఏశ్రీహరియొక్క కటాక్షబలము గల్గియున్నదో, అట్టి, అజితం=అజిత నామకుడైన శ్రీహరిని, నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ ఏలక్ష్మీదేవియొక్క శ్రీగంటి ప్రసారముచేత ధర్మాదులయందాసక్తి గలవారు నమస్కరించు ఇంద్రాదిదేవతలను ధర్మార్థకామ మోక్షముల నిచ్చుచున్నారో అట్టి శ్రీలక్ష్మీదేవి యేశ్రీహరికటాక్షము కలిగియున్నదో అట్టి అజితనామకుడైన శ్రీహరిని నమస్కరించుచున్నాను.

శ్లో॥ షడ్వర్గనిగ్రహనిరస్తదోషా। ధ్యాయంతివిష్ణుమృషయో యదపాంగలేశం। ఆశ్రిత్యయానపిసమేత్యనయాతిదుఃఖం। శ్రీ... మీ॥

ఈశ్లోకమందు విష్ణుధ్యానలబ్ధమైన శాపానుగ్రహశక్తిగల ఋషులుకూడ తమాశ్రయించినవారి దుఃఖములను బోగొట్టు శక్తిగలవారగుట లక్ష్మీకటాక్షలబ్ధ విష్ణుధ్యానము వలననే యనియు, వారియనుగ్రహమునే వారికే దుఃఖ రాహిత్యముగుచుండగా, వారిచేత ధ్యానింపబడెడి లక్ష్మీనారాయణమూర్తిని ధ్యానించుటచే సమస్తపురుషార్థములును గల్గునని చెప్పుటకేమి సంశయమను భావముతో శ్రీహరిని స్తుతించుచున్నారు.

అ॥ యానపి=ఏఋషీశ్వరులనుగూడ, సమేత్య=ఆశ్రయించి, (లోకము) దుఃఖం=దుఃఖమును, నయాతి=పొందదో, అట్టి, ఋషయః=ఋషీశ్వరులు, యదపాంగలేశమాశ్రిత్య=ఏలక్ష్మీకటాక్షలేశము నాశ్రయించి, షడ్వర్గదోషాః, షడ్వర్గ=కామాద్యరిషడ్వర్గమును, లేక- మనస్సుతోగూడిన ఇంద్రియవర్గమును, నిగ్రహ=నిరోధించుటవలన, నిరస్త=పోగొట్టబడిన, దోషాః=దోషములు కల్గినవారై, అనగా చలించని సమాధిసాధనముగలవారై. విష్ణుం=విష్ణుమూర్తిని, ధ్యాయంతి=ధ్యానించెదరో, అట్టి, శ్రీః=లక్ష్మీదేవి, యత్కటాక్షబలవత్యజితంనమామి=ఏ శ్రీహరియొక్క కటాక్షబలము గల్గియున్నదో, అట్టి అజితనామకుడైన శ్రీహరిని నమస్కరించుచున్నను.

తా॥ ఏ ఋషీశ్వరులు దుఃఖము పొందరో అట్టిఋషులు ఏ లక్ష్మీదేవికటాక్షము వలన కామాదిదోషములలేక యింద్రియనిగ్రహముకలిగి దోషములు పోగొట్టి సమాధి

యుండుంటి విష్ణుధ్యానము చేసెదరో అట్టి యమాలక్ష్మి దేవికటాక్షము కలిగి యున్నదో ఆ శ్రీమహావిష్ణువును నమస్కరించుచున్నాను.

శ్లో॥ శేషాహివైరి శివశక్రమనుప్రధాన। చిత్రోరుకర్మరచనం యదపాంగలేశం। ఆశ్రిత్య విశ్వమఖిలం విదధాతి ధాతా। శ్రీ ... మీ॥ ౫.

శేషాదులను సృష్టిచేసెడు బ్రహ్మకూడ లక్ష్మీకటాక్ష శ్రీయుఁడని చెప్పి స్తుతించు చున్నారు.

అ॥ ధాతా=చతుర్ముఖబ్రహ్మ. యదపాంగలేశమాశ్రిత్య=ఏలక్ష్మీదేవియొక్క కటాక్షలేశమును ఆధారముగజేసికొని, శేషాహి=రచనం, శేష=శేషుఁడు, అహివైరి=గరుత్మంతుఁడు, శివ=ఈశ్వరుఁడు, శక్రి=ఇంద్రుడు, మను=మనువు, ప్రధాన=మొదలుగాగల దేవతలయొక్క, చిత్ర=చిత్రమైన, ఉరు=అనేకమైన, కర్మ=(భూమిని ధరించుట, విషనాశనము చేయుట, దైత్యహననమొనర్చు, ధర్మశాస్త్రములు చేయుట, ఈ మొదలగు) పనులయొక్క, రచన=నిర్మాణములుగల, అఖిలం=సమస్తమై, విశ్వం=జగత్తును, విదధాతి=సృష్టిచేయుచున్నాఁడో, అట్టి, శ్రీః=లక్ష్మీదేవి, యత్కటాక్షబలవతీ=ఏశ్రీహరి యొక్క కటాక్షబలముగలదైయున్నదో, (అట్టి) అజితనామకుఁడైన శ్రీహరిని, నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ ఏలక్ష్మీదేవికటాక్షమువలన, చతుర్ముఖబ్రహ్మ, శేషుఁడు, గరుత్మంతుడు, శివుఁడు, ఇంద్రుఁడు, మనువు, మొదలుగాగల దేవతలయొక్క చిత్రమైన గొప్పకర్మలను చేయువారలను నిర్మించుచున్నాఁడో అట్టిలక్ష్మీదేవి యేశ్రీహరి కటాక్షబలముగలిగియున్నదో ఆమహావిష్ణువునకు నమస్కారము.

శ్లో॥ శక్రోగ్రదీధితిహిమాకరసూర్యసూను। పూర్వం నిహత్య నిఖిలం యదపాంగలేశం। ఆశ్రిత్య నృత్యతి శివః ప్రకటోరుశక్తిః। శ్రీ .. మి॥

శివునియొక్క సంహారకర్తృత్వశక్తికూడ లక్ష్మీకటాక్షమువలననే యని చెప్పి స్తుతించుచున్నారు.

అ॥ శివః=రుద్రుఁడు, (యత్, అపాంగలేశం, ఆశ్రిత్య) యదపాంగలేశమాశ్రిత్య=ఏలక్ష్మీదేవియొక్క కటాక్షలేశము, నాశ్రయించి, ప్రకటోరుశక్తిః, ప్రకట=ప్రచురము యొక్క, ఉరు=గొప్పదగు, శక్తిః=శక్తిగలవాఁడై, శక్రోగ్ర...పూర్వం, శక్ర=ఇంద్రుఁడు, ఉగ్రదీధితి=సూర్యుఁడు, హిమాకర=చంద్రుఁడు, సూర్యసూను=యముఁడు, పూర్వం=మొదలుగాగల, నిఖిలం=సమస్తప్రపంచమును, నిహత్య=సంహరించి, నృత్యతి=తాండవము చేయుచున్నాఁడో, (అట్టి) శ్రీః=లక్ష్మీదేవి, యత్కటాక్షబలవతీ= ఏశ్రీహరి యొక్క కటాక్షబలము గల్గియున్నదో, (అట్టి) అజితం=శ్రీహరిని నమామి= నమస్కరించుచున్నాను.

తా॥ శివుఁడు ఏలక్ష్మీదేవియొక్క క్రీగంటిప్రసారము నాశ్రయించి గొప్పశక్తిగలవాఁడై, ఇంద్రుఁడు, సూర్యుఁడు, చంద్రుఁడు, యముఁడు మొదలుగాగల సమస్తప్రపంచ

నను, సంహరించి తాండవము చేయుచున్నాఁడో అట్టి శ్రీమహాలక్ష్మి ఏశ్రీహరిబలముక లిగియున్నదో ఆవిష్ణుమూర్తికి నమస్కారము.

శ్లో॥ తత్పాదపంకజ మహాసనతామవాప। శర్వాదివంద్యచర ణోయదపాంగ లేశం। ఆశ్రిత్య నాగ పతి రన్య సురై ర్దురాపాం। శ్రీ... మీ॥ 8

శేషుఁడు సర్వదా శ్రీహరి పాదసన్నిధియం దున్నవాఁడయినను, అయినను, లక్ష్మీకటాక్షాశ్రితుఁడేయని స్తుతించి శ్రీహరిని నమస్కరించుచున్నారు.

అ॥ శర్వాది వంద్య చరణః, శర్వాది=శివుఁడు మొదలగు వారిచే, వంద్య=నమ స్కరింపఁబడెడు, చరణః=పాదములు గలవాఁడయ్యును, నాగపతిః=శేషుఁడు, యద పాంగలేశమాశ్రిత్య=ఏలక్ష్మీదేవియొక్క కటాక్షలేశము నాశ్రయించి, అన్యసురైః= ఇతరదేవతలచే, దురాపాం=పొందశక్యముగాని, తత్పాద...తాం, తత్=శ్రీహరి యొ క్క, పాదపంకజ=పాదపద్మములయొక్క, మహాసనతాం=గొప్పదయిన పీఠమగుటను, అవాప=పొందెనో, (అట్టి) శ్రీః=లక్ష్మీదేవి, యత్కటాక్షబలవతీ=ఏ శ్రీహరియొక్క క టాక్షబలము గలిగియున్నదో, [అట్టి] అజితం=అజితా ద్యనంతావతారాత్మకుఁడయిన శ్రీహరిని, నమామి=నమస్కరించుచున్నాను.

తా॥ శివుఁడుమొదలుగాఁ గలవారిచేత నమస్కరింపఁబడెడు పాదములు గలవాఁ డయ్యును శేషుఁడు ఏలక్ష్మీదేవియొక్క కటాక్షలేశము నాశ్రయించి సమస్తదేవతలచే తను బొందశక్యముగాని శ్రీహరిపాదపద్మములయొక్క మహాసత్వమును బొందెనో అట్టి శ్రీమహాలక్ష్మి ఏశ్రీహరి కటాక్షబలము కలిగియున్నదో అట్టి అజిత నామకుఁడయిన శ్రీ హరిని నమస్కరించుచున్నాను.

శ్లో॥ నాగారిరుగ్రబలపౌరుష ఆపవిష్ణో। ర్వాహత్వము త్తమజ వ్యోయదపాంగలేశం। ఆశ్రిత్యశక్రముఖదేవగణైరచింత్యం। శ్రీ ..మీ॥

గరుడమూర్తి ఇంద్రునితో యుద్ధముచేసి అమృతమును తీసికొనిపోఁగలశక్తి, తన రెక్కలగాలిచేత దైత్యులను సంహరింపఁగలశక్తియుఁ గలవాఁడయ్యెను ఆయన గరుడుఁడు. శ్రీలక్ష్మీదేవియొక్క కటాక్షాశ్రితుఁడని చెప్పుచు శ్రీహరిని నమస్కరించుచున్నారు.

అ॥ ఉగ్రబలపౌరుషః, ఉగ్ర=సహింపశక్యముకాని, బల=శారీరబలము, పౌరుషః= పరాక్రమమును గలట్టియు, ఉత్తమజవః, ఉత్తమ=ఇతరులయందులేని, జవః=వేగముగల ట్టియు, నాగారిః=గరుడమూర్తి, యదపాంగలేశమాశ్రిత్య=ఏ లక్ష్మీదేవియొక్క కటాక్ష లేశము నాశ్రయించి, శక్ర=చింత్యం, శక్ర=ఇంద్రుఁడు, ముఖ=మొదలుగాఁగల, దేవ గణైః=దేవతాసమూహములచే, అచింత్యం=ధ్యానింపశక్యముకానిఁ మనస్సుచేత సైతము పొందశక్యముగాని) విష్ణోః=విష్ణుమూర్తివారియొక్క, వాహత్వం=వాహనమగుటను, అ వ=పొందెనో, అట్టి, శ్రీః=లక్ష్మీదేవి, యత్కటాక్షబలవత్యజితంనమామి=ఏఅజితనామక పరమాత్మయొక్క కటాక్షబలముగల్గియున్నదో అశ్రీహరిని నమస్కరించుచున్నాను.

తా. అధికమైన పౌరుషము శరీరబలము గలిగి మిగుల వేగముగల గరుత్మంతుడు ఏలక్ష్మీదేవియొక్క కటాక్షలేశము వాశ్రయించి ఇంద్రాదులకు నలవిగాని శ్రీమహావిష్ణువునకు వాహనరూపుఁడైనాఁడో ఆమహాలక్ష్మి ఏఅజిత నామక శ్రీహరి బలముకలిగియున్నదో అవిష్ణుమూర్తిని నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఆనందతీర్థమునిసన్ముఖ పంకజోత్థం। సాక్షాద్రమా హరి మనఃప్రియ ముత్తమార్థం। భక్త్యా పఠ త్యజిత మాత్మని సన్నిధాయ। య స్తోత్రమేతదభియాంతి తయోరభీష్టం॥

ఈస్తోత్రపఠన ఫలమును జెప్పుచున్నారు.

అ॥ ఆనంద...మార్థం, ఆనందతీర్థ=ఆనందతీర్థుల వారను, మునిః=మునీంద్రునియొక్క, సన్ముఖపంకజ=నిర్దుష్టవదనారవింద మునుండి, ఉత్థం=బయలు దేరినట్టియు, సాక్షాత్...ఉత్తమార్థం, సాక్షాత్=ప్రత్యక్షముగా, లేక- సత్యముగా, రమాహరిమనః=లక్ష్మీనారాయణులయొక్క మనస్సులకు, ప్రియం=సంతుష్టికరమయినట్టియు ('శ్రీమలభ్యం భగవతిప్రసన్నే (శ్రీనికేతనే') అను ప్రమాణవాక్యమును బట్టి ఈస్తుతి శ్రీహరిప్రీతికరమయినది గనుకనే సకలాభీష్టప్రదమయినదని భావము) ఉత్తమార్థం, ఉత్తమ=భగవత్సర్వోత్తమత్వ రూపమయిన, అర్థం=అర్థముగలదియును, ఏతత్=ఇట్టి, స్తోత్రం=స్తోత్రమును, యః=ఏ అధికారి, భక్త్యా=ఆదరముతో, ఆత్మని=మనస్సున, అజితం=అజితాద్యనంతావతారాత్మక శ్రీహరిని, సన్నిధాయ=ఉంచుకొని, అనఁగా నాయనయందాసక్తమయిన మనస్సుగలవాఁడయి, పఠేత్=పఠించునో, అతఁడు, తయోః=ఆలక్ష్మీనారాయణులయొక్క, అభీష్టం=ఇష్టుఁడగుటను, లేక- వారి కటాక్షమువలన పురుషార్థమును, అభియాతి=పొందును, ఈయధ్యాయమందు తొమ్మిదిశ్లోకము లుండుటవలన దీనిని భక్తితోఁ బఠించెడి వారికి ఈ లోక మందు నవరత్నాది సమస్తైశ్వర్యములును పరమందు బ్రహ్మలోకప్రాప్తియు అక్కడనున్న భగవద్రూప దర్శనమును లభించునని సూచింపబడినది. ఇది శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్య విరచితే ద్వాదశస్తోత్రే సప్తమోధ్యాయః.

తా॥ ఆనందతీర్థులను మునీంద్రునియొక్క ముఖకమలములవలన పుట్టినసాక్షాత్తు లక్ష్మీనారాయణులకు ప్రియమయిన యీ స్తవమును ఏమనుజులు మనస్ఫూర్తిగ పఠింతురో అట్టివారికి సమస్తైశ్వర్యమును, విష్ణులోకమును గలుగును.

శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీగురుభ్యోనమః.

## అష్టమోధ్యాయప్రారంభః.

శ్లో॥ వందితాశేషవంద్యోరుబృందారకం। చందనాచర్చితోదారపీనాంసకం। ఇందిరాచంచలాపాంగనీరాజితం। మందరోద్ధారివృత్తోద్భుజాభోగినం। ప్రీణయామోవాసుదేవం దేవతామండలాఖండమండనం॥ ౧

శ్రీహరిప్రీతిచే సమస్తమైన అధికారులును సంపాదించవలయునని తెలియఁజేయుచు ఈయధ్యాయమందు శ్రీహరిప్రీతిని ప్రార్థించుచున్నారు.

అ। వందితా...కం, వందిత=నమస్కరించుటకు ప్రవృత్తులైన, అశేష=సమస్తమైన, వంద్య=స్తోత్రార్హులయిన, ఉరు=ఉత్కృష్టులైన, బృందారకం=దేవతలుగలట్టియు, లేక వందిత=తమకంటె అవరులచేస్తుతింపఁబడిన, అశేషాః, (అ×అ×శేషః) అ=బ్రహ్మ, అ=శివ, శేషః=శేషులచే, వంద్యా=నమస్కరింపఁబడినలక్ష్మీదేవిని, ఉరుబృంద, ఉరు=ఉత్కృష్టులైన బ్రహ్మాదులయొక్క, బృంద=సమూహమును, ఆరకం, ఆ=లెస్సగా, రకం=సంతోషింపఁజేయునట్టియు, (ర, అనఁ క్రీడార్థకము. క, అనఁ దిప్యార్థకము) లేక-వందితాశేష వంద్యోరుబృంద=సమస్తమైనవారిచేతను స్తుతింపఁబడెడు దేవతాసమూహమునకు, ఆరకం ఆ=లెస్సయైన, ర=అభీష్టము, కం=సుఖమునుకలుగఁజేయునట్టియు, లేక-వందితాశేష వంద్యోరుబృంద=సమస్తమైనవారిచేత స్తోత్రార్హులైనదేవతలయొక్క, ఆరకం, అర=దోషములను, కం=పరిశుద్ధిచేయునట్టియు, లేక-అగ్నిహోత్రమువలెదహించునట్టియు, లేక-వందితాశేషవంద్యోరుబృంద=స్తోత్రార్హమైనదేవసమూహమును, ఆరకం, ఆ=విశేషముగా, ర=పీడపెట్టెడి దైత్యులను, కం=యమునివలె సంహరించునట్టియు, లేక—అగ్నిహోత్రమువలె దహించునట్టియు, చందనా...సకం, చందన=చందనముతో, ఆచర్చిత=లెస్సగా పూయఁబడిన, ఉదార=ఉన్నతమై, పీన=పుష్టిగానున్న, అంసకం=భుజమూపురములుగలట్టియు, ఇందిరా...జితం, ఇందిరా=లక్ష్మీదేవియొక్క, లేక- ఉభయపార్శ్వములందున్న, శ్రీ,భూదేవులయొక్క, చంచల=చలించెడి, అపాంగ=(ప్రేమయుక్తమైన) కడగంటిచూపులచెడి, నీరాజితం= మంగళహారతులుగలట్టియు, మందరో...భోగినం, మందర=మందరపర్వతమును, ఉద్ధారి=లేవనెత్తిన, వృత్త=వర్తులమై, ఉత్=ఉత్తమమైనట్టి, భుజాభోగినం=సుఖపూర్ణమైన భుజములుగలట్టియు, (శ్రీహరియొక్క సమస్తావయవములును పూర్ణానందాత్మకములనుటకు ప్రమాణము. "ఆనందమాత్రకరపాదముఖోదరాదిః ") దేవతా...మడనం, దేవతామండల=దేవతాసమూహమునకు, అఖండమండనం=పూర్ణాలంకారమైనట్టియు, (ఇట్టి) వాసుదేవం=వాసుదేవ

మూర్తిని, (వయం=మేము) ప్రీణయామః=ప్రీతినొందించెదము. అనఁగా శ్రీపతికి మా పైని ప్రీతికల్గునట్లుగా సేవచేసెదమని తాత్పర్యము.

తా॥ నమస్కరించుటకుద్యుక్తులై స్తోత్రార్థులయిన దేవతాసమూహముగలట్టియు, మంచిగంధముచే పూయఁబడిన గొప్పభుజమూపురములుగలట్టియు, శ్రీ. భూదేవుల యొక్క క్రీగంటి ప్రసారములనెడి నీరాజనములుగలట్టియు, మందరపర్వతమును లేవనెత్తిన భుజములుగలట్టియు సమస్తమయిన దేవతాసమూహమునకు అలంకారభూతుఁడైన వాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ సృష్టిసంహారలీలావిలాసాతతం। పుష్టషాడ్గుణ్యసద్విగ్రహోల్లాసినం। దుష్టసంహారనిశ్శేషకర్మోద్యతం। హృష్టపుష్టాతిశిష్టప్రజాసంశ్రయం। ...ప్రీణ... మండనం॥ ౨

అ॥ సృష్టి...తతం, సృష్టి=ఉత్పత్తియు, సంహార=ప్రళయము, (ఇట్టి) లీలావిలాస=విలాసవిశేషములచే అనఁగా చేష్టలచే, ఆతతం=పరిపూర్ణుఁడైనట్టియు, పుష్ట...సినం, పుష్ట=సంపూర్ణమైన, షాడ్గుణ్య=ఐశ్వర్యాదిషడ్గుణసమూహముగల, లేక-తత్స్వరూపమైన, సద్విగ్రహ=నిత్యవిగ్రహముచే, ఉల్లాసినం=ప్రకాశించునట్టియు, దుష్ట...ద్యతం, దుష్ట=దుష్టులైన దైత్యులను, నిశ్శేష=నిశ్శేషముగా, సంహార=సంహారముచేయునట్టి కర్మ=కార్యమందు, ఉద్యతం=ఉద్యుక్తుఁడైనట్టియు, హృష్ట...సంశ్రయం, హృష్ట=యదృచ్ఛాలాభసంతుష్టులును, పుష్ట=జ్ఞానభక్తివైరాగ్యపూర్ణులును, అతిశిష్ట=సదాచారసంపన్నులును (అగు) ప్రజా=దేవ, ఋషి, పిత్రాది సమస్తమైన వారికిని. సంశ్రయం=(అనుకూలమైన) ఆశ్రయుఁడైనట్టియు, దేవతామండలాఖండమండనం=దేవతాసమూహమునకు పూర్ణాలంకారమైనట్టియు, వాసుదేవం=వాసుదేవమూర్తిని (వయం=మేము) ప్రీణయామః=ప్రీతినొందించెదము

తా॥ ప్రపంచోత్పత్తి సంహారములనెడి విలాసము గలవాఁడును, సంపూర్ణమైన షడ్గుణైశ్వర్యములచే నిండియున్న సంతోషము గలవాఁడును, నిశ్శేషముగ రాక్షససంహారమందు ఉద్యుక్తుఁడును, యదృచ్ఛాలాభసంతుష్టులు జ్ఞానభక్తివైరాగ్యపూర్ణులు, సదాచారసంపన్నులగు ఋష్యాదులకు ఆశ్రయభూతుఁడును నయిన శ్రీనివాసమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ ఉన్నతప్రార్థితాశేషసంసాధకం। సన్నతాలౌకికానందదశ్రీపదం। భిన్నకర్మాశయప్రాణిసంప్రేరకం। తన్నకిన్నేతివిద్వత్సుమీమాంసితం। ప్రీ...నం॥ 3

అ॥ ఉన్నత...కం, ఉన్నత=ఉత్కృష్టులైన బ్రహ్మాదులచేత, ప్రార్థిత=కోరఁబడిన, అశేష=సమస్తమునైన దానిని, సంసాధకం=దయచేయునట్టియు, సన్నతా...దం, సన్నత=సమ్యగ్భక్తిగలవారికి, అలౌకిక నందద మోక్షానందమునిచ్చెడి, శ్రీపదం=పూజ్య

పాదముగలట్టియు, లేక వైకుంఠాది ముక్తస్థానము గలట్టియు. లేక- సన్నతా...దం, సన్నతాలోకానందద=భక్తులకు జ్ఞానానందము కలుగఁజేయుచు, శ్రీ=లక్ష్మీదేవిని, పదం=పాదపద్మములయందుఁగలట్టియు, భిన్న...కం, భిన్న=యోగ్యతాభేదమునుబట్టి అనేకవిధములైన, కర్మ=కర్మలు, ఆశ్రయ=అంతఃకరణములు గల, ప్రాణి=జీవులకు, సంప్రేరకం=(వారివారియోగ్యతానుసారమయిన) ప్రేరణచేయునట్టియు, తన్న...తం, తత్=బ్రహ్మ, న=లేదు, (అగ్నికూష్మాదియనఁగా) కిం=ఎందుచేతనన (బ్రహ్మలేనిపదార్థమువంటిది. "అసన్నేవసభవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్" అనుశ్రుతియందు బ్రహ్మలేఁడనితెలిసికొనువాఁడజ్ఞుఁడని చెప్పఁబడియుండుటవలన) న=బ్రహ్మలేనిపదార్థముకాదు. సత్పదార్థము అని, విద్వత్సు=వేదార్థవిచారమందు కుశలులైనవారియందు, లేక- విద్వత్=విద్వాంసులచే, సు=లెస్సగా, మీమాంసితః=(శ్రుతిసహితమయిన) యుక్తులచే విచారింపఁబడినట్టియు, దేవతామండలాఖండమండనం= దేవతాసమూహమునకు పూర్ణాలంకారమయినట్టియు, వాసుదేవం= వాసుదేవమూర్తిని, [వయం=మేము] ప్రీణయామః=ప్రీతిపొందించెదము.

తా॥ ఉత్కృష్టులైన బ్రహ్మాదులచే కోరఁబడిన సమస్తమునువానిని దయచేయునట్టియు, సద్భక్తిగలవారికి జ్ఞానానందము నిచ్చునట్టియు, పూజ్యమయిన పాదపద్మములుగలట్టియు, యోగ్యతాభేదమునుబట్టి పలువిధకర్మలను చేయునట్టి జీవులకు యోగ్యతానుసారమయిన ప్రేరణను చేయునట్టియు, దేవతాసమూహములకు పూర్ణాలంకారుఁడైనట్టియు- వాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ విప్రముఖ్యైస్సదా వేదవాదోన్ముఖైః । సుప్రతాపైః క్షితీశేశ్వరైశ్చార్చితం। అప్రతర్క్యోరుసంవిద్గుణం నిర్మలం । సప్రకాశాజరానంద రూపం పరం। ప్రీ...నం॥ ౪

అ॥ సదా=సర్వకాలములందును, వేద...ఖైః, వేదవాద=వేదార్థవిచారమందు, ఉన్ముఖైః=ఆసక్తిగల, (ఉన్ముఖైః అనపాఠమందు ఉద్యుక్తులయిన యని అర్థము) విప్రముఖ్యైః=బ్రాహ్మణోత్తములచేతను, సుప్రతాపైః, సు=యోగ్యమయిన, ప్రతాపైః=పరాక్రమముగల, క్షితీశేశ్వరైః, క్షితీశ=ప్రభువులలో, ఈశ్వరైః=శ్రేష్ఠులయిన, (ప్రియవ్రత అంబరీషాది చక్రవర్తులచేతను; అనఁగా సర్వవర్ణాశ్రమముల వారిచేతను) అర్చితం=పూజింపఁబడునట్టియు, అప్ర...ణం, అప్రతర్క్య=ఊహింప శక్యముగాని, ఉరు=అనేకములయిన, లేక సర్వోత్కృష్టములయిన, సంవిద్గుణం=నిరుపాధిక జ్ఞానానందాదిగుణములు గలట్టియు, నిర్మలం=నిర్దోషుఁడయి నట్టియు, సప్రకాశా...రూపం, సప్రకాశ=స్వరూపభూతమయిన ప్రకాశముగలిగి, [సుప్రకాశ, అను పాఠమందు, సు=శోభాయుక్తమయిన, ప్రకాశ=ప్రకాశముగల, సప్రకాశ, అనుపాఠమందు, ప్రకాశమనఁగా జ్ఞానముతోఁగూడికొనిన] అజర=ముదిమి మొదలగు వికారములు, లేక

ముఁడని తెలియఁబడునో, [అట్టి] దేవతా...మందనం=దేవతాసమూహమునకు బూర్ణా లంకారమయిన, వాసుదేవం=వాసుదేవమూర్తియైనవానిని [వయం=మేము] ప్రీణయా మః=ప్రీతినొందించెదము.

తా॥ ఏవిష్ణుమూర్తివానిని, ఏదేశకాలముల చేతను, ఏగుణములచేతను, అతిక్రమించినవారులేరో, ఏవిష్ణుమూర్తితో సమానులుగాని, అధికులుగాని లేరో, ఏదేవుఁడు సాధువులకు అధికమయిన విశ్వాసము గలవాఁడో, ఏదేవుఁడు అబాధితమయిన సత్యసంకల్పముగలవాఁడో, ఎవఁడు సర్వస్వతంత్రుఁడో, ఎవఁడు వేదార్థవిచారముచే సర్వోత్కృష్టుఁడని చెప్పఁబడునో, అట్టిదేవతాసమూహమునకుఁ బూర్ణాలంకారమయిన వాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ పశ్యతాందుఃఖ సంతాననిర్మూలనం। దృశ్యతాందృశ్యతామిత్యజేశార్చితం। నశ్యతాందూరగంసర్వదాప్యాత్మగం। వశ్యతాంస్వేచ్ఛయాసజ్జనేష్వాగతం। ప్రీణ...మందనం॥ ౬

అ॥ పశ్యతాం=అపరోక్షజ్ఞానులకు, దుఃఖ...నిర్మూలనం, దుఃఖ=నానావిధ దుఃఖములయొక్క, సంతాన=సమూహములకు కారణమైన సంసారమును, నిర్మూలనం=నిర్మూలమును చేయునట్టియు ["జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున" అనుగీతావచనము ప్రమాణము] దృశ్యతాందృశ్యతామితి=పరమాత్మను చూడుఁడు చూడుఁడని సజ్జనులనుగూర్చి ఉపదేశించెడు, అజేశ=బ్రహ్మరుద్రాదులచే, అర్చితం=పూజింపఁబడునట్టియు. [బ్రహ్మజగద్గురువగుటవలనను, రుద్రుఁడు విష్ణుభక్తాగ్రేసరుఁడగుట వలనను, వీరు తామును ముక్తిసాధనము పూర్తిచేసికొని తమ్మనాశ్రయించిన సజ్జనులకుఁగూడ సన్మార్గోపదేశము చేయుదురని భావము] అజేశ-అజేశ, అజ=బ్రహ్మ, ఈశ=గురువుగాగల సమస్త సజ్జనులచేతను అనఁగా-శ్రీహరిసాక్షాత్కార సాధనమందు దృక్తులైన సజ్జనులచేఁ బూజింపఁబడునట్టియు, నశ్యతాం=జ్ఞానముపొందక అనఁగా జీవేశ్వరాభేదము, జగన్మిథ్యాత్వము మొదలగు విపరీతవాదములు చేయుచు, దానిని, బట్టినరకప్రాప్తిని బొందుపాపాత్ములకు, సర్వదా=ఎల్లప్పుడు, ఆత్మగమపి=స్వహృదయవర్తిగానున్నను, దూరగం=అతిదూరమందున్నట్టియు, (అనఁగా ప్రాప్యము కానట్టియు,) శేక-శేన పడనట్టియు,) సజ్జనేషు=విశ్వామిత్ర, గోపీజన, పాండవ, ప్రహ్లాదాది సజ్జనులకు, స్వేచ్ఛయా=స్వేచ్ఛచేత, వశ్యతాం=అధీనత్వమును, (వశ్యుఁడగుటను), ఆగతం=పొందినట్టియు, (శ్రీరామావతారమందు శిష్యునివలె విశ్వామిత్రునితోఁగూడఁ జనుటయు, శ్రీకృష్ణావతారమందు యశోదాదేవిచే శాసింపఁబడుటయు, పాండవులకు దూతయై దుర్యోధనాదుల యొద్దకుఁబోవుటయు, అర్జునునకు సారథియగుటయు, (ప్రహ్లాదవాక్యము ననుసరించి సభాస్తంభమునుండి శ్రీనరసింహ మూర్తిగ నావిర్భవించుటయు మొదలగు కార్యములచే భక్తవశ్యత్వము (పురాణప్రసిద్ధము) దేవతామందే లాఘుండేయుంక

నం=దేవతా సమూహమునకుఁ బూర్ణాలంకారమయి నట్టియు, వాసుదేవం=వాసుదేవమూర్తిని [వయం=మేము] ప్రీణయామః=ప్రీతినొందించెదము.

తా॥ అపరోక్షజ్ఞానులకు దుఃఖకారణమయిన సంసారదుఃఖమును నిర్మూలముచేయునట్టియు, పరమాత్మను జూడుఁడని యుపదేశించెడు బ్రహ్మాదులచేఁ బూజింపఁబడునట్టియు, నాశనము పొందెడు అనఁగా జీవేశ్వరాభేద.. జగన్మిథ్యాత్వము మొదలగువిపరీతకారణములు చేయువారికి యెల్లప్పుడుదూరముందుండునట్టియు, సజ్జనుఁచే స్వేచ్ఛగా పొందఁగలిగినట్టియు, దేవతాసమూహమునకు అలంకారభూతుఁడయిన వాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ అగ్రజంయస్ససర్జా జమగ్ర్యాకృతిం। విగ్రహోయస్య సర్వేగుణాఏవహి। ఉగ్రఆద్యోపియస్యాత్మ జాగ్ర్యాత్మజః। సద్గృహీతస్సదాయఃపరందైవతం। ప్రీణ ... మండనం॥ 8

అ॥ యః=ఏవిష్ణుమూర్తి, అగ్ర్యాకృతిం, అగ్ర్య=శ్రేష్టమైన అనఁగా అహంకారతత్వముకంటే, శ్రేష్ఠమైన మహత్తత్వమే, ఆకృతిం=ఆకారముగాకల్గి, అగ్రజం=మొట్ట మొదటపుట్టిన, అజం=బ్రహ్మను, ససర్జ=నాభిపద్మమునుండిపుట్టించెనో ("శ్రు॥ యోబ్రహ్మాణం విదధాతిపూర్వం" అనుశ్రుతిప్రమాణము) యస్య=ఏవిష్ణుమూర్తివారికి, సర్వేగుణాఏవహి=సమస్తమైన జ్ఞానానందాదిగుణములే, విగ్రహః=శరీరమో, (హిశబ్దము "యదాత్మకో భగవాంస్తదాత్మికావ్యక్తిః" అనుమొదలగు ప్రమాణములను సూచించుచున్నది) ఆద్యః=ఇంద్రాదులకంటె ముందుపుట్టిన, ఉగ్రోపి=రుద్రుఁడును, యస్య=ఏవిష్ణుమూర్తి వారియొక్క, ఆత్మజ=పుత్రుఁడైనబ్రహ్మకు, అగ్ర్య=మొట్టమొదటి, ఆత్మజః=కుమారుఁడో, ("శ్లో॥ అహంబ్రహ్మచాద్యశ్శివః ప్రజానాం।తస్మాజ్జాతస్త్వంచమత్తః ప్రసూతః" ఇత్యాదిమోక్షధర్మవచనము ప్రమాణము) యః=ఏవిష్ణుమూర్తి, స..=ఎల్లప్పుడు, సద్గృహీతః, సత్=ప్రహ్లాదాదిసజ్జనులచె,గృహీతః=భక్తిచెతవశీకృతుఁడో, లేక, శ్రవణాద్యుపాయములచె హృదయమందు ధ్యానించఁబడునో, లేక, యశోదచె తాఁటితోను, గోపికాస్త్రీలచె బాహువులతోను. ఋషీశ్వరులచే మనస్సులతోను, కట్టఁబడినవాఁడో, (ఏవిష్ణుమూర్తివారు) పరం=సర్వోత్తముఁడైన,దైవం=దైవమో, (అట్టి) దేవతామండలాఖండమండనం=దేవతాసమూహమునకు పూర్ణాలంకారమైన, వాసుదేవం=వాసుదేవమూర్తిని [వయం=మేము] ప్రీణయామః=ప్రీతినొందించెదము.

తా॥ ఏవిష్ణుమూర్తి శ్రేష్ఠమైన ఆకారము కలిగి మొదటపుట్టిన బ్రహ్మను నాభికమలమునుంచి పుట్టించెనో, ఏవిష్ణుమూర్తికి జ్ఞానానందాదిగుణములే శరీరముగానున్నవో, ఏవిష్ణుమూర్తి యెల్లప్పుడు సత్పురుషులచేత గ్రహింపఁబడునో, ఎవ్వడుసర్వోత్కృష్టుడైన దేవుఁడో అట్టి సమస్త దేవతా సమూహమునకు పూర్ణాలంకారుఁడైన వాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ అచ్యుతో యో గుణైర్నిత్య మేవాఖిలైః। ప్రచ్యుతో శేష దోషైస్సదాపూర్తితః। ఉచ్యతే సర్వవేదోరు వాదైరజః। స్వర్చితో బ్రహ్మరుద్రేంద్ర పూర్వైస్సదా। ప్రీణ...మండనం॥ ౯

అ॥ యః=ఏవిష్ణుమూర్తివారు, అఖిలైః=సమస్తమయిన, గుణైః=జ్ఞానానందాది గుణములచేత, నిత్యమేవ=సర్వదా, అచ్యుతః=విడువఁబడనివాఁడో, అనఁగాపూర్ణుఁడో, సదా=ఎల్లప్పుడు, పూర్తితః=పూర్ణత్వముఁ దగుటవలన, అశేష దోషైః=పారతంత్ర్యాది దోషములచే, ప్రచ్యుతః=అత్యంతము విడువఁబడినవాఁడో, అజః=జన్మాదివికారములులేనివాఁడో, సర్వవేదోరువాదైః, సర్వవేద=సమస్తవేద సంబంధమయిన, ఉరు=ఉత్కృష్టమయిన, వాదైః=వాక్యములచే, ఉచ్యతే=పరమముఖ్యవృత్తిచేఁ జెప్పఁబడునో, ('శ్రు॥ నేంద్రియాణినానుమానం వేదాహ్యేవైనం వేదయంతి।' వేదైశ్చ సర్వైరహమేవవేద్యః' అను శ్రుతిస్మృతులు ప్రమాణములు.) బ్రహ్మ...పూర్వైః, బ్రహ్మ=చతుర్ముఖబ్రహ్మ, రుద్ర=రుద్రుఁడు, ఇంద్ర=ఇంద్రుఁడు, పూర్వైః=మొదలుగాఁగల దేవతలచే, సదా=సర్వదా, స్వర్చితః=లెస్సగా అనఁగా భక్తిపూర్వకముగా పూజింపఁబడునో, అట్టి) దేవతామండలాఖండమండనం=దేవతాసమూహమునకు పూర్ణాలంకారమయిన, వాసుదేవం=వాసుదేవమూర్తివారిని (వయం=మేము) ప్రీణయామః=ప్రీతినొందించెదము.

తా॥ ఏ విష్ణుమూర్తిని జ్ఞానానందాదిగుణములచేత, ఎల్లప్పుడు పరిపూర్ణుఁడో, సమస్తదోషములచేతను విడువఁబడిన వాఁడో, జన్మాదివికారములు లేనివాఁడో, సమస్తఉత్కృష్టవాక్యములచేత చెప్పఁబడునో, బ్రహ్మాదులచే ఎల్లప్పుడు లెస్సగా పూజింపఁబడునో అట్టి సమస్తదేవతాసమూహమునకు అలంకారభూతుఁడైన విష్ణుమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ ధార్యతే యేన విశ్వం సదాజాదికం। వార్యతే శేష దుఃఖం నిజధ్యాయినాం। పార్యతే సర్వమన్యైర్నయత్పార్యతే। కార్యతే చాఖిలం సర్వభూతైస్సదా। ప్రీణ...మండనం॥ ౧౦

అ॥ యేన=ఏవిష్ణుమూర్తివారిచే, అజాదికం=బ్రహ్మ మొదలగు, విశ్వం=సమస్తప్రపంచము, సదా=ఎల్లప్పుడు, ధార్యతే=[వారివారి కార్యములందు] నిలుపఁబడుచున్నదో లేక పోషింపఁబడుచున్నదో, నిజధ్యాయినాం=తన్ను ఉపాసనచేయు జీవులయొక్క, అశేషదుఃఖం=సమస్తసాంసారిక దుఃఖములు, వార్యతే=నివారింపఁబడునో, అన్యైః=తనకంటె అన్యులైన బ్రహ్మాదులచే, యత్=ఏ కార్యము, నపార్యతే=సంపూర్ణముగఁ జేయఁబడఁజాలదో. (అది) సర్వం=సర్వమును [ఏవిష్ణుమూర్తిచే, పార్యతే=సంపూర్ణము-

గం చేయబడునో, సర్వప్రాణిభిః=సమస్తప్రాణులచేతను, అఖిలం=వారి వారియోగ్యతానుసారమైన సర్వకర్మలను, సదా=సర్వకాలమును, కార్యతే=చేయింపబడునో (బ్రహ్మాదులందఱును వారివారి సృష్ట్యాదివ్యాపారములు శ్రీహరిప్రేరణానుసారముగానే చేయుచుందురని భావము.) [అట్టి] దేవ... మండనం = దేవతాసమూహమునకు పూర్ణాలంకారమయిన, వాసుదేవం = వాసుదేవమూర్తివారిని (వయం = మేము) ప్రీణయామః = ప్రీతినొందించెదము.

తా॥ ఏవిష్ణుమూర్తివారిచేత బ్రహ్మమొదలగు సమస్తప్రపంచము ఎల్లప్పుడు ధరింపబడుచున్నదో, ఎవఁడు ఉపాసనచేయు జీవులయొక్క దోషమును పోఁగొట్టునో, ఎవఁడు సర్వదుఃఖనివారకుఁడో, తనకంటె ఇతరులయిన బ్రహ్మాదులచే ఏకార్యము సంపూర్ణముచేయఁబడనేరదో అట్టిదేవతా సమూహమునకు పూర్ణాలంకారుఁడయిన వాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము,

శ్లో॥ సర్వపాపానియత్సంస్మృతేస్సంక్షయం। సర్వదాయాంతిభక్త్యావిశుద్ధాత్మనాం। శర్వగుర్వాదిగీర్వాణసంస్థానదః। కుర్వతే కర్మయత్ప్రీతయేసజ్జనాః। ప్రీణ...... మండనం॥ ౧౦

అ॥ సర్వదా=ఎల్లప్పుడును, భక్త్యా=భక్తిచే, విశుద్ధాత్మనాం, విశుద్ధ=పరిశుద్ధమైన, ఆత్మనాం=అంతఃకరణములుగలవారికి, సర్వపాపాని=సమస్తపాపములును, యత్సంస్మృతేః, యత్=ఏవిష్ణుమూర్తివారియొక్క, సంస్మృతేః=స్మరణవలన, సంక్షయం=నాశనము, యాంతి=పొందునో [ఏవిష్ణుమూర్తి] శర్వ...దః శర్వ=శివునికి, గురు=గురువైనబ్రహ్మ [లేక] శర్వ=శివుఁడును, గురు = బ్రహ్మయును, ఆది = మొదలుగాఁగల దేవతలకు, సంస్థానదః, సంస్థాన = వారివారి పదములను, లేక- మోక్షమందు వారివారికి యోగ్యమైన స్థానములను, దః=ఇచ్చువాఁడు, సజ్జనాః=బ్రహ్మాదులందఱును, యత్ప్రీతయే, యత్=ఏవిష్ణుమూర్తివారియొక్క, ప్రీతయే ప్రీత్యర్థముగా, కర్మ=వేదవిహితమైన నిత్యనైమిత్తిక కర్మలను, కుర్వతే=చేయుదురో,[అట్టి] దేవ...మండనం=దేవతాసమూహమునకు పూర్ణాలంకారమైన, వాసుదేవం=వాసుదేవమూర్తిని (వయం=మేము) ప్రీణయామః=ప్రీతినొందించెదము.

తా॥ ఎల్లప్పుడు నిర్మలమైన భక్తిగలవారికి ఏవిష్ణుమూర్తి స్మరణవల్ల సమస్తపాపములు నశించునో, బ్రహ్మాదులకు వారివారిపదవులు తుదకు అనుగ్రహముచేసి యొసఁగినవో, ఎవని ప్రీతికొరకు సమస్తకర్మలు చేయఁబడునో అట్టి వాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ అక్షయంకర్మయస్మిన్ పరేస్వర్పితం। ప్రక్షయంయాంతిదుఃఖానియన్నామతః। అక్షరోయోజరస్సర్వదైవామృతః। కుక్షిగంయస్యవిశ్వంసదాజాదికం। ప్రీ...నం॥ ౧౧

అ॥ యస్మిన్=ఏ, పరే=సర్వోత్తముఁడైనవిష్ణుమూర్తియందు, స్వర్పితం, సు=భక్తిపూర్వకముగా, అర్పితం=సమర్పణచేయఁబడు, కర్మ=సత్కర్మ, అక్షయం=అక్షయఫలప్రదమైనదగునో, యన్నామతః, యత్=ఏవిష్ణుమూర్తియొక్క, నామతః=నామోచ్చారణచే, దుఃఖాని=సంసారిక దుఃఖములన్నియు, ప్రక్షయం=అత్యంతనాశనము, అనఁగా సమూలనాశనము, యాంతి=పొందునో (యస్యస్మృత్యాచనామోక్త్యా...అను ప్రమాణవాక్యము. శ్రీహరినామస్మరణ కర్మయొక్క వైకల్యాది రూపన్యూనాతి రేకములను పోగొట్టి మహాఫలజనకమగునని చెప్పుచున్నది) యః=ఏవిష్ణుమూర్తి, అక్షరః=దేహనాశనము లేనివాఁడో, అజరః=జరా మరణాది వికారములులేనివాఁడో, సర్వదైవామృతః సర్వదా=త్రికాలములందును, అమృతః=ముక్తుఁడో, యస్య=విరాడ్రూపియైన ఏవిష్ణుమూర్తికి, అజాదికం=బ్రహ్మమొదలగు, విశ్వం=ప్రపంచము, సదా=ఎల్లప్పుడును, కుక్షిగం=కుక్షిస్థమైనదో, (అట్టి) దేవ...మండనం=దేవతాసమూహమునకు పూర్ణాలంకారమైన, వాసుదేవం=వాసుదేవమూర్తిని (వయం=మేము) ప్రీణయామః=ప్రీతినొందించెదము.

తా॥ సర్వోత్తముఁడయిన ఏవిష్ణుమూర్తికి సమర్పణచేయఁబడిన సత్కర్మ అక్షయమయిన ఫలము నిచ్చుచున్నదో, ఏవిష్ణుమూర్తివారి నామోచ్చారణచే సాంసారిక దుఃఖములన్నియు నశించుచున్నవో, ఏవిష్ణుమూర్తి నాశనరహితుఁడో జరామరణములు లేనివాఁడో విరాడ్రూపుఁడయిన ఏవిష్ణుమూర్తియొక్క ఉదరమందు సమస్తప్రపంచము ఇమిడియున్నదో అట్టివాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము.

శ్లో॥ నందితీర్థోరుసన్నామినోనందినః। సందధానాస్సదానందదేవేమతిం। మందహాసారుణాపాంగదత్తోన్నతిం। నందితాశేషదేవాదిబృందంసదా। ప్రీణ...మండనం॥ ౧౨

అ॥ నంది...నందినః, నంది=ఆనందకరమయిన, తీర్థ=శాస్త్రమును, ఉరు=ఉత్కృష్టమును, సత్=నిర్దుష్టమును, అగు, నామినః=ప్రశస్తనామముగలట్టియు, లేక-నందితీర్థ=ఆనందతీర్థ భగవత్పాదులు చెప్పిన శాస్త్రమునకు, ఉరు=అనేకమయిన, సత్=సాధువులను, నామినః=నమస్కరింపఁజేయు వ్యాఖ్యానములట్టియు, నందినః=బ్రహ్మసాక్షాత్కారముచే సంతోషకంతులైనట్టియు, ఆనందదేవే=ఆనందస్వరూపియగు శ్రీహరియందు, మతిం=బుద్ధిని, సదా=ఎల్లప్పుడు, సందధానాః=ఉంచినట్టియు, అనఁగా, సర్వ

గా శ్రీహరియందాసక్తిగలట్టియు. (ఇట్టిమేము) మంద...స్మితం, మందహాస=మందహాసయుక్తమగు, అరుణ=కొంచెమెఱ్ఱనైన, అపాంగ=కటాక్షముచే, దత్త+ఉన్నతిం=(సజ్జనులకు) అభ్యుదయమును దయచేయునట్టియు, నంది...బృందం, నందిత=సంతోషింపఁజేయబడిన, అశేష=సమస్తమయిన, దేవాదిబృందం=దేవర్షి మనుష్యోత్తమ సమూహముగలట్టియు, దేవతా...మండనం, దేవతాసమూహమునకు పూర్ణాలంకారమయిన, వాసుదేవం= వాసుదేవమూర్తిధారిని, ప్రీణయామః= ప్రీతినొందించెదము. అనఁగా మేము చేయునదెల్ల తత్ప్రీత్యర్థముగఁ జేయుదుము. ఇట్లు సర్వము ముముక్షువులు చేయవలయునని తాత్పర్యము.

ఇది శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్య విరచితే ద్వాదశస్తోత్రే అష్టమోధ్యాయస్సమాప్తః.

శ్రీకృష్ణార్పణమస్తు.

తా॥ ఆనందతీర్థులవారియొక్క ఉత్కృష్టమయిన గొప్పనామముగలట్టియు, ఎల్లప్పుడును ఆనందరూపముగల దేవునియందు భక్తిగలుగనట్టియు, చిఱునగవుతోఁ గూడిన కొంచెముఎఱ్ఱనయిన కటాక్షవీక్షణముచే సజ్జనులకు అభ్యుదయము నిచ్చునట్టియు, సంతోషింపఁజేయఁబడిన సమస్తదేవఋషి మనుష్యగణముఁగలట్టియు, సమస్తదేవతలకు అలంకారభూతుఁడైన శ్రీవాసుదేవమూర్తిని ప్రీతినొందించెదము.

ఇది శ్రీమదానందతీర్థులవారిచే రచింపఁబడిన ద్వాదశస్తోత్రము

లందలి యెనిమిదవ అధ్యాయము.



శ్రీ గురుభ్యోనమః.

## నవమాధ్యాయప్రారంభః.

---

ఈ యధ్యాయమందు ఏదిమారాయొక్క ప్రయోజనముకొఱకు గ్రహింపఁబడిన శ్రీహరియొక్క అవతారస్వరూపములు మహాప్రళయకాలమందును మూలరూపమువలెనే సర్వదా యుండునని సూచించుచు సమస్తసద్వైష్ణవులును శ్రీహరిచరణములే శరణముగా నమ్మవలయునని తాత్పర్యముతో సులలితమైన సంబోధన పదములచే శ్రీహరిని స్తుతించుచున్నారు.

శ్లో॥ అతిమతతమోగిరి సమితివిభేదన। పితామహభూతిద గుణగణనిలయ। శుభతమకథాశయ పరమసదోదిత। జగదేకకారణ రామ రమారమణ॥ ౧

అ॥ హే అతిమత, అతి = అధికముగా, అనఁగా సర్వోత్తముఁడవని, మత = సమ్మతమయినవాఁడా! లేక- తెలియఁబడినవాఁడా! లేక- అతి = అధికమయిన, మత= జ్ఞానముగలవాఁడా! లేక- అతిమత = మాజ్ఞానమునకు సాకల్యముగా గోచరించని వాఁడా! లేక- (యోగులచే) అతి = అతిశయముగా, = తెలిసికొనఁబడు వాఁడా! లేక- అ = నిరతిశయమయిన, లేక-భక్తులకు ఆనందకారణమయిన, తి = ఆనందము గలవాఁడవని, మతి = తెలియఁబడువాఁడా! (ని॥ వేధోవిష్ణుమహేశాన కమఠేష్వంతికే జ్యరయోః। అంతఃపురే భూషణేచ చరణే కారణే దణే। అకారః కథితో ధీరైః రజతే గౌరవే తథా॥ అని ఏకాక్షరరత్నమాల. సచ్ఛబ్ద ఉత్తమాబ్రూహ్యోదా [illegible] — అని దశతాత్పర్యమందున్నది) లేక- అతి, అ=శ్రేష్ఠమైన అనఁగా పూర్ణమైన, తి=జ్ఞానము, వ్యాప్తి, నిశ్చయమనగా సమస్తమైనవారియొక్క స్వరూపనిర్ణయము, అవతారాది క్రమమును గలవాఁడవని (ని॥ తకారః పుంసి సంబోధే విస్తరే నిశ్చయే క్రమే।) మత= తెలియఁబడువాఁడా! లేక-అ=భగవంతుని విషయమై, తి=సర్వోత్తమత్వాది జ్ఞానము, తన్నిర్ణయము, ఆచారక్రమమును గలవారికి, మత= సమ్మతమైనవాఁడా! లేక- వారిచే దెలియబడువాఁడా! (ప్ర॥ అకారస్సర్వవాగాత్మా పరబ్రహ్మాభిధాయకః। అను భాష్యోక్తవచనము ప్రమాణము) లేక- అతి = అధికమైన, మ = సుఖమనగా ఆనందము, త = జ్ఞానమునుగలవాఁడా! లేక- అతి = అధికమైన, మ = సుఖమనగా ఆనందము యొక్క, త = వ్యాప్తి గల వాఁడా! లేక- అతి = అతిక్రమింపఁబడిన, మ = బంధమనఁగా సంసారబంధముగల ముక్తులకు, త = జ్ఞాన, నిశ్చయ, క్రమములను దయచేయువాఁడా! హే తమోగిరి సమితి విభేదన, తమః = నానావిధ అనేక అజ్ఞానములనే, గిరిసమితిః = పర్వత సమూహములను, విభేదన = నాశనముచేయువాఁడా! లేక- అతిమతతమోగిరి సమితివిభేదన, అని ఏకపదముగా తీసికొనినపక్షమందు, అతిమత = అధికజ్ఞానులయొక్క, తమోగిరి సమితి = అజ్ఞానసమూహమును, విభేదన = విశేషముగాఁ బోఁగొట్టువాఁడా! హే పితా మహభూతిద, పితామహ = చతుర్ముఖ బ్రహ్మకు, భూతి = జ్ఞానాది సంపత్తును, ద = దయచేయు వాఁడా! లేక- అతి మత తమోగిరి సమితివిభేదన పితామహభూతిద, అని ఏకపదముగా తీసికొనిన పక్షమున, అతిమత తమ=అధికజ్ఞానులలో శ్రేష్ఠులైన, ఉ=రుద్రుఁడు, గిరిసమితివిభేదన=పర్వత సమూహములను భేదించిన, ఇంద్రుఁడు, పితామహ=చతుర్ముఖుఁడు, వీరికి- భూతిద=జ్ఞానాద్యైశ్వర్యములను దయచేయువాఁడా! అతిమతతమ... అనుపాఠమందైనను ఇదే యర్థము. లేక అతిమతతమ+ఉగిరిసమితి విభేదన పితామహభూతిద, అని రెండుపదములుగా తీసికొనవ

చ్చును. అతిమతిశము, అతిమతి = అధికజ్ఞానముచే, శము = అధికుఁడా! ఉగిరి. భూతిద = రుద్రేంద్రబ్రహ్మలకు జ్ఞానాదిసంపత్తుల నిచ్చువాఁడా! లేక, ఉగిరిసమితివిభేదన పితామహ, భూతిద, అని రెండు పదములుగా చెప్పవచ్చును. ఉగిరిసమితివిభేదన = రుద్రేంద్రులకు, పితామహ = తాతయైనవాఁడా! శ్రీహరివాయుమూర్తి వారికితండ్రిగనుక రుద్రేంద్రులకు తాతయని తాత్పర్యము. 'చతుర్ముఖాభాంశ్చతురః కుమారాన్" అను వాక్యము ప్రమాణము) భూతిద = స్వభక్తులకు జ్ఞానాదులను దయచేయువాఁడా! హేగుణగణనిలయ, గుణగణ = జ్ఞానానందాదిగుణసమూహమునకు, నిలయ = ఆశ్రయుఁడా! హే శుభతమకథాశయ, శుభతమ = అత్యంతమంగళములైన, కథ = కథలకు (తత్త్వవిచారచర్యలకు) ఆశయ = ఆశ్రయుఁడా! శ్రీహరినిగూర్చిన సమస్తతత్త్వజిజ్ఞాసలు ప్రవృత్తమైనవని తాత్పర్యము, లేక, శుభతమ = పరమమంగళమైన, కథ = కథలను, ఆశయ = అభిప్రాయమూలుఁడా! లే,! శుభతమ = అత్యంతశోభన స్వరూపుఁడా! ("మంగళానాంచమంగళం' అను వాక్యము, ప్రమాణము) కథాశయ, కథ = పాషాణమును స్త్రీనిగాచేయుట మొదలగు చిత్రకథలకు ఆశయ = ఆశ్రయుఁడా! లేక-శుభతమకథ = పరమమంగళరూపమయిన వృత్తాంతములుగలవాఁడా? ఆశయ = సర్వాధారుడా! ("నిఃఆశయస్స్వాద్భవా?యేషామపాధారయోరపి' అని విశ్వనిఘంటువులో నున్నది) హే పరమ = సర్వోత్తముఁడా! లేక-పర = ఉత్తమమయిన, మ = జ్ఞానముగలవాఁడా! లేక-మ = లక్ష్మీదేవి, పర = శ్రేష్ఠురాలగుట ఎవరి కటాక్షమువలననో అట్టి మహానుభావా! లేక,పర = ఉత్తములయిన బ్రహ్మాదులకు, మ = జ్ఞానమును దయచేయువాఁడా! లేక పర = నిరతిశయమయిన,మ = రతి అనగా ఆనందము గలవాఁడా! లేక-పర = బ్రహ్మాదులకు, మ = రతి అనగా ఆనందమును దయచేయువాఁడా! లేక-ప = వాయుమూర్తికి, ర = సుఖము, మ = జ్ఞానమును దయచేయువాఁడా లేక-ప = వాయుమూర్తిని, రమ = సంతోషింపఁజేయువాఁడా! లేక-ప = వాయుమూర్తితోఁగూడ, రమ = క్రీడించువాఁడా! అనఁగా వాయుమూర్తి నధిష్ఠించి సంచరించువాఁడా! ("వరదోవాయువాహనః "అని ప్రమాణవాక్యము) లేక-ప = పర్వతమందనఁగా వేంకటాచలాది పర్వతములందు, రమ = క్రీడించువాఁడా! లేక,ప = వాయుమూర్తి, ర = శివుఁడు, అగ్నిహోత్రుఁడు, మన్మథుఁడు, వీరికి- మ = జ్ఞానము, లేక-రతి-అనఁగా ఆనందము గలుగఁజేయువాఁడా! లేక,పర = శక్యముక్తురాలయిన, మ = లక్ష్మీదేవిగలవాఁడా! లేక-పర = అత్యాసక్తిగల భక్తులవిషయమై,మ = స్మృతిగలవాఁడా! (అనఁగా భక్తుల నెల్లప్పుడును మఱువని వాడనుట) లేక-ప = పర్వతములను, ర = (రిక్తము అను ధాతువును బట్టి) దానమునుచేసెడి ఇంద్రునికి,మ = స్మృతిని, అందువలన నేలానందమును గలుగఁజేయువాఁడా! లేక-ప = శిశువులకు అనఁగా రక్షింపఁదగినవారైన భాగవతులకు, ర = అభీష్టములను దయచేయు, మ = విష్ణుమూర్తీ! లేక- మ = చిదానందరూపమునుచే, రమ = భక్తులను సంతోషింపఁజేయువాఁడా! హేసుదోదిత, సుదా = సర్వదా, ఉదిత = ప్రకాశమానుఁడా! లేక- సత్ = సజ్జనులచే, అ = లెస్సగా, ఉదిత

సంకీర్తనచేయఁబడువాఁడా! శేక-సత్ = సజ్జనుల కొఱకు, అ = విశేషముగ, ఉదిత= అభివ్యక్తమగువాఁడా! [“పాండవానాం హితార్థాయ। ధర్మసంస్థాపనాయచ। దానవానాంవినాశాయ। సంభవామియుగేయుగే” అనువాక్యము (పురాణము) శేక-సత్ = సజ్జనులయందు, ఉదిత = సాన్నిధ్యముగలవాఁడా! (‘తులసీ వనం యత్ర। యత్రపద్మవనానిచ। వసంతి వైష్ణవాయత్ర। తత్రసన్నిహితోహరిః’ అనువాక్యము (పురాణము) శేక-స = నివారణమనఁగా సంసారదుఃఖ నివారణమును, ద = ఇచ్చునట్టి లక్ష్మీదేవిచే, ఉదిత = స్తుతింపఁబడువాఁడా! పరమసదోదిత, అనునది ఏకపదముగఁ దీసికొనవచ్చును. సదా = ఎల్లకాలములలోఁ గూడికొనిన. ప = వాయుమూర్తి, ర = రుద్రుఁడు, అగ్ని హోత్రుఁడు, మన్మథుఁడు, మ = చంద్రుఁడు, బ్రహ్మ, (వీరందఱిచేత) ఉదిత = అభివ్యక్తమైనవాఁడా! శేక- విరిచే- ఉదిత = స్తుతింపఁబడువాఁడా! శుభతమకథాశయ పరమసదోదిత’ అను నది ఏకపదముగాఁ దీసికొనవచ్చును. శుభతమ = పరమకల్యాణ స్వరూపుఁడైన భగవంతుని యొక్క, కథా = కథలయందు, ఆశయ = మనస్సుగలవారిలో, పరమ = శ్రేష్ఠులయిన అనఁగా సర్వజీవోత్తములయిన వాయుమూర్తివారియొక్క అవతారమైన మధ్వాచార్యులవారిచే అ = లెస్సగా అనఁగా దుశ్శాస్త్రఖండన, సచ్ఛాస్త్రబోధనద్వారా, ఉదిత = తెలియజేయఁబడినవాఁడా! (ఇంద్రుఁడు శ్రుతి ప్రమాణము. యదీమను ప్రదివో మధ్వఆధవేగుహాసంతం మాతరిశ్వామథాయతి హేజగదేకకారణ, జగత్ = జగత్తునకు, ఏక = ముఖ్యమైన, కారణ = కారణమైనవాఁడా! శేక, జగత్ = జగత్తునకు, ఏక = అన్యమైఅనఁగా భిన్నముగానుండి, కారణ = కారణమయినవాఁడా! అనఁగా స్వతంత్రనిమిత్తకారణమని భావము. హేరామ = అవతారములాని శ్రీరామమూర్తితో అభిన్నమయిన రామావతార! (రామశబ్దమునకర్థము. ఏసచ్చిదానందమూర్తిని యోగులు సర్వదాధ్యానించుచుందురో అట్టిపరమాత్మరూపము “రామః” అనిచెప్పఁబడును. ఇందుకు ప్రమాణవచనములు. ““రమంతేయోగినోనంతే। సత్యానందచిదాత్మని। ఇతిరామపదేనాసౌ। పరబ్రహ్మాభిధీయతే॥ రాశబ్దోచ్చారణాదేవ। ముఖాన్నిర్యాతిపాతకః। పునఃప్రవేశభీత్యాతు। మకారస్తుకవాటవత్॥” అ॥ యోగినః = యోగులకు; అనంతే = విశేషముగ,రమంతే = ఆనందముకలుగజేయునట్టి, ఆనందే = సంతోషముతో. చిత్ = ఒప్పుచున్న, సత్యాత్మని = ఆత్మకలిగినట్టి, ఇతి = ఈవిధముగ, రామపదే = రామవాక్యమును,అసౌ = అ, పరబ్రహ్మ = పరబ్రహ్మయని, అభిధీయతే = స్మరించెదరు-అ॥ రాశబ్దోచ్చారణాదేవ, రా, అనుశబ్దమునుచ్చరించుటవలననే, పాతకః = పాపము, ముఖాత్ = ముఖమునుండి, నిర్యాత్ = వెడలిపోవును పునః = తిరిగి, ప్రవేశభీత్యాతు = ప్రవేశించునేమోయనుభయముచే, మకార = మఅనువర్ణము, కవాటవత్ = తలుపువలె, అస్తు = అగును.

అవతారమయిన శ్రీరామచంద్రమూర్తి శ్రీమధ్వాచార్యులవారికి ఉపాస్యమూర్తి యగుటవలన, ఈ యధ్యాయమందంతట రామునకు సంబోధనము చేయఁ

డినది. హేరమారమణ = ఓలక్ష్మీపతీ ! లేక- ర = సుఖము, మా = జ్ఞానము, వీ నితో- రమణ = ఆనందించువాఁడా ! లేక- రమా = లక్ష్మీదేవితో, రమణ = క్రీడించువాఁడా ! లేక- రమా = లక్ష్మీదేవి యందుండి, రమణ = రమించువాఁడా ! లేక-రమా = లక్ష్మీదేవిని, రమణ = సంతోషింపఁ జేయువాఁడా ! లేక- ర = సుఖాత్మకుఁడై అవతారమూర్తి కాని రామమూర్తి గలఁడని, వ = జ్ఞానము గలవారిని, అ = లెస్సగా, రమణ = (ఆమూర్తిలో అభిన్నమయిన బింబమూర్తి యొక్క అ శేషజ్ఞానము దయచేసి) సంతోషింపఁ జేయువాఁడా! లేక- ర = సుఖాత్మకవిగ్రహము యి అవతారము కాని రామమూర్తి యొక్క, మా = నిషేధము గలవారిని అనఁగా అవ తారముకాని రామమూర్తి లేఁడని చెప్పువారిని, అరమణ = దుఃఖపెట్టువాఁడా! మమశర ణంభవ = నాకురక్షకుఁడవుకమ్మని.

పరమమంగళ రూపములయిన వృత్తాంతములు గలవాఁడా! సర్వోత్తముఁడా! స జ్జనులచే సర్వదా కీర్తనము చేయఁబడువాఁడా! జగత్ప్రధానకారణుఁడా! సుఖముజ్ఞాన ము వీనితో ఆనందించువాఁడా! నాకురక్షకుఁడవు కమ్ము.

తా॥ మాజ్ఞానమునకు సాకల్యముగా గోచరింపనివాఁడవై, అజ్ఞానములను సర్వ తసమూహములను నాశనము చేయువాఁడవై, జగదాద్యుఁడవై, స్వభక్తులకు జ్ఞానాదులను దయచేయువాఁడవై, జ్ఞానానందాది గుణసమూహములకు ఆశ్రయుఁడవయిన యోరా మా! [ఇటనుండి శుభతమ...కు తాత్పర్యము.]

శ్లో॥ విధిభవముఖసురసతతసువందిత। రమామనోవల్లభభవ మమశరణం। శుభతమ...రమణ॥ ౨

అ॥ విధి=వందిత, విధి=చతుర్ముఖబ్రహ్మ, భవ=రుద్రుఁడు, ముఖ=మొదలు గాఁగల, సుర=దేవతలచే, సతతం=ఎల్లప్పుడును, సు=లెస్సగా,వందిత=భక్తిపూర్వక ముగానమస్కరింపఁబడిస్తుతింపఁబడువాఁడా !రమామనోవల్లభ, రమా=లక్ష్మీదేవియొక్క మనః=మనస్సునకు, వల్లభ=ప్రియమైనవాఁడా ! లేక-విధిభవ...వల్లభ, విధిభవముఖసు ర=బ్రహ్మరుద్రాదిదేవతలచే, సతతసువందిత=సర్వదావిశేషముగస్తుతింపఁబడెడి, రమా= లక్ష్మీదేవియొక్క, మనోవల్లభ=మనఃప్రియుఁడా ! (ఇట్టియోరామా) నీవు,మమ=నాకు, శరణం=రక్షకుఁడవు,భవ=అగుము. శుభతమ...రమణ, అను ఉత్తరార్ధమునకు పైశ్లోకమం దుచెప్పఁబడిన అర్థమును గ్రహించవలయు.

తా॥ ఓవిష్ణుమూర్తీ ! నీవు బ్రహ్మరుద్రాదులచేతను, సమస్తదేవతలచేతను బూ జింపఁబడువాఁడవు. ఐశ్వర్యదాయిని యగులక్ష్మీదేవికి నాయకుఁడవు, అట్టి నీవు మాకు శరణ్యుఁడవు. మమ్మురక్షింపుము.

శ్లో॥ అగణితగుణగణమయశరీర హే విగతగుణేతరభవమమ శరణం। శుభతమ...రమణ॥ 3

అ॥ హే అగణిత...శరీర, అగణిత=లెక్కింపశక్యముగాని, గుణగణముల=గుణ సమూహాత్మకమైన, శరీర=విగ్రహముగలవాఁడా! హే విగతగుణేతర, విగత=పోయిన (అనఁగా ఎప్పుడును లేనట్టి) గుణేతర=దోషములుగలవాఁడా! లేక-విగత, వి=గరుడమూర్తితో, గత=గమనముగలవాఁడా! గుణేతర, గుణ=అప్రధానమయిన ప్రపంచముకంటె, ఇతర=విలక్షణమైనవాఁడా! లేక-గుణ=సత్వ, రజ, స్తమో గుణములకంటె, ఇతర=భిన్నుఁడా! (అనఁగా గుణత్రయరహితుఁడని భావము) ఇట్టి ఓ శ్రీరామచంద్రమూర్తీ! భవమమ శరణం=నీవునాకు రక్షకుఁడవు కమ్ము. శుభమేత్యాది పూర్వమువలెనే-

తా॥ సద్గుణస్వరూపుఁడవును, దుర్గుణరహితుఁడవును నైన ఓస్వామీ! నీవునాకురక్షకుఁడవుకమ్ము గుణత్రయవిహీనుఁడవై గరుడవాహనుఁడవయిన రామాయతీశమూర్తీ నన్నురక్షింపుము.

శ్లో॥ అపరమితసుఖనిధి విమలసుదేహ హే విగతసుఖేతరభవమమశరణంశుభతమ...రమణ॥ ............ ౪॥

అ॥ హే అపరమిత...సుదేహ, అపరిమిత=సంపూర్ణమైన, సుఖ=సుఖమునకును నిధి=ఆశ్రయమైనదియు, విమల=నిర్దోషమైనదియు, లేక-జ్ఞానమయమైనదియు, సు=మంగళస్వరూపమైనదియునగు, దేహ=దేహముగలవాఁడా! (అనఁగా అప్రాకృతదివ్యమంగళవిగ్రహముగలవాఁడని భావము) లేక-హే అపరిమిత=దేశకాలగుణములచే మితిలేనివాఁడా! హే సుఖనిధివిమల, సుఖనిధి=పూర్ణానందముగలట్టియు, విమల, వి=జ్ఞానముగల, మ=బ్రహ్మను, ల=మహాప్రళయమందుదరములో గ్రహించునట్టివాఁడా! లేక. వి=పోయిన, మ=బంధమనఁగా సంసారబంధముగలముక్తులచే, ల=గ్రహింపఁబడువాఁడా! అనఁగా ధ్యానింపఁబడువాఁడా! లేక-విమ=సిద్ధమయిన,మా=జ్ఞానముగలవారిని, ల=చేదించువాఁడా! హే సుదేహ, సు=ఆనందమే ("స్వేత్యానందస్సముద్దిష్టః" అనుప్రమాణము, దేహ=దేహముగాఁగలవాఁడా! హే విగతసుఖేతర,విగత=పోయిన (అనఁగా కాలత్రయమందును లేనట్టి) సుఖేతర=దుఃఖముగలవాఁడా! లేక- హే విగత, వి=పరమాత్మను, అనఁగా మూలరూపముతో, గత=మహాప్రళయమందు సంశ్లేషము బొందినవాఁడా! ("కదాచిదీశస్సకలావతారాన్ శరం విధాయాహి పతౌహి శేతే" అనువాక్యము ప్రమాణము.) హే సుఖేతర, ఇతర=దయిత్యాదులకు, సు=ప్రశస్తమైన, ఖ=ఖడ్గము వంటివాఁడా! (అనఁగాఖడ్గమువలె దయితుల్యలను నాశనముచేయువాఁడని యర్థము) లేక- సు=తెస్సగా అనఁగా నిశ్చయముగా, ఖ=(ఇతరులు చెప్పిన) శూన్యముకంటె, ఇతర=భిన్నుఁడా, (శత్వము శూన్యమని శూన్యవాదులందురు. అటులకానివాఁడని భావము. నిఘంటువు "ఖంపుల్లింగే కృతేదిశేస్వర్గ శూన్యోదరాదిషుక్లీబాతే నిశ్చయేశాంతే విహాగేగణనాయకే"

అని ఏకాక్షర రత్నమాల) లేక - హేసుఖ=సుఖస్వరూపుఁడా! లేక - సు=ఆనందాత్మక మయిన, ఖ=ఖడ్గముగలవాఁడా! (అనఁగా శ్రీహరియొక్క ఆయుధములును తత్స్వరూపభూతము లేయనిభావము) లేక - ఖ=గరుడమూర్తికి, గణనాయకునకును, సు=సుఖప్రదుఁడా! హేఇతః=ఇతరాదేవికిని మారుఁడుగా జన్మించినవాఁడా! లేక-ఇత=పొందఁబడినవారికి, అనఁగా శ్రవణాదులచే భగవదుపాసన చేయు భక్తులకు, ర=సుఖమును గలుగఁజేయువాఁడా! (ఇట్టియో రామా అనఁగా అవతార మూర్తితో అభిన్నుఁడగయిన అనవతార రామమూర్తి!) భవమమ శరణం=నీవునాకు రక్షకుడవు కమ్ము. శుభమేత్యాది పూర్వమువలెనే. ఈశ్లోకమునకుబూర్వోక్తముగఁ జేయఁబడిన విశేషవ్యాఖ్యానమువలన భగవంతుని యొక్క లక్షణములకును, భగవద్దేహమునకును, భగవంతునితో అత్యంతాభేదమేయని సూచింపబడినది ఇంతేగాక మూల రూపమునకును అవతారరూపములకును, అనవతార రూపములకును, అత్యంతాభేదమని తెలియఁజేయఁబడినది.

తా॥ అనంతుఁడవై, ఆనందస్వరూపుఁడవై, ముముక్షు సేవితుఁడవై, భూతభవిష్యద్వర్తమాన ములలో నెల్లప్పుడును గూఢసుఖరా హిత్యమయిన సంపూర్ణానందము తోఁగూడినవాఁడవై ఆనందాత్మకమైన ఖడ్గముగలవాఁడవై శ్రవణాదులచే నుపాసన చేయుభక్తులకు సుఖప్రదుఁడవైన అనవతారమూర్తివగు నోరామమూర్తీ! నాకురక్షకుఁడవుకమ్ము.

శ్లో॥ ప్రచలితలయజలవిహరణశాశ్వత సుఖమయమీనహేభవమమశరణం। శుభతమ...రమణ॥ ౫

ఈశ్లోకమందు అనవతారమత్స్యరూపమును స్తుతించి ఆమూర్తియొక్క శరణమునుగోరుచున్నారు

అ॥ ప్రచలిత...విహరణ, ప్రచలిత=ప్రళయ కాలీన మహావాయువు వలన చలించిన, లయజల=ప్రళయోదకమునందు, విహరణ=విహరించువాఁడా! లేక - ప్ర=విష్ణుమూర్తివారిచే, అనఁగా తనచేతనే, చలిత=డోలాయమానమయిన, లయజల విహరణ=ప్రళయోదకమునందు విహరించు స్వభావముగలవాఁడా! శాశ్వత=సర్వదా అనఁగా ప్రళయమందు, తత్పూర్వము. తదనంతరమునుగూడ, ఒక్కరీతిగా నుండువాఁడా! (పూర్వోక్తవిశేషణములచే కూర్మాద్యవతార రూపములును ఇట్టివేయని సూచింపబడినవని తెలియవలయు) హే సుఖమయ=సుఖాత్మకవిగ్రహా! హేమీన=అనవతారమత్స్యస్వరూపుఁడా! ఇట్టిఅవతారమత్స్యరూపముతో అభిన్నమైన అనవతారమత్స్యమూర్తీ! మమశరణం భవ=నాకురక్షకుఁడవుకమ్ము. లేక - హేరామ=అనవతార అవతారమత్స్యరూపములతో అభిన్నమైనరామా అనవతారరామమూర్తీ నాకురక్షకుఁడవు కమ్మని యన్వయము. శుభమేత్యాది పూర్వమువలెనే.

తా॥ మీనమూర్తివై ప్రళయకాలమందు ప్రళయోదకములో విహరించుచు, శాశ్వతుఁడవై, ప్రళయమందును, దత్పూర్వమందును, బరమందును గూడ నేకరూపముతో

లోకమందు సుఖముగా నుండవలెనో యనవతారమత్స్యమూర్తీ ! నాకురక్షణచేయవలెను.

శ్లో॥ సురదితిజసుబల విలులితమందరధరవరకూర్మ హే భవమ
మశరణం । శుభతమ ..రమణ॥ ౬

ఈశ్లోకమందు అనవతారకూర్మరూపమును స్తుతించి ఆ మూర్తియొక్క శరణమును ప్రార్థించుచున్నారు.

అ॥ హే సుర...ధర, సుర=దేవతలు, దితిజ=దైత్యులు,వీరియొక్క,సుబల=అధిక బలముచే,విలులిత=త్రిప్పఁబడిన, మందర=మందరపర్వతమును,ధర=ధరించిన,వర=(ఇట్టిఅవతారకూర్మస్వరూపముతో) అభిన్నమైన,కూర్మ=అనవతారకూర్మస్వరూపుఁడా! లేక హే సుర, సు=ఆనందప్రదమైనదక్షిణపాదముచే, ర=ఉపాసకులనుసంతోషింపఁజేయువాఁడా! ("శ్రుతి-దక్షిణంపాదమువశే నిజేస్మిన్ప్రాప్తం ఇంద్రియందదామి") లేక, సు=ఆనందముతో, ర=క్రీడించువాఁడా ! హే దితిజ, ది=మోహనమువలన లింగభంగముగలట్టియు, తి=భగవదపరోక్షజ్ఞానముగలట్టియు, ముక్తులకు, జ=విజయము, సర్వత్రగమనమునుదయచేయువాఁడా ! హే సుబల, సు=యోగ్యమైన, అనఁగానిరవధికమైన, బల=బలముగలవాఁడా ! హే విలులిత=ప్రళయోదకమందు తిరుగువాఁడా! లేక-సుబలవిలులిత, సుబల, సు=నిరతిశయమైన, బ=బలముగలట్టినారాయణమూర్తిని, ల=గ్రహించునట్టిప్రళయజలమందు, (అనగా ప్రళయమందు అన్నిరూపములను కలిసియుండునని తాత్పర్యము) విలులిత=తిరుగువాఁడా ! హే మందర, మంద=అజ్ఞానులను (అనవతారకూర్మరూపములనెరిగిజ్ఞానములేనిభక్తులను) ర=అట్టిజ్ఞానముకలుగఁజేసి సంతోషింపఁజేయువాఁడా! హే ధర, ధ=పర్వతమందుఁగా వేంకటాద్రిమొదలగువానియందు, ర=క్రీడించువాఁడా ! లేక-ధ=ధన్వంతరివలె, ర=సంతోషముగలవాఁడా ! లేక-ధ=దానమనఁగా మోక్షదానముచే, ర=భక్తులను సంతోషింపఁజేయువాఁడా ! లేక-ధ=ఆలింగనమును, ర=(అందుకొనుటకై వారికి) ఇయుచేయువాఁడా, ధ=నిశ్చయమైన, ర=కామా! (నిఘంటువు. ధః పుంస్యద్రౌ ధకారం ధే స్యాద్ధన్వంతరిరపి స్మృతః। దానే మనోవిశేషే చ ధా దాశ్లేషధరిషు॥ ఏకాక్షరరత్నమాల) హే భవ, భ=భ అను పేరుగలిగి జ్ఞానప్రదమైనపాదముచే, వ=ఉపాసకులను సంతోషింపఁజేయువాఁడా ! అనఁగా జ్ఞానము దయచేసి భక్తులను సంతోషింపఁజేయువాఁడా ! (శ్రుతి॥ సర్వం పాదశ్చ భవే ఉత్స్మిన్ ప్రాప్తం ఇంద్రియందదామి) లేక-వ=వాయుమూర్తితో, ర=క్రీడించువాఁడా ! లేక-వ=వాయుమూర్తిని, ర=సంతోషింపఁజేయువాఁడా ! లేక-వ=వరుణునిచే, ర=(లోకమును వర్షముకురిపించి) సంతోషింపఁజేయువాఁడా ! లేక-వ=వరుణుని, ర=సంతోషింపఁజేయువాఁడా లేక-వ=యూర్ధ్వమందు, ర=సంతోషముగానుండువాఁడా, లేక-వ=పర్వతమందు (వేంకటాచలాదులందు) ర=క్రీడించువాఁడా ! లేక-వ=జ్ఞానముచే, ర=రమించువాఁడా! లేక-వ=కాంతిచే, ర=(లోకములను) ఆనందింపఁజేయువాఁడా ! (యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం । యచ్చంద్రమసి యచ్చాగ్నౌ । తత్తేజో విద్ధి మామకం॥ అనిగీతా

వాక్యము ప్రమాణము.) లేక-వ=స్వరూపభూతమైన ఆకాశమందు, ర=క్రీడించువాఁడా, లేక-వ=గరుత్మంతునితో, ర=క్రీడించువాఁడా! లేక-వ=గరుడుని, మన్మథుని, ర=సంతోషింపఁజేయువాఁడా! లేక-వ=మన్మథునివలె, ర=(లోకములను) సంతోషింపఁజేయువాఁడా! లేక-వర=వరశబ్దవాచ్యుఁడా! (రామోఽత్యర్థపతిర్వరః అనితంత్రసారమందున్న వాక్యము ప్రమాణము. ని॥ శ్రీపురుషాన్ పాంత్వ శివాతే। వరుణోసంయమోధరః। ప్రబోధేమదనేచైవ। విహగేగగనే భవేత్। ఏకాక్షరరత్నమాల) హేవరకూర్మ=లోకవిలక్షణ ఉత్కృష్టకూర్మావతారా! అనఁగా అనవతారకూర్మస్వరూపుఁడా! లేక-వరకూర్మహే, వరకూర్మ=కూర్మావతారుఁడని, అనవతారకూర్మస్వరూపుఁడనియు, హే=ప్రమాణప్రసిద్ధిగలవాఁడా! హేరామ=అవతార, అనవతారకూర్మస్వరూపములతో అభిన్నమైనయీయనవతారరామా! మమశరణంభవ=నాకురక్షకుఁడవుకమ్ము. శుభమేతాన్ విపూర్వమువలెనే

తా॥ బలాధిక్యముచే దేవాసురలచేఁ ద్రిప్పఁబడిన మందరపర్వతముగల అవతారకూర్మరూపముతో నభిన్నమైన అనవతారకూర్మరూపమునుగలిగి కూర్మముపోల్కి నేత్రశయ జలమునందు సంచరించుచు, భగవదపరోక్షజ్ఞానముగల భక్తులకు శుభములిచ్చుచు, మందులకు జ్ఞానమునొసఁగుచు, మోక్షదానముచే భక్తులను సంతోషింపఁజేయునో యనవతార కూర్మమూర్తీ! మా కురక్షకుఁడవుకమ్ము.

శ్లో॥ సగిరివరధరాతల వహన సుసూకర పరమ విబోధ హే భవ
మమశరణం శుభతమవ... మ॥ ౨

ఈశ్లోకమందు అనవతార వరాహమూర్తినిస్తుతించి ఆయనను రక్షకుఁడవుకమ్మని ప్రార్థించుచున్నారు. అ॥ హేసగిరి...సుసూకర, సగిరివర=శ్రేష్ఠపర్వతములతోఁగూడిన, ధరాతల=భూమండలమును, వహ=దంష్ట్రాగ్రముచే వహించిన వరాహావతారముతో న=అభిన్నమైన, సు=శోభాయుక్తమైన, లేక-సుఖయుక్తమైన, సూకర=అనవతార వరాహరూపుఁడా! హేపరమవిబోధ, పర=యోగ్యులైన అధికారులకు, మ=మనసానా కవిష్ణుమూర్తితో అభిన్నమైనసూకరావతారమును, వి=తదభిన్నమైన అనవతారసూకర రూపముగల పరమాత్మయునగుఁడని, బోధ=జ్ఞానమును గలుగఁజేయువాఁడా! (అతయ ప్రవిసంభూతామ్ స్వభువో విష్ణువాచకా, అనువాక్యమును, విపక్షి పరమాత్మనోః అనునిఘంటువును ప్రమాణములు) లేక-పరమ=ఉత్కృష్టమైన, విబోధ=జ్ఞానస్వరూపుఁడా! లేక-పరమవిబోధహే, పరమవిబోధ=ఉత్కృష్టజ్ఞానస్వరూపుఁడవని, హే=ప్రసిద్ధిగలవాఁడా, లేక సగిరివర, ధరాతల, వహన, సుసూకర, అనినాలుగు సంబోధనపదములుగా విభాగింపవచ్చును. అ॥ హేసగిరివర, స=శ్రేష్ఠమైన, గిరి=పర్వతమనఁగా మేరుపర్వతముచేత, వర=కొన్నత్యము గలవాఁడా! హేధరాతల, ధరా=భూమియొక్క, త=అనుకూలమైనజ్ఞానముచే, ల=గ్రహింపఁబడువాఁడా! (ప్రపంచోపలక్షకమైన సమస్తపదార్థములయొక్క సమ్యగ్జ్ఞానముచే తెలియఁబడఁదగిన వాఁడనిభావము) హేవహన, వాయువా

తార నరసింహమూర్తీ! హేఅమల=దోషరహితుఁడా! లేక- అ=అనవతారనృసింహ
మూర్తియు, ప్రసన్నుఁడైన వాసుదేవమూర్తియు, మ=సత్యమనిపలికెదు అధికారు
లకు, ల=పూర్తి అనఁగా యథాయోగ్యమయిన జ్ఞానానందాదులయొక్క పూర్ణత్వము
దయచేయువాఁడా! లేక- అట్టిజ్ఞానులను, ల=స్వీకరించువాఁడా! అనఁగా వారివిషయము
లై అనుగ్రహముచేయువాఁడా! లేక- అ=అపగతమైన [పోయిన] మ=బంధముగల
ముక్తులను, ల=స్వీకరించువాఁడా! లేక- యథాయోగ్యజ్ఞానాది పూర్ణత్వమును కలుగఁ
జేయువాఁడా! హేతారు- ఇట్టి అనవతార అవతార నరసింహాభిన్నమైన అనవతార
రామమూర్తీ, మమశరణంభవ=నాకు రక్షకుఁడవుకమ్ము. శుభతమేత్యాది పూర్వము
వలెనే.

తా॥ బలాధికుఁడైన హిరణ్యకశిపుని గుండెలను బ్రద్దలుచేసిన అనవతారనృసింహ
మూర్తితో నభిన్నమయిన యనవతార నృసింహమూర్తివై అతిబలుఁడవై, ముక్తబ్రహ్మా
దులకు ఆనందమును భగవదపరోక్షజ్ఞానము నిచ్చుచు, పాపహారియగు శ్రీహరిని పొందిం
చుచు, భేదరూపమును బొందించువాఁడవై జనార్దననామక శ్రీహరితోను యజ్ఞనామక
శ్రీహరితోను నభిన్నుఁడవయిన ఓస్వచ్ఛస్వరూపుఁడా నాకు శరణమవుకమ్ము.

శ్లో॥ బలిముఖదితిసుత విజయవినాశన జగదవనాజిత భవమ
మశరణం శుభతమ...రమణ॥

అనవతార వామనరూపమును స్తుతించి ఆతనను రక్షకుఁడవుకమ్మని ప్రార్థించు
చున్నారు.

అ॥ హేబలిముఖ...వినాశన, బలి=బలిచక్రవర్తి, ముఖ=మొదలుగాఁగల, ది
తిసుత=దైత్యులయొక్క, వి=విగతమైన,జయ=అభ్యుదయముగల, లేక, బలిముఖ...విజ
య, బలిచక్రవర్తి మొదలగు దైత్యులను జయించిన వామనావతారమువలె, వినాశన, వి=
విగతమైన అనఁగా ఎప్పుడును లేనట్టి, నాశన=నాశకారణముగల అనవతారవామన
మూర్తీ! లేక- బలిముఖదితిసుత, విజయ, వినాశన, అని మూఁడుపదములుగా విభజింపవ
చ్చును, హేబలిముఖదితిసుత, బలి, బ=బలముయొక్క, ల=పూర్తి అనఁగా యథా
యోగ్యమైన పూర్ణబలము గల్గుబ్రహ్మ, ముఖ=మొదలగు, దితి=ముక్తులకు, సు=ఆనంద
ము, త=జ్ఞానమును దయచేయువాఁడా! లేక- బ=విశేష బలముగల బలినామక శ్రీహరి
చే, లి=స్వీకరింపఁబడునట్టి అనఁగా సర్వాంగసాయుజ్యముగల ముక్తబ్రహ్మ, ముఖ=
మొదలగు, దితి=ముక్తులకు, సు=ఆనందము, త=జ్ఞానము, వైరాగ్యగుణ సంపూర్తి, హ
రిసర్వోత్తమత్వాది నిశ్చయమును కలుగఁజేయువాఁడా! లేక- బలిముఖ, దితిసుత, అ
ని విభజింప వచ్చును. హేబలిముఖ=బ్రహ్మముఖ మంచు గలవాఁడా! 'బ్రాహ్మణో
స్యముఖమాసీత్, యస్మాత్ప్రజ్ఞాయతే చాంగాల్లోక వేదాది కంపాకే, తస్మాన్మహావ్య
ముఖంతద్యథా బ్రహ్మముఖం' అనెడిశ్రుతులు (ప్రమాణములు) హేదితిసుత, దితి=
ముక్తులయందు, సు=అతిస్పష్టమగు తత్వ్యాప్తిగలవాఁడా! హేవిజయ, వి=పరమాత్ముఁడనఁ

గా మూలరూపియగు నారాయణమూర్తియొక్క, జయ=జయము గలవాఁడా! లేక, మూలరూపియగు నారాయణమూర్తియొక్క, జ=విస్తృతి అనఁగా వ్యాప్తిని, యః= పొందబడినవాఁడా! అనఁగా మూలరూపముతో అభిన్నమైన అనవతార వామనమూర్తీ! హే వినాశన, వి=విగతమైన అనఁగా ఎప్పుడునులేని, నాశన=అనిత్యత్వ, దేహహాని, దుఃఖప్రాప్తి, అపూర్ణత్వము, ఈనాలుగువిధములయిన నాశముగలవాఁడా! విజయవినాశన, అనిఏకపదముగాఁ దీసికొనవచ్చును, వి=పరమాత్మతో అభిన్నమైన వామనమూర్తి యొక్క, జ=విజయమును, యః=తెలిసినవారిని అనఁగా అనవతార వామనమూర్తి మూలరూపముతో అభిన్నుఁడని తెలిసిన జ్ఞానులకు, వినాశ=నాశాభావమును, న= పొందించువాఁడా! అనఁగా వారికివృద్ధికలుగఁజేయువాఁడా! లేక- వి= పరమాత్మనితో అభిన్న అనవతార మయిన వామనమూర్తి యొక్క, జ= ద్వేషమును, యః= పొందిన వారిని అనఁగా అట్టి అనవతార వామనరూపము లేదను వారిని, వినాశన=నాశము చేయువాఁడా! హే జగదవన, జగత్=జగత్తును, అవన=రక్షించువాఁడా! లేక- హే జగద, జ=విస్తారమైన, గ=జ్ఞానముగల బ్రహ్మ, ద=పుత్రుఁడుగాగలవాఁడా! లేక- హే జ=జనార్దనునితో అభిన్నుఁడా! హే గ=గరుడాసనునితో అభిన్న, హే ద=దండి అని తంత్రసారోక్తనామముగల సర్వలోకాధిపుఁడైన శ్రీహరితో అభిన్నుఁడా! హే వన, వ=జ్ఞానమును అనఁగా అనవతారవామనమూర్తి గలఁడనుజ్ఞానమును, న=భక్తులకు పొందించువాఁడా! అనఁగా భక్తులకుఁగలుగఁజేయువాఁడా! లేక- వ=అవతారవామనమూర్తివంటి, న=తదభిన్నుఁడవైన అనవతార వామనమూర్తీ! హే అజిత, జిత=జయింపఁబడిన, అ=రుద్రుఁడుగలవాఁడా! లేక- అజిత=ఎవరిచేతను తిరస్కరింప శక్యముకానివాఁడా! వనాజిత, అనిఏకపదముగాఁదీసికొనవచ్చును, అ॥ వ= మనోవికారకారియైన మన్మథునిచేతను, న=విఘ్నకారియైన విఘ్నేశ్వరునిచేతను, అజిత=జయింపఁబడనివాఁడా! అనఁగా వారివ్యాపారములకు విషయుఁడుకాఁడని భావము. ఇట్టియో రామ=అవతార . అనవతారవామనరూపాభిన్న అవతారరామా, మమశరణంభవ=నాకురక్షకుఁడవుకమ్ము, శుభమేత్యాదిపూర్వమువలెను,

తా॥ బలిచక్రవర్తిమొదలగు రాక్షసులనుజయించిన యవతార వామనమూర్తితో నభిన్నమైన యనవతారవామనమూర్తివై యథాయోగ్యమైన బలముగల బ్రహ్మాదిముక్తులకు జ్ఞానమునుఅనందమునుఒసఁగుచు, భగవన్మూలరూపముతో నభిన్నుఁడవై, నాశనరహితుఁడవై, జగద్రక్షకుఁడవైన దేవా యజేశుఁడా నాకురక్షకుఁడవుకమ్ము.

శ్లో॥ అవిజితకునృపతి సమితివిఖండన రమావరవీ రభవ మమశరణం శంభతమ..రమేశ॥ ౧౦

అనవతారపరశురామమూర్తిని స్తుతించి ఆమూర్తిని రక్షకుఁడవుకమ్మని ప్రార్థించుచున్నారు.

అ|| అవిజిత...ఖండన, అవిజిత=భగవదితరులచేత జయించఁబడని, కునృపతి=దుష్టక్షత్రియులయొక్క, సమితి=సమూహములను, విఖండన=విశేషముగ ఖండించిన అవతార పరశురామమూర్తితో అభిన్నుఁడయిన, రమావర=లక్ష్మీపతీ! లేక, అవిజిత, కునృపతిసమితివిఖండనరమ, అవర, అనిమూఁడు పదములుగాఁ జెప్పవచ్చును, హే అవిజిత, అ=విష్ణుమూర్తివారియొక్క, వి=జ్ఞానముగల ముక్తులచే, జిత=వశపరచుకొనఁబడినవాఁడా! అనఁగా ముక్తాధీనుఁడని తాత్పర్యము- లేక- అ=యుద్ధమందు, వి=కాంతిగల (అనఁగా రణశూరుఁడైన) అవతారరామునిచే, లేక- అ=అసురులైనరావణాదులతో, వి=యుద్ధముగల అవతారరామునిచే, జిత=జయింపఁబడినట్లు కనుపడిన అవతారపరశురామునితో, అభిన్నుఁడవయిన అనవతారపరశురామా! హేకునృపతి సమితి విఖండన రమ=దుష్టక్షత్రియసమూహములను ఖండించు అవతారపరశురామునివలె క్రీడించువాఁడా! హే అవర, అ=మూలరూప నారాయణునివలె, వర=శ్రేష్ఠమయిన అనఁగా సర్వోత్తముఁడయినవాఁడా! లేక- అ=బ్రహ్మరుద్రులకు, వ=జ్ఞానమనఁగా అనవతార పరశురామ విషయమయిన జ్ఞానము, ర=దయచేయువాఁడా! లేక- అ=బ్రహ్మరుద్రులకు, వర=వరములు దయచేయువాఁడా! లేక- అ=బ్రహ్మరుద్రులచే, వర=ఉపాసన చేయఁబడువాఁడా! లేక- అవర=తనకంటె శ్రేష్ఠుఁడు లేనివాఁడా! హేవీరప, వి=పరమాత్మను ఈర=సర్వదా చెప్పుచుండెడి సంకీర్తనచేసెడి ముముక్షువులను, ప=పాలించు వాఁడా! (శ్రుతి- "ఉతామృతత్వస్యేశానః") ఇట్టిరూపయవతార అనవతార పరశురామమూర్తితో అభిన్నుఁడవయిన అనవతారశ్రీరామా! మమశరణంభవ=నాకురక్షకుఁడవుకమ్ము శుభతమేత్యాది పూర్వమువలె.

తా|| దుర్జయులైన దుష్టరాజసమూహములను సంహరించిన పరశురామమూర్తితో నభిన్నమయిన యనవతార పరశురామమూర్తివై, విష్ణుమూర్తికి సంబంధించిన జ్ఞానముగల ముక్తులచే వశపఱచుకొనఁబడినవాఁడవై, దుష్టశిక్షకుఁడవై, అద్వితీయుఁడవైన రామముముక్షుజనపాలకుఁడా నాకు శరణమవుకమ్ము.

శ్లో|| ఖరతరనిశిచర దహనవరామృత రఘువరమానద భవ
మమశరణం శుభతమ......రమణ|| ౧౧

తమయుపాస్యమూర్తియగు అనవతార శ్రీరామచంద్రమూర్తిని స్తుతించి ఆయనను రక్షకుఁడవుకమ్మని ప్రార్థించుచున్నారు.

అ|| ఖర...దహనవర, ఖరతర=అత్యంతక్రూరులైన, నిశిచర=రాక్షసులను, దహన=దహించుటయందు, వర=ఆసక్తిగలవాఁడా! లేక- ఖరతరనిశిచర=అత్యంతక్రూరులైన రాక్షసులను, దహన=భస్మముచేయు నగ్నివంటివాఁడా! హే వర=శ్రేష్ఠ, (సర్వోత్తమా) హే అమృత=మరణాదిదోషవిదూరా! హే రఘువర=రఘుకులశ్రేష్ఠుఁడా! ఇట్టియవతారరామమూర్తివలె, మానద, మా=జ్ఞానమనఁగా భగవదపరోక్ష జ్ఞానముచే న=పొందఁదగిన మోక్షమును, ద=దయచేయువాఁడా! లేక- మాన=బహుమానమును,

ద=దయచేయువాఁడా! [అవతార రామమూర్తీ, హనుమదాదిభక్తులకుబహుమానము, మోక్షమును దయచేయునట్లె అతనితో అభిన్నుఁడైన అనవతార రామమూర్తి తన్నుపాసనచేయువారికి బహుమానమును, మోక్షమును దయచేయునని తాత్పర్యము] లేక- హేఖరతర, ఖ=స్వరూపేంద్రియములచే, ర=క్రీడించెడి ముక్తులయొక్క, త=జ్ఞానమందు, ర=రమించువాఁడా! (అనఁగా సర్వదా ముక్తజ్ఞానవిషయుఁడని భావము) లేక- ఖర=ముక్తులకు, త=జ్ఞానము, అనఁగా స్వోత్తమత్వాది నిశ్చయజ్ఞానము, ర=దయచేయువాఁడా! లేక హేఖర, హేతర, అనివిడఁదియ్యవచ్చును ఖర, ఖ=గోళ్ళచే,ర=నాశముచేయువాఁడా! (నృసింహావతారమందు, హిరణ్యకశిపుని వక్షఃస్థలమును గోళ్ళచే చీల్చి సంహరించెనని భావము.) లేక- ఖ=గోళ్ళచే ర=క్రీడించువాఁడా! (అనఁగా ఒక్కొక ఇంద్రియముచే సకలేంద్రియ వ్యాపారములు చేయఁగలవాఁడని భావము) లేక- ఖ=పురములయందు (అనఁగా అయోధ్యా, మధురా, మాయాదిక్షేత్రములందును, గంగా, గయా, కురుక్షేత్రాదులందును) ర=క్రీడించువాఁడా! (అనఁగా విశేష సాన్నిధ్యముగలిగి యుండువాఁడని భావము) లేక- ఖ=చంద్రునియందు, ర=క్రీడించువాఁడా! (శ్లో॥ సేవేతురంగవదనం। చంద్రమండలసంస్థితం। చంద్రమండలమధ్యస్థం। విష్ణుమవ్యయమవ్యతం॥ అనువాక్యములు ప్రమాణము) లేక- ఖ=స్వరూపాత్మకమైన ఆకాశమందు, ర=క్రీడించువాఁడా! ("యద్యేష ఆకాశ ఆనందోనస్యాత్" శ్రుతి ప్రమాణము) హేతర, త=వ్యాప్తియందు, ర=క్రీడించువాఁడా! లేక- త=స్వరూపభూతజ్ఞానమందు, ర=క్రీడించువాఁడా! హేనిశిచర, నిశి=తమస్సునందును అంతర్యామిగా నున్నట్టియు, చర=గతియాతుఁడనఁగా జ్ఞానస్వరూపుఁడైనట్టియు, మహానుభావా! లేక- తమోరూపాభిన్నుఁడై, చర, చ=విమలమైన ధ్యేయమువస్తువనఁగా తనయందే, ర=రమించు వాఁడా! (అనఁగా స్వరమణుఁడని భావము.) హేదహన వరామృత, ద=దర్శనమనఁగా అపరోక్ష దర్శనమును, హ=సుఖమనఁగా మోక్షసుఖమును న=పొందించువాఁడవని, వ=చింతనమందు, ర=స్మృతిగలవారికనఁగా అనవతారరూపములుగలవని ధ్యానించెడు వారికి,అమృత=అమృతమువలె ఆనందకరుఁడా! హేరఘువరమానద, రఘు=రఘువనుమహారాజునకు, వ=జ్ఞానము, ర=ఆనందము ను గలుగఁజేసిన అవతార శ్రీరామమూర్తివలె, మానద=మోక్షమునుదయచేయువాఁడా! లేక-మా=లక్ష్మీదేవిస్వరూపమైన సీతాదేవిని, నద=సంతోషింపఁజేయువాఁడా, లేక రామమూర్తివలె లక్ష్మీదేవిని సంతోషింపఁజేయువాఁడా! ఇందువలన ప్రతి అనవతారమూర్తికిని, అనవతారలక్ష్మీరూపమున్నదని తాత్పర్యము. శ్లో॥ (రామాంతికేస్థితాదేవీ। వనుందైన్సమదృశ్యత। రూపాంతరేణకైలాసం। గతానిత్యావియోగినీ॥ అని ప్రమాణము) ఇట్టిమోహావతారరామాభిన్న అనవతారరామమూర్తీ, మమశరణం భవ=నాకురక్షకుఁడవుకమ్ము.శుభమేత్యాదిపూర్వమువలెనే.

తా॥ అత్యంత క్రూరస్వరూపులైన రావణాదిరాక్షసులను సంహరించిన శ్రీరామమూర్తితోనభిన్నమైన,యనవతార రామమూర్తి వైముక్తులకుస్వోత్తమత్వాదినిశ్చయజ్ఞా

యానందముఁ జేయుచు, శ్రేష్ఠుఁడవై, సురజనాదిదోషరహితుఁడవై, రఘువంటి రాజులకు జ్ఞానానందములను దయచేయువాఁడవై భగవద పరోక్షజ్ఞానముచే బొందఁగిన మోక్షము నొసఁగుచు నీవు నాకు రక్షకుఁడవగుము.

శ్లో॥ సులలితతనువర వరదమహాబల యదువరపార్థపభవమ
మశరణం శుభతమ ... రమణః ౧౨

అనవతార శ్రీకృష్ణమూర్తివారిని స్తుతించి ఆయనను రక్షకుఁడవగుమ్మని ప్రార్థించు చున్నారు.

అ॥ హే సులలితతనువర, సులలిత=అత్యంత సుందరతరమైన, తనువర=జ్ఞానానందాత్మకమైన శ్రేష్ఠ శరీరము గలట్టియు, వరద=అక్రూరాదిభక్తుల కభీష్టమునిచ్చినట్టియు, మహాబల=అప్రమేయ సామర్థ్యము గలట్టియు, యదువర=యదురాజునకు, వర=జ్ఞానానందాదులు దయచేసినట్టియు శ్రీకృష్ణావతారమూర్తిచే, పార్థప, పార్థ=పాండవులను, ప=పరిపాలన చేయించువాఁడా! అనఁగ తదభిన్నమైన అనవతార శ్రీకృష్ణమూర్తీ! లేక- యదువరప, యదువర=యాదవశ్రేష్ఠులను, ప=రక్షించెడి యాదవకృష్ణునివలె, అర్థప, అర్థ=మోక్షాఖ్యప్రయోజనమును, ప=రక్షించెడి అనవతార శ్రీకృష్ణమూర్తీ! లేక- హే సులలిత= అతిసుందరమైనవాఁడా! హే తనువర, తను=శరీరభూతమైన, వర=జ్ఞానానందములుగలవాఁడా! లేక- తను=వ్యాప్తపదార్థములలో, వర=శ్రేష్ఠమైనవాఁడా! అనఁగా సర్వవ్యాపియని భావము. లేక- సులలితతను=సుందరశరీరముగల మన్మథునికంటె, వర=శ్రేష్ఠమైనవాఁడా, (అనఁగా మన్మథునికంటె మిగుల సుందరమయినవాఁడనుట "సాక్షాన్మన్మథ మన్మథః" అను భాగవతవాక్యము ప్రమాణము) లేక- సులలితతను=సుందర దేహముగల లక్ష్మీదేవి, వర=భర్తయయినవాఁడా, లేక ఆమెకంటెను ఉత్కృష్టసౌందర్యము గలవాఁడా, లేక, సులలితను=రుక్మిణియు, సత్యభామయు, వీరికి, వర=భర్తయయినవాఁడా! లేక, సులలితతను=సుందరదేహములుగల పదునారువేల గోపికాస్త్రీలకు, వర=శ్రేష్ఠమయిన, వర=అభీష్టమును, ద=దయచేసినవాఁడా! లేక, సులలితతనువర= సుందరదేహముగల ముక్తులకు, వర=జ్ఞానానందములను, ద=కలుఁగఁజేసినవాఁడా! లేక, సులలితతను=ముక్తులలో, వర=శ్రేష్ఠుఁడైన బ్రహ్మకు, వరద=సమ్యగ్జ్ఞాన, వైరాగ్య, లింగ, మోచనములను దయచేసినవాఁడా, హే మహాబల, మహా=మహత్తత్త్వాభిమానియగు బ్రహ్మకు, బల=బలము దయచేయువాఁడా! లేక, మహా=ముక్తబ్రహ్మాదులకు, బల=బలప్రదుఁడా! లేక, సులలితతనువర వరదమహాబల, అనునది ఏకపదముగా తీసికొనవచ్చును. సులలితతనువర=ముక్తులకు, వరద=ముక్తబ్రహ్మకును, మహాబల=విశేషబలము దయచేయువాఁడా! హే యదువరపార్థప=అవతార కృష్ణాభిన్న అనవతారకృష్ణా! హే రామ=అవతార అనవతార కృష్ణాభిన్న అనవతారరామా! మమశరణంభవ= నాకురక్షకుఁడవగుమ్ము. శుభతమేత్యాది పూర్వమువలెనే.

తా॥ అక్రూరాదిభక్తులకు వరములనొసంగుచుం బాండవులను బరిపాలించు నవతారకృష్ణమూర్తితో నభిన్నుడగు ననవతారశ్రీకృష్ణమూర్తివై, సుందరుడవై, సర్వవ్యాపివై, వరప్రదాతవై, సర్వశక్తివై, యాదవుల పాండవులను మున్నుగావారికి రక్షకుడవగు నీవుమాకు రక్షకుడవుకమ్ము.

శ్లో॥ దితిసుతమోహన విమలవిబోధన పరగుణబుద్ధహే భవ మమశరణం శుభతమ.....రమణ॥ ౧౩

అనవతారబుద్ధమూర్తిని స్తుతించి ఆయన నురక్షకుడవుకమ్మని ప్రార్థించుచున్నారు.

అ॥ హేదితి...బుద్ధహే, దితిసుత=తమోయోగ్యులైన దైత్యులను, మోహన, మోహ=అజ్ఞానమును, న=పొందించునట్టియు, విమలవిబోధన, విమల=నిర్మలమైన, అనగా నిదుష్టముక్తియోగ్యులైన దేవాదులను, విబోధన, వి=విశేషమయిన, బోధ=జ్ఞానమును, న=పొందించునట్టియు, (జ్ఞానప్రదుడని భావము) అవతారబుద్ధమూర్తివలె, పరగుణబుద్ధ=శ్రేష్ఠజ్ఞానానందాదిగుణవిశిష్టుడైన అనవతారబుద్ధమూర్తియని, హే=ప్రసిద్ధిగలవాడా! అనగా అవతారబుద్ధరూపాభిన్న అనవతారబుద్ధమూర్తీ! దితిసుత, మోహన, విమలవిబోధన, పరగుణబుద్ధహే, అని నాలుగుపదములుగ విడదీయవచ్చును. అ॥ హే దితిసుత, దితి=ముక్తులకు, సుత=ఆనందజ్ఞానములను గలుగజేసినవాడా! లేక- దితి=ముక్తులయందు, సు=లెస్సగా, త=వ్యాపించినవాడా! (ముక్తాంతర్యామియని భావము) హే మోహన=మోహకుడైన అవతారబుద్ధాత్మకా! హే విమలవిబోధన, విమల=ముక్తియోగ్యులైనవారికి (ఈ అనవతారబుద్ధమూర్తి) వి=పరమాత్మయను, బోధన=జ్ఞానము కలుగజేయువాడా! హే పరగుణ బుద్ధహే, పర=లేనయందాక్తమైన, గుణ=జ్ఞానానందాది గుణములుగల, బుద్ధ=అనవతారబుద్ధమూర్తియని, హే=ప్రసిద్ధిగలవాడా, ఇట్టిబుద్ధావతారాభిన్న అనవతారబుద్ధమూర్తీ! హే భవ=అవతార, అనవతార బుద్ధరూపాభిన్న అనవతారరామా! మమశరణంభవ=నాకురక్షకుడవుకమ్ము. శుభతమేత్యాది పూర్వమువలెనే.

తా॥ తమోయోగ్యులగు దైత్యుల నజ్ఞానమునం బడవైచినట్టియు, నిర్మలమయిన జ్ఞానబోధను జేసినట్టియు, నవతారబుద్ధమూర్తితో నభిన్నుడవగు ననవతార బుద్ధమూర్తివయి, ముక్తులకు జ్ఞానానందములనిచ్చుచు, మోహకుడవయి, పవిత్రమయిన జ్ఞానమును దయచేయుచుండు జ్ఞానమూర్తివగు నీవు మాకు రక్షకుడవుకమ్ము.

శ్లో॥ కలిమలహుతవహ శుభగమహోత్సవ శరణదకల్కీశభ వ మమశరణంశుభతమ... ...రమణ॥ ౧౪

అనవతారకల్కిమూర్తిని స్తుతించుచు ఆయనను రక్షకుడవుకమ్మని ప్రార్థించుచున్నారు.

అ॥ హేకలిమల...కల్కీశ, కలిమల=కలిసంబంధమయిన దోషమును అనగా కలియుగ దోషావిష్టులైన దుర్మార్గులను, హుతవహ=అగ్నిహోత్రమువలె భస్మముచేయు

నట్టియు, శుభగ, శుభ=మోక్షమును, గ=పొందునట్టి ముక్తిరాజ్యులకు, మహోత్సవ= గొప్పసంతోషమును పుట్టించునట్టియు, (శుభగమహోత్సవ అనుపాఠమందు) శు=అనంతాత్మకమైన, భ=చక్రమును, గ=పొందినట్టియు అనఁగా స్వరూపాత్మక చక్రధరుఁడని భావము (యథైకాత్మ్యసుభావేన। వికల్పరహితస్స్వయం। భూషణాయుధలింగాఖ్యా। ధత్తేశక్తిస్స్వమాయయా॥ అని భాగవతమున షష్ఠస్కంధగత నారాయణ వర్మస్థవాక్యము ప్రమాణము) లేక, శుభగ=శోభన (భాగ్యవంతులయినవారికి) మహోత్సవ= విశేష ఉత్సవమును కలుగఁజేయునట్టియు, లేక, శుభగ, శుభ=శుభస్వరూపి యయిన భగవంతునిని, గ=పొందెడు ముక్తిరాజ్యులకు, మహోత్సవ=ఉత్సవపరంపరలను కలుగఁజేయునట్టియు, (మంగళానాంచమంగళం అను ప్రమాణము) ఇట్టి అవతార కల్కి మూర్తియై నలె, శరణద, శరణ= వైకుంఠాఖ్యమైన స్వకీయస్థానమును, ద=ముక్తులకు, దయచేయునట్టి,కల్కిన్=అనవతారకల్కిమూర్తీ, కల్కీశ అనుపాఠమందు,కల్కి=స్వామియు నియర్థము.కలిమలహుతవహ, శుభగమహోత్సవ, శరణద,కల్కీశ.అనునాల్గుపదములుగా విడదీయవచ్చును. హే కలిమలహుతవహ, కలిమల=కలివలె దూషణవాక్యములు, అనఁగా అనవతార కల్కిమూర్తి లేఁడని పల్కెడు దుర్మార్గులకు, హుతవహ=అగ్నిహోత్ర సమానుఁడా! హే శుభగమహోత్సవ, శుభ=శుభవాక్యమును అనఁగా అనవతార కల్కిమూర్తి కలఁడనువాక్యమును, గ=పొందిన అనఁగా దృఢముగ నమ్మిన వారికి, మహోత్సవ=విశేష ఉత్సవములను దయచేయువాఁడా! హే శరణద, శర=బాణస్వరూపి యయిన వాయుమూర్తికి, ణ=నివర్ణ్యుని అనఁగా మోక్షమును, ద=దయచేయువాఁడా! హే కల్కీశ, కల్కి=అవతారకల్కిమూర్తివలె, ఈశ=సర్వనియామకుఁడవయిన అనవతార కల్కిమూర్తీ! లేక- కల్కిన్ అనుపాఠమందు, కలి=కలివలన నుండి బాధ లేకుండఁగ, క=మంగళము దయచేయువాఁడా! లేక- కలి=కలివలననుండి, క=శమనము గలుగఁజేయువాఁడా! హే రామ, ఇట్టి అవతార అనవతార కల్క్యభిన్న అనవతారరామమూర్తీ! మమశరణంభవ=నాకు రక్షకుఁడవుకమ్ము. శుభతమేత్యాది పూర్వమువలెనే.

తా॥ కలిదోషనాశకుఁడగు నవతారకల్కిమూర్తితో నభిన్నుఁడగు ననవతారకల్కిమూర్తివయి సమస్తదోషాపహుఁడవయి శుభములను బొందింపఁజేయు వాఁడవయి విశేష ఉత్సవములను దయచేయు వాఁడవయి సర్వశరణ్యుఁడవగు నీవు మాకు రక్షకుఁడవుకమ్ము.

శ్లో॥ అఖిలజనివిలయపరసుఖ కారణపరపురుషోత్తమ భవమ
మశరణం శుభతమ ... రమణ॥ ౧౫

ఈశ్లోకమందు అవతార, అనవతార మూలరూపముల కల్పితమైన అత్యంతాభేదమును సూచనచేయుటకు అనవతారరామమూర్తిని జగజ్జన్మాది కర్తయు, సర్వోత్తముఁడు మూలరూపాభిన్నుఁడుగా నుతించి ఆతనను రక్షకుఁడవుకమ్మని ప్రార్థించుచున్నారు.

అ॥ హే అఖిల... పురుషోత్తమ, అఖిల=సమస్తమయిన పదార్థములయొక్క, జనివిలయ=సృష్టిసంహారములు, పరసుఖ=ఉత్తమసుఖమనఁగా మోక్షసుఖము, వీనికి, కారణ=కారణమైనట్టియు, పర=సర్వోత్తముఁడైనట్టియు, మూలరూపమైన నారాయణునివలె, పురుషోత్తమ=క్షరాక్షరములకంటె నుత్తముఁడా! (అతోస్మిలోకేవేదే చ ప్రథితః పురుషోత్తమః అను గీతావాక్యము ప్రమాణము,) హే రామ=అవతార రామాభిన్న మూలరూప నారాయణాభిన్న అనవతార రామా, మమశరణం భవ=నాకురక్షకుఁడవు కమ్ము, ఋతమేత్యాది పూర్వమువలెనే.

తా॥ సృష్టిసంహారకర్తవును, మోక్షకారణుఁడవును, సర్వశ్రేష్ఠుఁడవును, క్షరాక్షరములగు సమస్తవస్తువులకంటె నుత్తముఁడవును నగు మూలరూపాభిన్నుఁడవైన రామావతార శ్రీరామమూర్తీ! నాకురక్షకుఁడవు కమ్ము.

శ్లో॥ ఇతితవ స్తుతివరసతత రతేర్భవ సుశరణ మురుసుఖ తీర్థ సుమునేర్భగవన్॥ ౧౨

పైవిధమున భక్తిపూర్వకముగ శ్రీహరినిస్తుతించెడివారికి షోడశకళాత్మకమయిన లింగశరీరనివృత్తి కలుగునని యభిప్రాయముతో పది మూఁడు శ్లోకములచే స్తవము చేసి ఈయధ్యాయమును ముగిలచుచున్నారు.

అ॥ హే భగవన్=అవతార, అనవతారరూపములతో అభిన్నుఁడవయిన మూలరూపనారాయణమూర్తీ! ఇతి=పూర్వోక్తప్రకారముగ, తవ=నీయొక్క, స్తుతివర=స్తవరాజమందు, సతత=నిరంతరము, రతేః=ఆసక్తిగల, ఉరుసుఖతీర్థసుమునేః, ఉరు=ఉత్కృష్టుఁడయిన అనఁగా సర్వజీవోత్తముఁడయిన, సుఖతీర్థ=ఆనందతీర్థులను, సుమునేః=యోగ్యమునియయిన [నాకునీవు] సుశరణం=అనుకూలుఁడ వయిన రక్షకుఁడవు. భవ=అగుము. లేక – ఉరుసుఖతీర్థసుమునేః=ఉత్తములయిన ఆనందతీర్థమునిశ్రేష్ఠునివలన, ఇతి=సమాప్తినొందింపఁబడిన, తవనుతివర=నీయొక్క అనవతారరూప స్తవరాజమందు, సతతిరతేః=సర్వదా ఆసక్తిగలవారికి, నీవు సుశరణం=అనుకూలుఁడవయిన రక్షకుఁడవుకమ్ము.

తా॥ భగవానుఁడవగు నో మూలరూప నారాయణమూర్తీ! ఈరీతిని నీస్తవమునందాసక్తిగల ఆనందతీర్థ మునిశ్రేష్ఠులకు నీవు రక్షకుఁడవుకమ్ము.

ఇతి శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్య విరచితే
ద్వాదశస్తోత్రే నవమోధ్యాయస్సమాప్తః.
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీవేంకటరమణాయనమః.

## దశమాధ్యాయప్రారంభః.

ఈయధ్యాయమందు శ్రీహరియొక్క పవిత్రమగు చరిత్రమును తెలియఁగోరినయు ల్లరు శ్రీహరి సేవకోరవలయునని సూచించుచు స్తుతించుచున్నారు.

శ్లో॥ అవన శ్రీపతిరప్రతిరధికేశాది భవాదే కరుణాపూర్ణ వర ప్రద చరితం జ్ఞాపయమే తే॥ ౧

అ॥ హే అవన=రక్షకుఁడా! లేక, అ=బ్రహ్మరుద్రులకు, వ=విజ్ఞానమును, న=కలుగఁజేయువాఁడా! లేక- అ=బ్రహ్మరుద్రులయొక్క, వ=జ్ఞానముచే, న=పొందఁబడు వాఁడా! లేక- హే అ=అకారశబ్దవాచ్య పరమాత్మా! హే వన, వ=కాంతిని, న=పొందించువాఁడా! అనఁగా సౌందర్యదాతా! హే అధిక=సర్వోత్కృష్ట, ఈశాది భవాదే, ఈశ=రుద్రుఁడు, ఆది=మొదలు గాఁగల జగత్తునకు, భవ. ఆదే=కారణమయినవాఁడా! లేక- అధికేశాది భవాదే అని ఏకపదముగాఁ జెప్పవచ్చును. అధిక=శ్రేష్ఠులయినట్టియు ఈశ=సమర్థులయినట్టియు దేవతలు, ఆది=మొదలుగాఁ గలవారియొక్క, భవ=సంసారమునకు, ఆది=కారణమయినవాఁడా అనఁగా బంధకుఁడా! లేక- వారియొక్క, భవ=మంగళమునకు, ఆదే=కారణమయినవాఁడా! అనఁగా మోచకుఁడా! [శ్రీహరి బంధమోక్షప్రదుఁడని భావము] లేక- అధిక=అధికులయిన, ఈశాదిభవ, ఈశ=రుద్రుఁడు, ఆదిభవ=బ్రహ్మ, వీరికి, ఆదే=కారణమయినవాఁడా! కరుణాపూర్ణ వరప్రద, కరుణాపూర్ణ=విశేషదయాశాంతులయిన వారికి, వరప్రద=వరము లనిచ్చువాఁడా! లేక- కరుణాపూర్ణ=దయాసముద్రుఁడా! వరప్రద=అభీష్టములను దయచేయువాఁడా! అప్రతిః=సముఁడు గాని, ఎదురుకొనువాఁడుగాని, లేనట్టియు, శ్రీపతిః=లక్ష్మీరమణుఁడు నయినట్టియు (నీవు) తే=నీయొక్క, చరితం=చరిత్రమనఁగా మాహాత్మ్యమును, మే=నాకు, జ్ఞాపయ=బోధించుము. (నన్ను నీమాహాత్మ్య జ్ఞానిగాఁ జేయుమని భావము) శ్రీపతి...భవాదే, అనుచోట, శ్రీప, తిర, ప్రతిర, ధికేశాదిభవాదే, అని పదచ్ఛేదముచేయవచ్చును. హే శ్రీప, శ్రీ=లక్ష్మీదేవిని, లేక-లక్ష్మీదేవిచేత, ప=పరిపాలన చేయువాఁడా, లేక-చేయించువాఁడా, (విశ్వరక్షప్రదుఁడని భావము) హే తిర, తి=సమ్యగ్జ్ఞానము, పరతత్త్వనిర్ణయము గలవారుచేఁ గొను, ర=ధ్యానముగలవాఁడా! (అనఁగా వారిచే ధ్యానింపఁబడువాఁడని భావము) లేక, తి=సమ్యగ్జ్ఞానముగలవారికి, ర=సాధనమనఁగా మోక్షసాధనముకలుగఁజేయువాఁడా! లేక-తి=ఆనందముతో, ర=క్రీడించువాఁడా! లేక- తి=భగవదపరోక్షజ్ఞానులు, తత్త్వనిర్ణయవంతులునగువారిని, ర=సంతోషింపఁజేయు వాఁడా! లేక-వారికి, ర=సుఖముగలుగఁజేయువాఁడా! లేక-తి=(తా అనఁగా కరుణల ఁగలవారు) దయావంతులనఁగా సాత్త్వికులైనవారిచే, ర=ఆరాధనచేయఁబడువాఁడా! లేక వారికి, ర=ఆశ్రయమైనవాఁడా! హే ప్రతిర, ప్ర=విశేషమైన, తి=భగవత్తత్త్వవి

ర్గ్లయముగల బ్రహ్మాదులకు, ద=అభీష్టమును దయచేయువాడా ! లేక- ప్రతి=విశేషవి శిష్యజ్ఞానముగలవారికి, ర=ఉత్తమాంగ మనగా సర్వోత్తముఁడని తెలియఁబడిన వాఁడా ! లేక-జ్ఞానస్యుత్తముఁడా ! హే ధీశాదిభవాదే, ధి=(ధ=ధ్యానము, లేక- బ్రహ్మవిద్య, గలవారు) జ్ఞానులైన, కేశ, క=బ్రహ్మ, ఈశ=రుద్రుఁడు, అది=మొదలగు వారియొక్క, భవ=సంసారమును, అదే= (అదభక్షణె అనుధాతువును బట్టి) భక్షించువాఁడా ! అనఁగా సంసార [illegible]నము చేయువాఁడని భావము. క రుణా పూర్ణవర. ప్రద, అనుచోట, కరుణ, అపూర్ణ, లేక- అపూర్ణ, వర, ప్రద, అనినాలుగుపదములుగ విభజింపవచ్చును. హే కరుణ=దయగలవాఁడా! హే అపూర్ణ=అత్యంతపూర్ణుఁడా ! లేక- అ=బ్రహ్మరుద్రులకు, పూర్ణ=పూర్ణుఁడా ! ("పూర్ణ మసిపూర్ణంమే భూయాత్" అను శ్రుతిప్రమాణము) హే అపూర్ణ, అ=విశేషముగ, పూర్ణ=పూర్ణుఁడా ! ("పూర్ణ మదః పూర్ణ మిదం" అను శ్రుతిప్రమాణము) హే వర= సర్వోత్తముఁడా ! హే ప్రద, ప్ర=ప్రకృష్టమైన మోక్షమును, ద=దయచేయువాఁడా!

తా॥ రక్షకుఁడవును లక్ష్మీపతివిని, అత్యంతపూర్ణుఁడవును, సర్వశ్రేష్ఠుఁడవును, రుద్రబ్రహ్మాదులకు వరములనిచ్చువాఁడవును, దయాపరిపూర్ణుఁడవును, వరప్రదాతవునగు ఓ నారాయణమూర్తీ! నాకు సుజ్ఞానమును బోధింపుము.

శ్లో॥ సురవంద్యాధిప సద్వరభరితా శేష గుణాలంకరణా...

మే తే॥ ౨

అ॥ హే సురవంద్యాధిప, సుర=రుద్రాదులచే, వంద్య=స్తోత్రార్హుఁడైన బ్రహ్మయొక్క, అధిప=స్వామీ! లేక-సురవంద్య=దేవతలచే వందనీయుఁడా! అధిప= సర్వపరిపాలకుఁడా! లేక-సురవంద్య=లక్ష్మీదేవికి, అధిప=వల్లభుడా! హే సద్వర, సత్=ముక్తులకంటె, వర=శ్రేష్ఠుఁడా! లేక-సత్=సజ్జనులకు, వర=వరములనిచ్చువాఁడా, లేక-సత్=బ్రహ్మకు, వర=వరములనిచ్చువాఁడా, హే భరితాశేషగుణ, భరిత= పూర్ణములైన, అశేష=సమస్తమైన, గుణ=జ్ఞానానందాదిగుణములుగలవాఁడా, ఇట్టియో స్వామీ; మే=నాకు, తేచరితం=నీయొక్క మాహాత్మ్యమును, అలం=విశేషముగ అనఁగా యోగ్యతానుసారముగ, జ్ఞాపయ=బోధింపుము. అలం అనుపదము పూర్వోక్త సంబోధనలకు విశేషార్థద్యోతకమైన విశేషణముగానైన నన్వయించవచ్చును.

తా॥ దేవతలచే స్తుతింపఁబడెడువాఁడవును, భక్తాభీష్టములనొసఁగువాఁడవును, సర్వశ్రేష్ఠుఁడవును, జ్ఞానానందాది సద్గుణపరిపూర్ణుఁడవును, నగునోస్వామీ! నీయొక్క జ్ఞానమును యోగ్యతానుసారముగా నాకుబోధింపుము.

శ్లో॥ సకలధ్వాంతవినాశకపరమానంద సుధాహోకరుణా...

మే తే॥ ౩

అ॥ హే సకలధ్వాంతవినాశక, సకల=కళలనఁగా గుణములతోఁ గూడుకొనిన సజ్జనులయొక్క, ధ్వాంత=చీకటివంటి అజ్ఞానమును, వినాశక=పోఁగొట్టువాఁడా! క

క- సకల=బాహ్యమైనట్టియు, అంతరంగికమైనట్టియు, ధ్వాంత=అంధకారమును, వి
నాశక=పోఁగొట్టువాఁడా! లేక- హేసకల=గుణపూర్ణా! లేక- స=శ్రేష్ఠుఁడైనఅన
గా సర్వజీవోత్తముఁడైన, క=బ్రహ్మను, ల=(మహాప్రళయమందు ఉదరములో) గ్ర
హించువాఁడా! లేక- స=శ్రేష్ఠమైన, క=మంగళమనఁగా శుభకర్మలయందు, ల=గ్ర
హింపఁబడువాఁడా, (సమస్త శుభకర్మలను విష్ణువునుద్దేశించి చేయఁబడునని తాత్పర్యము)
లేక- సక=సర్వజీవోత్తముఁడైన వాయుమూర్తిచే, ల=గ్రహింపఁబడువాఁడా! (వా
యువాహనుఁడని భావము) హే ధ్వాంతవినాశక, ధ్వాంత=చీకటివంటి అజ్ఞానమును,
వినాశక=పోఁగొట్టువాఁడా! లేక- ధ్వాంత=చీకటివలె నల్లనైన,వి=పక్షిని అనఁగా కా
కాసురుని, నాశక=నాశము చేయువాఁడా! హేపరమానందసుధ, పరమానంద=
అలవుకానందమును, సు=అనుకూలముగ, ధ=ధరించిన వాఁడా! (అనఁగా
ఆనందాధారుఁడని భావము.) లేక పరమ=ముక్తుల కొఱకు, ఆనంద=మోక్షా
నందమును, సు=అనుకూలముగ అనఁగా యథా యోగ్యముగ, ధ=ధరించిన
వాఁడా! దయఁజేయు వాఁడని తాత్పర్యము) లేక, పరమానంద, పరమ=ఉ
త్తములయిన దేవాదులయొక్క, ఆనంద=ఆనందమునకు కారణమైన, సుధ=అమృతము
నొసఁగినవాఁడా! లేక, పరమానంద=మోక్షమును, సుధ=అమృతమును దయ చేయు
వాఁడా! సుద=అనుపాతమందు, సు=లెస్సగ, ద=దయచేయువాఁడా! సకలధ్వాంత
వినాశకమైన పరమానందముగలవాఁడా! లేక, పరమానందముదయచేయువాఁడా! అ
దసకలధ్వాంతవినాశక శబ్దము విశేషణముగానైన తీసికొనవచ్చును. అప్పుడు సుధ, అను
నది ప్రత్యేకసంబోధనమగుచున్నది. హేసుధ, సు=ఆనందమును, ధ=ధరించినవాఁడా?
లేక, సకలధ్వాంతవినాశక పరమానందసుధ అనునదంతయు ఏకపదముగా తీసికొనవచ్చు
ను. అ॥ సకలధ్వాంతవినాశకమయిన పరమానందామృతమును దయచేయువాఁడా! అ
హో=ఆశ్చర్యము, లేక, చరితపదమునకు విశేషణముగా తీసికొనవచ్చును. ఆశ్చర్యక
కరమయిన మాహాత్మ్యమని అర్థము. కరుణా...

తా॥ బాహ్యాంతరాత్మకములగు సమస్తాజ్ఞానములను హరింపఁజేయుచు మో
క్షానందమును దయచేయు. కరుణాపూరితుఁడవగునీవు నీయొక్క యోగ్యమయినజ్ఞాన
మును నాకుఁదగినట్లుపదేశింపుము.

శ్లో॥ త్రిజగత్పోత సదార్చిత చరణా శాపతిధాతో కరు
ణా...మే॥ ౨

అ॥ హేత్రిజగత్పోత, త్రిజగత్=సంసార సముద్రమందున్న మూఁడులోకములు
వారిని, పోత=నావవలె, తరణ=సాధనమయినవాఁడా! లేక- త్రిజగత్=మూఁడు
లోకములును, పోత=శిశువులవలె రక్షణీయములుగాఁగలవాఁడా! హేసదార్చితచరణ,
సత్=సజ్జనులచే, లేక- బ్రహ్మచే, అ=లెస్సగా, అర్చిత=పూజింపఁబడిన, చరణ=పా
దపద్మములుగలవాఁడా! లేక- శ్రేష్ఠుఁడైన అనఁగా సర్వజీవోత్తముఁడైన వాయుమూర్తి

యము, బ్రహ్మయు, ధా=పుత్రులుగాఁగలిగిన లక్ష్మీదేవిచే, అర్చితచరణ=పూజింపఁబడిన పాదపద్మములుగలవాఁడా! హేఆశాపతిధాతః, ఆశా=భారతీదేవియొక్క, పతి=భర్తయగువాయుమూర్తికి, ధాతః=ధారణపోషణకర్తా! లేక- ఆశాపతి=దిక్పతులకు, ధాతః=ధారణపోషణములు చేయువాఁడా! త్రిజగత్ప్రోత అనుపదము, త్రిజగత్ప, ఉత, అనివిడదీయవచ్చును. హేత్రిజగత్ప, త్రిజగత్=మూఁడులోకములను, ప=పాలించువాఁడా! హేఉత, ఉ=ఉత్కృష్టమయిన, త=దయగలవాఁడా! (దయాసముద్రుఁడని భావము) లేక- ఉ=శివునియందు, త=దయగలవాఁడా! లేక- ఉ=రుద్రునికి, త=నిశ్చయమనఁగా స్వస్వరూపనిశ్చయము, లేక-జ్ఞానముగలుగఁజేయువాఁడా! లేక- హేత్రిజగత్ప్రోత సదార్చితచరణ, అని ఏకపదముగా తీసికొనవచ్చును. త్రిజగత్ప=మూఁడులోకములను పరిపాలనచేసెడి, ఉత=ఉత్కృష్టజ్ఞానముగల బ్రహ్మయు, స=శ్రేష్ఠుఁడయిన వాయుమూర్తియు, దా=వారిభార్యలయిన సరస్వతీభారతులు, వీరందఱి చేతను, అర్చిత=పూజింపఁబడిన, చరణ=పాదములుగలవాఁడా! లేక త్రిజగత్ప్రోతసదార్చిత చరణాశాపతిధాతః, అని యేకపదముగాఁ దీసికొనవచ్చును. త్రిజగత్ప్రోత=మూఁడు లోకములవారికిని, సంసారసముద్రమును దాటుటకు నావవంటివాఁడయిన, సత్=సజ్జనులచే, ఆ=విశేషముగా, అర్చిత=పూజింపఁబడిన, చరణ=చరణములుగల, ఆశాపతి=దిక్పతులకు, ధాతః=ధారణపోషణములు చేయువాఁడా! కరుణాపూర్ణ వరప్రదేత్యాది పూర్వమువలెనే.

తా॥ మూఁడులోకములవారిని సంసారసాగరమునుండి దాఁటింపఁజాలు నావవయి సజ్జనులచే విశేషముగా నుతింపఁబడు పాదపద్మములు గలవాఁడవయి దిక్పాలురకు సహితము ధారణపోషణములు చేయువాఁడా! కరుణా... [మునుపటివలెనే]

శ్లో॥ త్రిగుణాతీతవిధారక పరితో దేహి సుభక్తిం॥ క... మే తే॥ ౫

అ॥ హేత్రిగుణాతీతవిధారక, త్రిగుణాతీత=గుణత్రయరహితులయిన ముక్తులకు విధారక, వి=విశేషమైన, ధారక=ఆశ్రయుఁడా! లేక, హేత్రిగుణాతీత= సత్వరజస్తమోగుణములు ఎప్పుడునులేనివాఁడా! హేవిధారక, వి=విశేషముగా అనఁగా స్వతంత్రముగా, ధారక=సమస్తమయినవానికిని ఆధారుఁడా? లేక, గరుడమూర్తిని ధరించువాఁడా! (గరుడవాహనుఁడని భావము) లేక, వి=పక్షి (గరుడమూర్తి) ధారక=వాహనముగాఁగలవాఁడా! (గరుడమూర్తికి తన్ను ధరించఁగల శక్తినిచ్చువాఁడని తాత్పర్యము) పరితః=సర్వదేశములయందుసర్వదా, సుభక్తిం, సు=మంగళరూపమయిన, భక్తిం=అవిచ్ఛిన్న నిర్దోషస్నేహమనఁగా మాహాత్మ్యజ్ఞానపూర్వకదృఢస్నేహమును, దేహి=దయచేయుము. కరుణేత్యాదిపూర్వమువలెనే.

తా॥ సత్వరజస్తమోగుణములు లేనివాఁడవయి లోకాధారుఁడవయినయోస్వామీ! ఎల్లప్పుడును నాకు అవిచ్ఛిన్నమయిన భక్తిని దయచేయుము.

శ్లో॥ శరణంకారణభావనభవ మే తాత సదాలం॥ క... మే తే॥ ౬

అ॥ హే కారణ=జగత్కారణ, హే భావన, భావ=ఉత్పత్తిని, న=పొందించువాఁడా! అనఁగా సమస్తమును సృష్టించువాఁడా! లేక- జగత్తును పరిపాలన చేయువాఁడా! లేక- భా=కాంతిచే, అనఁగా సూర్యాది స్థితమైన తనకాంతిచే, అవ న=రక్షించువాఁడా, లేక, భా=కాంతిగల సూర్యాదులకు, అవ=రక్షణమును, న=పొందింప జేయువాఁడా! (యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఖిలం...అను గీతావచనము ప్రమాణము) లేక- కారణభావన, అని ఏకపదముగా తీసికొనవచ్చును. కారణ=మహదాదికారణములను, భావన=జగత్సర్జనమందు సమర్థములుగా చేయువాఁడా! హే తాత=తండ్రీ, లేక- త=దయచే, అత=జగద్రక్షణము కొఱకు, సంతతగమనముగలవాఁడా! లేక- త=వ్యాప్తిగలట్టియు, అత=సంతత గమనముగలట్టియు శ్రీమహావిష్ణో! ఇట్టినీవు, మే=నాకు, సదా=ఎల్లప్పుడును, అలం=అతిశయముగా, శరణం=రక్షకుఁడవు, భవ=అగుము, సదాలం అనుచోట సద+అలం అని పదవిభాగముచేసి సద అనున దిసంబోధనగా చెప్పవచ్చును. హే సద, స=సర్వజీవోత్తముఁడైన బ్రహ్మ, ద=పుత్రుఁడుగాఁగలవాఁడా? కరుణాపూర్ణేత్యాది పూర్వమునలెనే.

తా॥ జగత్కారణుఁడవును, సృష్టికర్తవునైనయోతండ్రీ! మాకు ఎప్పుడును విశేషముగా రక్షకుఁడవు కమ్ము.

శ్లో॥ మరణప్రాణదపాలకజగదీశావసుభక్తిం।కరు...మే తే॥ 2

అ॥ హే మరణప్రాణద, మరణ=మరణమును, ప్రాణ=జీవనమును, ద=దయచేయువాఁడా! హే పాలక=ఓరక్షకుఁడా! మరణప్రాణదపాలక, అని ఏకపదముగ తీసికొనవచ్చును, మరణ=[ఎల్లరకును] మరణమును, ప్రాణ=చేష్టాదివ్యాపారములను, ద=కలుగఁజేయువాయుమూర్తికి, పాలక=రక్షకుఁడా! ("అనావృత్తి దేహినాం దేహపాతే" అనువాక్యము ప్రమాణము) మరణ, ప్రాణద, పాలక, అని మూఁడుపదములుగా విడతీయవచ్చును, హే మరణ, మ=బ్రహ్మ ర=శివుఁడు, వీరికి, ణ=మోక్షమునొసఁగఁజేయువాఁడా! హే ప్రాణద, ప్రాణ=వాయుమూర్తి, ద=పుత్రుఁడుగాఁగలవాఁడా! హే పాలక, పా=అమృతమును, ల=గ్రహించిన అనఁగా ధరించిన పాలసముద్రమునకు, క=సుఖప్రదుఁడా! (అనఁగా క్షీరాబ్ధిపుత్రియైనలక్ష్మీదేవియందతిప్రేమగలవాఁడు గనుక క్షీరసముద్రమునకానందకరుఁ డని భావము) హే జగదీశ=లోకవాధా! శుభక్తిం=(నీవిషయకమైన) రూఢమైన భక్తిని, అవ=రక్షింపుము (అనఁగా విఘ్నములు రాకుండ చేసి ప్రతిబంధకములైనపాపములను కొట్టి నీపాదముల భక్తినివృద్ధిచేయుమని తాత్పర్యము.) కరుణాపూర్ణేత్యాదిపూర్వమునలె.

తా॥ ప్రాణమునకు అధిపతివైన, జగద్రక్షకుఁడవైనయోస్వామీ! మాకు నీయందు రూఢమగు భక్తి అభివృద్ధియగునట్లు చేయుము.

శ్లో॥ తరుణాదిత్యసవర్ణాకచరణాబ్జామలకీర్తే। కరు ... ... మే తే॥

ఈశ్లోకములయందు అధ్యాయాంతమువఱకును శ్రీహరియొక్క పాదములు, గోళ్ళు, పిక్కలు, తొడలు, కటిప్రదేశము, పీతాంబరము, నాభి, కుక్షి, వక్షస్సు, బాహువులు, వదనము, దృష్టి, వీనిని క్రమముగ వర్ణించుచు స్తుతించుచున్నారు.

అ॥ హేతరుణాదిత్య...బ్జ, తరుణాదిత్య=బాలసూర్యునితో, సవర్ణ=సమాన కాంతిగలట్టియు, క=మంగళస్వరూపమయినట్టియు, చరణాబ్జ=పాదపద్మములుగలవాఁడా, లేక- చరణ=చరణములయందు, అబ్జ=బ్రహ్మగలవాఁడా! [శ్రీహరి పాదములు బ్రహ్మచేసదా సేవింపఁబడునని తాత్పర్యము] హే అమలకీర్తే = స్వచ్ఛమయిన కీర్తిగలవాఁడా! లేక- అ= విష్ణువిషయకమయిన, మ = జ్ఞానముగల బ్రహ్మాదులచే, ల = గ్రహింపఁబడునట్టి, కీర్తే = కీర్తిగలవాఁడా! తరుణాదిత్య సవర్ణకచరణ,అబ్జామలకీర్తే,అనిపదవిభాగముచేయవచ్చును, హేతరుణా...చరణ = బాలసూర్యునికాంతివంటికాంతిగల చరణములుగలవాఁడా! హే అబ్జామలకీర్తే అబ్జ = చంద్రునివలె, లేక, కమలమువలె అమల = నిర్మలమయిన, కీర్తే = కీర్తిగలవాఁడా! లేక- అబ్జా = లక్ష్మీదేవికి, కీర్తే=కీర్తిప్రదుఁడా! కరుణేత్యాది పూర్వమువలెనే.

తా॥ బాలసూర్యునితో సమానమగు కాంతిగల పాదపద్మములతో నొప్పు నోస్వచ్ఛకీర్తీ! మాకు...కమ్ము.

శ్లో॥ సలిలప్రోత్థసరాగకమణివర్ణోచ్చనఖాదే। క... తే॥౯॥

అ॥ హేసలిల...ఖాదే, సలిలప్రోత్థ=పద్మముతో, స=సమానమైన, రాగక=కాంతిగల, మణివర్ణ=మణులవలె అనఁగాపద్మరాగ మాణిక్యములవలె ప్రకాశించెడు, ఉచ్చ = ఉత్కృష్టమైన అనఁగా చిదానందరూపమైన, నఖాదే = గోళ్ళు, వ్రేళ్ళుమొదలగునవిగలవాఁడా! లేక- హేసలిలప్రోత్థసరాగక, అనివిడతీయవచ్చును. అ॥ పద్మముతో సమానమైన కాంతిగలవాఁడా! (వాసుదేవాది రూపములయందు కమలకాంతిగలదని ప్రసిద్ధము) లేక- సలిలప్రోత్థ=పద్మములయందు, సరాగ=స్నేహముగల సూర్యునికి, లేక- బ్రహ్మకు, (తనకుత్పత్తిస్థానమగుటవలన బ్రహ్మకు పద్మము ఇష్టమైన పదార్థమైయున్నది.) క=సుఖముకలుగఁజేయువాఁడా! హేసలిలప్రోత్థ=(ఉదకమందవతరించిన) మత్స్య, కూర్మ, రూపములను ధరించినవాఁడా! హేసరాగక, సరాగ=స్నేహముగల అనఁగా భక్తిభావముగలవారికి, క=భద్రమును దయచేయువాఁడా! హేమణివర్ణోచ్చనఖాద, మణివర్ణ=పద్మరాగమణికాంతులుగలిగి. ఉచ్చ=ఉత్కృష్టమైన, నఖాదే, నఖాగ్రములుగలవాఁడా! లేక- మణివర్ణోచ్చనఖ, ఆదే, అనివిడతీయవచ్చును. హేమణివర్ణోచ్చనఖ=పద్మరాగమణికాంతులుగల నఖములుగలవాఁడా! హేఆదే=సర్వమునకు, కారణమైనవాఁడా! కరుణేత్యాది పూర్వమువలెనే

తా॥ పద్మముతో సమానమగు కాంతిగలిగి పద్మరాగ మాణిక్యములవలెఁ ప్రకాశించు గోళ్ళు మొదలగువానిచేఁ గలకరుణా.

శ్లో॥ కజతూణీనిభపావనవరజంఘామితశక్తే। క... తే॥ ౧౦

అ॥ హే కజ...జంఘ, కజ=పద్మములతోను, తూణీ=అంబులపొదివలె క్రమవర్తులాకారములతోను, నిభ=సమానమయినట్టియు (అనఁగా పద్మములవలె కాంతియుక్తము లయి క్రమవర్తులములుగ నున్నవని భావము) పావన=పవిత్రకరములయినట్టియు, వర=శ్రేష్ఠములయినట్టియు, జంఘ=పిక్కలుగలవాఁడా! హే కజ, అని చెప్పవచ్చును. క=బ్రహ్మవాయువులచేతను, జ=ప్రాదుర్భవించినవాఁడా! (అనఁగా లోకగురువులయిన బ్రహ్మవాయువులచే శిష్యప్రశిష్యుల నుపదేశముఖమున ఇట్టివాఁడని తెలియఁజేయఁబడు వాఁడని భావము. "వ్యక్తశ్చ త్వ హరేర్జజన్మ" అను వాక్యము ప్రమాణము) లేక- హే కజ, క=బ్రహ్మకును, వాయుమూర్తికిని, జ=విజయమును కలుగఁజేయువాఁడా! ఖజతూణీనిభ- అనుపాఠమందు, ఖజమనఁగా ఆకాశమందు పుట్టెడు ఇంద్రధనుస్సు. దానితో సమానమైన జంఘలుగలవాఁడని అర్థము. లేక- హే ఖజ. అని విడదీయవచ్చును. ఖ=కురుక్షేత్రాది పుణ్యక్షేత్రములందును, అయోధ్యాది పుణ్యపురములందును, జ=ఆవిర్భవించినవాఁడా! (అనఁగా విశేషసాన్నిధ్యముగలవాఁడని భావము) లేక- ఖ=స్వర్గమందు, జ=ఆవిర్భవించినవాఁడా! లేక- ఖ=గానమనఁగా- సామగానముచే, జ=ఆవిర్భవించువాఁడా! (సాన్నిధ్యమును దయచేయువాఁడని భావము) లేక- ఖ=నిశ్చయముచే అనఁగా మననరూపమైన నిశ్చయజ్ఞానముచే, జ=ఆవిర్భవించువాఁడా! లేక- ఖ=పక్షియైన గరుడమూర్తికి, జ=విజయమును, సర్వత్ర వేగరూపమైన గమనమును దయచేయువాఁడా! లేక- ఖ=విఘ్నేశ్వరునికి, జ=జయమనఁగా సర్వవిఘ్నపరిహారకరూపశక్తిని దయచేసినవాఁడా! లేక- ఖ=ఆకాశమునకున్న వ్యాప్తివంటి, జ=వ్యాప్తి గలవాఁడా! హే అమిత శక్తే=అపరిమితమైన శక్తిగలవాఁడా! లేక- అ=అకారవాచ్యుఁడైన తనచేతనే, మిత=తెలియఁబడిన, శక్తే=శక్తిగలవాఁడా! (ఆయనయొక్క శక్తి ఆయనకే గాని ఇతరులకుఁ దెలియదని భావము) లేక- అ=బ్రహ్మరుద్రులచే, మిత=యోగ్యతానుసారముగ ఇతరులకంటె యెక్కువగా తెలియఁబడిన, శక్తే=శక్తిగలవాఁడా! లేక- అ=బ్రహ్మచే, మిత=తెలియఁబడిన, శక్తే=శక్తినావక స్త్రీరూపమును, అట్టి అనేక స్త్రీరూపములును గలవాఁడా! కరుణేత్యాది పూర్వమువలెనే.

తా॥ పద్మములోను తూణీరములోను సమానమగు వర్తులములై పవిత్రములైన పిక్కలుగల ఓ అపరిమితశక్తి సంపన్నుఁడా! కరుణా...కమ్ము.

శ్లో॥ ఇభహస్తప్రభశోభన పరమోరుస్థల మాళే। కరు ... తే॥

అ॥ హే ఇభ...మాళే, ఇభహస్త=ఏనుఁగ తొండముయొక్క, ప్రభ=కాంతివంటి కాంతిగలట్టియు, శోభన=సుందరములయినట్టియు, పరమ=ఉత్కృష్టములయిన, ఊరుస్థల=తొడలపైని, మా=లక్ష్మీదేవి, అళే=తుమ్మెదగాఁ గలవాఁడా! (లోకమందు తుమ్మెద గజమదమును వాసించి ఏనుఁగు తుండముయొక్క పైభాగము సర్వదా యాశ్రయించును. అలాగుననే లక్ష్మీదేవియు శ్రీహరియొక్క లావణ్యాతిశయాపేక్షచే ఆయన ఊరుస్థలము నాశ్రయించి ఎల్లప్పుడుండునని భావము) ఊరుస్థలమాళే, అనుపాఠమందు, ఊరు

స్థ=తొడలైనన్ను, రమా=లక్ష్మీదేవి, అళే=తుమ్మెదగాఁ గలవాఁడా! ఇభహస్తప్రభ శోభన పరమోరుస్థల, మాళె, అని విడఁదీయ వచ్చును. ఇభ...స్థల=ఏనుఁగు తొండము యొక్క కాంతివంటి కాంతిగలట్టియు, సుందరమయినట్టియు, ఉత్కృష్టమయిన ఊరు ప్రదేశము గలవాఁడా! హేమాళె, మా=లక్ష్మీదేవి, అళే=సఖురాలుగాఁ గల వాఁడా! (లక్ష్మీసహాయుఁడనిభావము) కరుణేత్యాది పూర్వమువలెనే.

తా॥ మదపుటేనుఁగు తొండమువంటి సుందరములయిన తొడలపై లక్ష్మీదేవియను భృంగమును ధరించినవాఁడా! కరుణా...కమ్మ.

శ్లో॥ అసనోత్ఫుల్ల సుపుష్పక సమవర్ణా వరణాంతే!
క... తే॥ ౧౨

అ॥ హేఅసనో...ణాంతే, అంతే = సమీపమునందు, లేక-అంతిమభాగమునందు, అసనో...వర్ణ,అసన = సజకవృక్షముయొక్క, ఉత్ఫుల్ల వికసించిన, సుపుష్పక = శోభాయుక్తమైనపుష్పములతో, సమ = సమమైన, వర్ణ = కాంతిగల. ఆవరణ = ఉత్తరీయముగలవాఁడా! లేక- అసనోత్ఫుల్లసుపుష్పకసమవర్ణ=వికసితాసనవృక్షపుష్పసమాన కాంతిగల, ఆవరణాంత=అతిమనోహరమైన ఉత్తరీయముగలవాఁడా! హేఏ=ఓవిష్ణుమూర్తీ! (వి॥ ఏకారః కథ్యతేవిష్ణౌ ... అనిఏకాక్షరరత్నమాల) లేక-అసనోత్ఫుల్లసుపుష్పకసమవర్ణ=వికసితాసనవృక్షపుష్ప సమానకాంతిగల, ఆవరణాంతే. అంతి=అత్యభాగమనఁగా అంచుగల, ఆవరణ=ఉత్తరీయముగలవాఁడా! (ఆవరణాంతిః, అని ఇకారాంతపుంలింగశబ్దము. అందులసంబోధన ఆవరణాంతె అనివీర్పడును"యదంతిరుచ్చదూరక"అనిశ్రుతిప్రమాణము. అంతి అనివాడుకలేకపోయినను ఛాందసప్రయోగమనుసరించి ప్రయోగించిరని తెలిసికొనవలెను) లేక- హేఅంతే అనివిడదీయవచ్చును. అంతిమగతిస్థానమైనవాఁడా! ("సాకాష్ఠాసాపరాగతిః" అనిశ్రుతిప్రమాణము.) లేక-అంతే అనిచెప్పవచ్చును. అ॥ అంతి అనఁగాసమీపము అందుండువాఁడు అంతిః, హేఅంతే=హృదయకమలవాసా, కరుణేత్యాదిపూర్వమువలెనే.

తా॥ సర్జపుష్పమురీతి సుందరమైన యుత్తరీయమును ధరించిన కరుణా.

శ్లో॥ శతమోదోద్భవ సుందరవరపద్మోత్థితనాభే। క...తే॥

అ॥ హేశత.....నాభే, శతమోద=శతానందుఁడైన బ్రహ్మయొక్క, ఉద్భవ = ఉత్పత్తిస్థానమైన, సుందరవర = అత్యంతసుందరమైన పద్మ = చతుర్దశభువనాత్మకమైన పద్మము, ఉత్థిత = ఏనాభియందు బయలుదేరినదో అట్టి, నాభే = బొడ్డుగలవాఁడా! (బ్రహ్మశ్రీ హరియొక్క నాభికమలమందు దయించినసంగతి ప్రసిద్ధమే.) కరుణేత్యాది పూర్వమువలెనె.

తా॥ శతానందుఁడగు బ్రహ్మకు ఉత్పత్తిస్థానమైన నాభికమలముగల కరుణా తే॥

శ్లో॥ జగదాగూహక పల్లవసమహస్తే శరణాదె క...తే॥ ౧౪

అ॥ హేజగదా...కుక్షే. జగత్=జగత్తును, ఆపూరిత=ప్రళయమందాచ్ఛాదన చేయునట్టియు, పల్లవసమ=చిగుళ్ళతో సమానమైన, అనగా- అత్యంతమృదువైన, కుక్షే=ఉదరముగలవాడా! హేశరణాదే, శరణ=లోకాశ్రయములైన శేషాదులకు ఆదే=కారణభూతుడా! సర్వరక్షకుడని భావము. కరుణేత్యాది పూర్వమువలెనే.

తా॥ ప్రళయకాలమునందు జగత్తునంతను గప్పిపుచ్చు మృదుతరమైన యద్భుత కుక్షిగలవాడవై, లోకాశ్రయములైన శేషాదులకు ఆదికారణుడవై కరుణా...తే॥

శ్లో॥ జగదంబామలసుందర గృహవక్షోవరయోగిన్। క...తే॥

అ॥ హేజగదంబామల...వక్షః, జగదంబా=లక్ష్మీదేవియొక్క, అమల=నిర్దోషమై, సుందర=సుందరమైన, గృహ=నివాసస్థానమైన, వక్షః=వక్షస్స్థలముగలవాడా! వరయోగిన్, వర=ఉత్కృష్టమయిన, యోగిన్=ధ్యానముగలవాడా! (లోకరక్షకొఱకును, సుజనవీక్షణముకొఱకును, యోగయుక్తుడైయుండునని భావము. "బ్రాహ్మేముహూర్తే ఉత్థాయ। వార్యుపస్పృశ్య మాధవః। దధ్యౌ ప్రసన్నకరణ। ఆత్మానంతమసఃపరం॥ అనువాక్యము ప్రమాణము) జగ...వక్షోవర, యోగిన్, అనిపదచ్ఛేదము చేయనచ్చును. హేజగ...వర=లక్ష్మీనివాసస్థానమయిన నిర్దోషసుందరశ్రేష్ఠవక్షస్స్థలముగలవాడా! హేయోగిన్=యమనియమాద్యష్టాంగయోగములుగలవాడా! కరుణేత్యాదిపూర్వమువలెనే.

తా॥ లోకమాతయగులక్ష్మీదేవిని వక్షస్స్థలమందుంచిన యోగిశ్రేష్ఠుడా! కరుణా.

శ్లో॥ దితిజాంతప్రదచక్రదర గదాయుగ్వరబాహో। క...తే॥

అ॥ హేదితి...బాహో, దితిజ=దైత్యులకు, అంత=నాశమును, ప్రద=కలుగజేయునట్టి, చక్రదరగదా, చక్ర=చక్రము, దర=శంఖము, గదా=గద, అ=భూషణమునగా పద్మము. (వీనితో) యుక్=కూడికొనిన, వరబాహో=శ్రేష్ఠమయిన బాహువులుగలవాడా! కరుణేత్యాదిపూర్వమువలెనె.

తా॥ దైత్యభీకరములగు గదా శంఖచక్రాదులను ధరించిన మహాబాహుడవై కరుణా...తె॥

శ్లో॥ పరమజ్ఞానమహానిధి వదనశ్రీరమణేందో। క...తే॥ ౧౭

అ॥ హేపరమ...దో, పరమజ్ఞాన=ఉత్తమజ్ఞానమునకు, మహానిధి=ముఖ్యస్థానమయిన, వదనశ్రీ=ముఖశోభచేనొప్పెడు, రమణేందో=పూర్ణచంద్రుడా! (పూర్ణచంద్రప్రకాశమువంటి జ్ఞానోపదేశము చేయునదగుటవలన శ్రీహరివదనము పూర్ణచంద్రసమానమని వర్ణింపబడినది-) కరుణేత్యాది పూర్వమువలెనే.

తా॥ జ్ఞానమునకు స్థానభూతమయిన వదనము చంద్రకాంతుల నిచ్చుచుండగా వెలసిల్లుకరుణా...తే॥

శ్లో॥ నిఖిలాఘౌఘవినాశక పరసౌఖ్యప్రద దృష్టే। క...తే॥

అ॥ హేనిఖిలా...వినాశక, నిఖిల=సమస్తములైన, అఘ=పాపములయొక్క, ఓఘ=సమూహములను, (రాసులను) వినాశక=స్మరణమాత్రముచేత నశింపఁజేయువాఁడా! హేపరసౌఖ్యప్రదదృష్టే, పర=ఉత్తమమయిన సౌఖ్య=మోక్షసుఖమును, ప్రద=కలుగఁజేయునట్టి, దృష్టే=అపరోక్షదర్శనముగలవాఁడా! లేక, నిఖిలాఘౌఘవినాశకమైనట్టియు, పరసౌఖ్యప్రదమయినట్టియు, దృష్టిగలవాఁడా! (శ్రీహరియొక్క అపరోక్షదర్శనము, సర్వారిష్టనివారకమును, సర్వాభీష్టప్రదమును, అనిభావము.) కరుణాపూర్ణవరప్రదచరితం జ్ఞాపయమేతే, కరుణాపూర్ణ=దయాసముద్రుఁడా! వరప్రద=అభీష్టములను దయచేయువాఁడా! తే=నీయొక్క, చరితం=మహాత్మ్యమును, మే=నాకొఱకు, జ్ఞాపయ=బోధింపుము.

తా॥ పాపసంఘములను బోఁగొట్టి పరసౌఖ్యము నిచ్చునోస్వామీ! దయాసముద్రుఁడా! అభీష్టప్రదుఁడా! నాకునీయొక్క మహాత్మ్యమును బోధింపుము.

శ్లో॥ పరమానందసుతీర్థసుమునిరాజో హరిగాథాం । కృతవాన్నిత్యసుపూర్ణకపరమానందపదైషీ॥ ౧౯

ఈస్తోత్రమును భక్తిపూర్వకముగ పఠించెడువారలకు పదునెనిమిది జాతులలోను జన్మరాహిత్యమని సూచించుచు, పదునెనిమిదిశ్లోకములతో స్తుతించి, ఈయధ్యాయమును ముగింపుచున్నారు.

అ॥ పరమానందసుతీర్థసుమునిరాజః, పరమానంద=అత్యుత్తమమైన ఆనందమును కలుగఁజేసెడు, సుతీర్థ=పరమమంగళశాస్త్రముగల, సుతీర్థ - యోగ్య గురువులైనట్టి (లేక- ఆనందతీర్థులనారసెఁడు) సుమునిరాజః = సన్మునిశ్రేష్ఠులు, లేక- పరమ = సర్వోత్తముఁడును, ఆనంద = ఆనందరూపియగు భగవంతుఁడు, సుతీర్థ = అనుకూలమయిన ఉపాధ్యాయుఁడుగాఁగల, సుమునిరాజః=సన్మునిశ్రేష్ఠులగు శ్రీమదానందతీర్థభగవత్పాదులవారు, లేక- పరమానంద = మోక్షానందకరమై, సు = యోగ్యమైనట్టి, తీర్థ= ఉపాయముగల, సుమునిరాజః = సన్మునిశ్రేష్ఠులయిన శ్రీమదాచార్యులవారు, లేక- పరమానంద = ఉత్కృష్టానందకరమగు, సుతీర్థం = శ్రీరంగాది క్షేత్రములు, గంగాగోదావర్యాది తీర్థములుగల [అనఁగా ఆయాతీర్థక్షేత్రములందు శ్రీహరిని లెస్సగా సేవించిన మహానుభావులని భావము] సుమునిరాజః = సన్మునిశ్రేష్ఠులగు శ్రీమదాచార్యులవారు, లేక- పరమానంద = పరమానంద కరమైన సుతీర్థ = యోగ్యమయిన యజ్ఞము (భీమావతారమందు చేసిన రాజసూయయాగము) గల, సుమునిరాజః = సన్మునిశ్రేష్ఠులగు శ్రీమదాచార్యులవారు, నిత్య...పదైషీ, నిత్య= నిత్యుఁడైనట్టియు, సుపూర్ణ = సర్వదా సర్వసంపూర్ణజ్ఞానానందాది స్వరూపముగలట్టియు క = విష్ణుమూర్తివారియొక్క, పరమానందపదైషీ = పరమానందరూపచరణము, లేక- వైకుంఠాదిస్థానమును కోరుచున్నవారై, (భక్తిపూర్వకముగ నీస్తోత్రమును పఠించువారికి వైకుంఠలోక

ప్రీతియగుఁగాకయని యిచ్ఛయించినవారై) హరిగాథాం = శ్రీహరియొక్క పుణ్యప్రద మయిన చరిత్రమును, కృతవాన్ = చేసిరి... ... ...

తా॥ అత్యుత్తమమయిన యీయానందమును గలుగఁజేయు శ్రీమదానందతీర్థులవారు హరిగాథయగు నీస్తుతిని చదివి భక్తులు పరమానందమునొందుటకై రచించిరి.

ఇతి శ్రీమదానంద తీర్థభగవత్పాదాచార్యవిరచితే
ద్వాదశస్తోత్రే దశమోధ్యాయః.
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీగురుభ్యోనమః.

## ఏకాదశోధ్యాయప్రారంభః.

శ్లో॥ ఉదీర్ణమజరందివ్య। మమృతస్యంద్యధీశితుః। ఆనందస్య పదంవందే। బ్రహ్మేంద్రాద్యభివందితం॥ ౧

శ్రీహరివందనమే నిఖిలపురుషార్థసాధనమగు శ్రీహరిప్రీతికారణముగనుక భక్తులుస ర్వదా శ్రీహరివందనముచేయవలయునని భావముతో శ్రీహరినిమరలస్తుతించుచున్నారు.

అ॥ ఉదీర్ణం = ఉత్కృష్టమయినట్టియు, అజరం = జరారహితమయినట్టియు, లేక - అజ = విష్ణుమూర్తివారివలనఁబుట్టిన బ్రహ్మను, ర = సంతోషింపఁజేయునట్టియు, లేక - అ = బ్రహ్మరుద్రులకు, జ = విజయమును, ర = దయచేయునట్టియు, దివ్యం = అలౌకికమయినట్టియు, లేక - క్రీడాదియుక్తమయినట్టియు, అమృతస్యంది = అమృతముస్రవించునట్టియు, [అనఁగా కైవల్యానందరసము భక్తులకుదయచేయు స్వభావముగలదని భావము] బ్రహ్మేం... దితం, బ్రహ్మేంద్రాది = బ్రహ్మేంద్రాదులచే, అభివందితం = నమస్కరించఁబడి, స్తుతించఁబడినట్టియు, అధీశితుః = సర్వనియామకుఁడైన, లేక - అధి = బ్రహ్మసరస్వతులకు, ఈశితుః = ప్రభువైన. ఆనందస్యపదం, ఆనందస్య = పరమాత్మయొక్క, పదం = పాదపద్మము, లేక - స్వరూపమును, వందే = నమస్కరించి స్తుతించుచున్నాను.

తా॥ గొప్పదై, జరామరణరహితమయినదై, అలౌకికమై ముక్తిసాధనమగు బ్రహ్మాదులకును స్తుత్యార్హమయిన పరమాత్మయొక్క పాదపద్మమునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ సర్వవేదపదోద్గీత। మిందిరాధారముత్తమం। ఆ...తం॥ ౨

అ॥ సర్వవేద...ద్గీతం, సర్వవేదములయందును అనఁగా ఋగ్యజుస్సామాథర్వణభారతములందుండెడు, పద = పదములచే, ఉద్గీతం = ఉత్తముఁడని చెప్పఁబడినట్టియు, ఇందిరాధారం, ఇందిరా = లక్ష్మీదేవికి, ఆధారం = ఆశ్రయమైనట్టియు, ఉత్తమం = సర్వోత్త

మమైనట్టియు, ఆనందస్యపదంవందే, బ్రహ్మేంద్రాద్యభివందితం, బ్రహ్మేంద్రాది=బ్రహ్మేంద్రాదులచే, అభివందితం=నమస్కరించఁబడి స్తుతించఁబడినట్టియు, ఆనందస్య=పరమాత్మయొక్క, పదం=పాదపద్మమును, వందే=నమస్కరించి స్తుతించుచున్నాను.

తా॥ సమస్త వేదములచేతను స్తుతింపఁబడువాఁడును లక్ష్మీనాయకుఁడును సర్వోత్తముఁడునగు బ్రహ్మేంద్రాదులకును స్తుత్యార్హమైన పరమాత్మయొక్క పాదపద్మములకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ సర్వదేవాధిదేవస్య। విదారితమహత్తమః। ఆ ... తం। 3

అ॥ సర్వదేవాధిదేవస్య, సర్వదేవ=సమస్తదేవతలకును, అధిదేవస్య=అధికదైవమయిన, సర్వదేవాదిదేవస్య, అనుపాఠమందు, సర్వదేవ=సమస్త దేవతలకును, అదిదేవస్య=కారణభూతదైవమయిన. ఆనందస్య=ఆనందరూపియైన భగవంతునియొక్క, విదారితమహత్తమః, (ఏస్వరూపముచే, లేక, ఏపాదముచే అనఁగా పాదస్మరణచే) మహత్తమః=మహదజ్ఞానము, విదారితం=పోఁగొట్టఁబడినదో, అట్టి, ఆనందస్య ...వందితం=బ్రహ్మేంద్రాదులచే స్తుతింపఁబడి నమస్కరింపఁబడిన పాదపద్మములను నమస్కరించి స్తుతించుచున్నాను.

తా॥ దేవాదిదేవుఁడై యజ్ఞానాంధకారమును నివారింపఁజాలు బ్రహ్మాదులకును స్తుత్యార్హమయిన పాదపద్మములకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఉదారమాదరాన్నిత్య।మనింద్యంసుందరీపతేః।ఆ ... తం॥

అ॥ సుందరీపతేః=లక్ష్మీరమణుఁడైన, ఆనందస్య=ఆనందరూపియగు భగవంతునియొక్క, ఉదారం=సర్వార్థములనొసంగునట్టియు, అనింద్యం=కొంచెమునయినను, దోషములేనట్టియు, బ్రహ్మేంద్రాద్యభివందితం=బ్రహ్మేంద్రాదులచే నమస్కరింపఁబడిన, పదం=పాదపద్మములను, ఆదరాత్=అతిశయమైన భక్తితో, వందే=నమస్కరించి స్తుతించెదను.

తా॥ లక్ష్మీనాయకుఁడును, ఆనందస్వరూపుఁడును, సర్వార్థదాయకుఁడును, దోషరహితుఁడును, బ్రహ్మాదులకును స్తుత్యార్హమైనపాదపద్మములకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఇందీవరోదరనిభం।సుపూర్ణంవాదిమోహదం।ఆ ... తం॥ 4

అ॥ ఇందీవరోదరనిభం, ఇందీవర=నల్లకలువయొక్క, ఉదర=మధ్యభాగముతో, నిభం=సమానమగు కాంతిగలట్టియు, సుపూర్ణం=సర్వగుణ పరిపూర్ణమైనట్టియు వాదిమోహదం, వాది=దుర్వాదులకు అనఁగా శ్రీహరిసర్వోత్తమత్వవిరుద్ధవాదులకు, మోహదం=అన్యథా జ్ఞానములను కలుగఁ జేయునట్టియు, లేక- వాది=తత్వనిర్ణయముగల మధ్వదాసులకు, మోహదం, మోహ=అజ్ఞానమును, లేక- అన్యథాజ్ఞానమును, దం=ఖండించునట్టియు, బ్రహ్మేంద్రాద్యభివందితం=బ్రహ్మేంద్రాదులచే నమస్కరింపఁబడి స్తుతింపఁబడిన ఆనందస్యపదం=శ్రీహరిపాద పద్మములను, వందే=నమస్కరించెదను.

తా॥ నల్లకలువయొక్క మధ్యభాగముతో సమానమగు కాంతిగలవాఁడును

ర్వగుణపరిపూర్ణుడును దుర్వాదములను జేయుసజ్జనుల మోహమును నివారించునట్టియు, బ్రహ్మాదులకును స్తుత్యార్హమైన పాదపద్మములను నమస్కరించుచున్నాను.

శ్లో॥ దాతృసర్వామరైశ్వర్య। విముక్త్యాదే రహోపరం।
ఆ... ...తం॥ ౬

అ॥ సర్వామరైశ్వర్యవిముక్త్యాదేః, సర్వ = సమస్తమయిన, అమర = దేవతలకు, ఐశ్వర్య = పదార్థైశ్వర్యము, విముక్తి = మోక్షము, ఆదేః = స్వరూపసత్తాప్రతీతి ప్రవృత్త్యాదులను, దాతృ = ఇచ్చునట్టియు, అహో = ఆశ్చర్యకరమయినట్టియు, పరం = ఉత్కృష్టమయినట్టియు, అహోపరం అనుపాఠమందు, అ = బ్రహ్మ, హః = పరుణుడు, (వీరికంటె) పరం = శ్రేష్ఠమయినట్టియు, లేక - వీరికి, వరములనిచ్చునట్టియు, లేక - వీరికి, వరం, వ = జ్ఞానమును కాంతిని, ర = ఇచ్చునట్టియు, లేక - అ = బ్రహ్మ, హః = వరుణుడు, వ = వాయుమూర్తి, మన్మథుడు గరుడమూర్తి వీరికి, ర = సుఖము నిచ్చునట్టియు, (ఇట్టి) బ్రహ్మేంద్రాద్యభివందితం = బ్రహ్మేంద్రాదులచే నమస్కరింపబడి స్తుతింపబడిన, ఆనంద స్యపదం = శ్రీహరి పాదపద్మములను, వందే = నమస్కరించెదను...

తా॥ సమస్తదేవతలకును యైశ్వర్యమును ముక్తిని నొసంగువాడును సర్వోత్కృష్టుడును, అద్భుతగుణక్రియాపరిపూర్ణుడును, బ్రహ్మాదులకును...నమస్కరించుచున్నాను.

శ్లో॥ దూరాద్దూరతరంయత్తు।తదేవాంతికమంతికాత్।ఆ...తి॥

అ॥ యత్ = ఏది, దూరాత్ = దూరమయిన దానికంటె, తు = విశేషముగ, దూరతరం = అత్యంతదూరమయినదియు (భక్తులు కానివారికని భావము) తదేవ = అదే, అంతికాత్ = సమీపమయినదానికంటెను, అంతికం = అంతసమీపమయినదియు, (భక్తులకని భావము) నైయున్నదో (శ్రీహరియొక్క వ్యాప్తరూపమునకును బింబరూపమునకును భేదము లేదని తాత్పర్యము) అట్టి, బ్రహ్మేంద్రాద్యభివందితం = బ్రహ్మేంద్రాదులచే నమస్కరింపబడి స్తుతింపబడిన, ఆనంద స్యపదం = శ్రీహరిపాద పద్మమును, వందే = నమస్కరించెదను.

తా॥ భక్తులకత్యంతము సమీపమునందుండునదియు, భక్తివిరహితులకంటె రానంత కడుదూరమునందునదియు, బ్రహ్మాదులకును...నమస్కరించుచున్నాను.

శ్లో॥పూర్ణసర్వగుణైకార్ణ।మనాద్యంతంసురేశితుః।ఆ...తి॥

అ॥ పూర్ణ...ఏకార్ణం, పూర్ణ = ప్రత్యేకప్రత్యేకముగా, అపరిమితమైన, సర్వ = సమస్తమైన, గుణ = జ్ఞానానందాదిగుణములకు, ఏకార్ణం = ముఖ్యసముద్రమైనట్టియు అనగా ఆశ్రయభూతమైనట్టియు, అనాద్యంతం = ఆదియు, అంతమును లేనట్టియు, సురేశితుః = దేవతలకును ప్రభువైన శ్రీహరియొక్క, పదంవందే = పాదపద్మములను నమస్కరించుచున్నాను.

తా॥ సంపూర్ణములగు జ్ఞానానందాది సమస్తసద్గుణములకు సముద్రమువంటివాఁడను, ఆద్యంతరహితుఁడును, దేవతలకుఁ బ్రభువును, బ్రహ్మాదులకును...నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఆనందతీర్థమునినా । హరేరానందరూపిణః । కృతస్తోత్రమిదంపుణ్యం ॥ పఠన్నానందతామియాత్ ॥

భక్తిపూర్వకముగా పఠించినవారలకు అష్టమదనివృత్తియయి, అష్టయిశ్వర్య ప్రాప్తికలుగునని సూచించుకొఱకు ఎనిమిదిశ్లోకములుంగల ఈస్తోత్రమును స్పష్టమయిన ఫలశ్రుతితో ముగింపుచున్నారు.

అ॥ ఆనందరూపిణః = ఆనందస్వరూపియయిన, లేక- ఆనందమును యోగ్యతానుసారముగా భక్తులకు ఏర్పాటుచేసియిచ్చెడు, లేక- ఆనందమును నియచేసెడు శ్రీహరియొక్క రూపముగలట్టి, అనఁగా శ్రీహరిరూపమును స్పష్టముగ చూపఁగలిగినట్టి వ్యాఖ్యానతారమైన, లేక- ఆనంద = ఆనందతీర్థులవారియందు విశేషసాన్నిధ్యముగల, రూపిణః = వేదవ్యాసరూపముగల శ్రీహరియొక్క, ఆనందతీర్థమునినాకృతం = ఆనందతీర్థులవారనెడు మునిశ్రేష్ఠులచే రచింపఁబడినట్టియు, పుణ్యం = పుణ్యకరమైనట్టియు, ఇదం = ఈ, స్తోత్రం = స్తోత్రమును, పఠన్ = పఠించెడు అధికారి, ఆనందతాం = ఆనందమును, లేక- ఆనందాత్మకుఁడైన శ్రీహరియొక్క ధర్మమును అనఁగా సారూప్యాదులను లేక ఆయవదయను, ఇయాత్ = పొందును, భక్తిపూర్వకముగ నీస్తోత్రమును పఠించినవారికి నవవిధద్వేషములు పోయి నవవిధభక్తి కలుగునని సూచించుకొఱకు తొమ్మిదిశ్లోకములతో నీయధ్యాయమును ముగించిరి.

తా॥ ఆనందస్వరూపుఁడగు శ్రీహరియొక్క యీస్తవము ఆనందతీర్థులవారిచే రచింపఁబడినది. దీనినిఁ జదువువారలకాముష్మికానందము నందుదురు.

ఇది శ్రీమదానంద తీర్థభగవత్పాదాచార్య విరచితే
ద్వాదశస్తోత్రే ఏకాదశోధ్యాయః సమాప్తః
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీగురుభ్యోనమః
## ద్వాదశోధ్యాయ ప్రారంభః

ఈ యధ్యాయమందు శ్రీమదానంద తీర్థభగవత్పాదాచార్యులవారు, తమయెడల శ్రీహరికిగల యనుగ్రహాధిక్యమును సూచించుచు స్తుతించుచున్నారు.

శ్లో॥ ఆనందముకుంద అరవిందనయన ఆనందతీర్థ పరానంద వరద॥ ౧

అ॥ హే ఆనంద = ఆనంద స్వరూపుఁడా! హే ముకుంద = మోక్షప్రదుఁడా! హే అరవిందనయన = కమలలోచనుఁడా! హే ఆనందతీర్థ...వరద. ఆనందతీర్థ = ఆనందతీర్థాచార్యులవారికి. పరానంద = పరమానందరూపమైన, వర = వరమును, ద = దయచేయువాఁడా! లేక-పర = ఉత్కృష్టమైన, ఆనందపర = శ్రేష్ఠమైన ఆనందమును, ద = దయచేయువాఁడా! లేక-ఆనందతీర్థ, ఆనంద = శ్రీహరి, తీర్థ = గురువుగాఁగల, పరా = పరిశుద్ధురాలైన లక్ష్మీదేవికి, ఆనందవరద = పరమానందమును దయచేయువాఁడా! లేక- ఆనందతీర్థ = ఆనందతీర్థులవారికంటె, పరా = శ్రేష్ఠురాలైన లక్ష్మీదేవికి, ఆనందవరద = ఉత్కృష్టమగు నానందమును దయచేయువాఁడా! లేక- ఆనందతీర్థ = ఆనందతీర్థులవారికిని, పరా = లక్ష్మీదేవికిని, ఆనందవరద = శ్రేష్ఠానందప్రదుఁడా! లేక- ఆనందతీర్థ = ఆనందతీర్థులవారనె, ప = వాయుమూర్తికిని, ర = శివునికిని, ఆనందవరద = శ్రేష్ఠానందమును దయచేయువాఁడా! లేక- ఆనందతీర్థ, పర, ఆనంద, వరద, అని నాలుగుపదములుగా విడఁదీయవచ్చును. అ॥ హే ఆనందతీర్థ, ఆనంద = ఆనందకరమైన, తీర్థ = భారతాదిశాస్త్రమును రచించినమహాను భావా! హేపర, ప = వాయుమూర్తికి, ర = సుఖమునిచ్చువాఁడా లేక- ర = ఆసక్తికి, అనఁగా ధ్యానమునకు విషయుఁడా! లేక-ప = వాయుమూర్తితో, ర = క్రీడించువాఁడా! అనఁగావాయువాహనుఁడై సంచరించువాఁడనిభావము. లేక, ప = పర్వతమనఁగ అనఁగా వేంకటాచలాదిపర్వతములందు, ర = క్రీడించువాఁడా! లేక- ప = పుత్త్రిని అనఁగ సంతానాదిసంపత్తులను, ర = (భక్తులకు) దయచేయువాఁడా! హేఆనంద, (ఆ+ఆనంద) ఆ = బ్రహ్మను, ఆనంద = ఆనందింపచేయువాఁడా! (లేక) హేఆనంద = ఆనందశబ్దవాచ్యుఁడా! హేవరద, ప = వాయుమూర్తి, ర = శివుఁడు, ద = పుత్రులనఁగా ప్రేమాస్పదులుగాఁగలవాఁడా! (లేక) ప = వాయుమూర్తికి, ర = సుఖమును, ద = ఇచ్చువాఁడా! (లేక) ప - మన్మధుని, ర = శాశనముచేసిన శివుఁడు, ద = పుత్రుఁడనఁగా ప్రేమాస్పదుఁడుగాఁగలవాఁడా! (లేక) ప = వాయుమూర్తికిని, ర = శివునికిని, ద = దాన, జ్ఞాన, వైరాగ్య, మోక్షములును కలుఁగచేయువాఁడా! (లేక, వర = శ్రేష్ఠమయిన, ద = కళత్రముగలవాఁడా! నిన్ను నమస్కరించెదనని పైశ్లోకమందలి వందే అనుశబ్దముతో నన్వయము.

తా॥ ఆనందస్వరూపుఁడవును, మోక్షదాయకుఁడవును, కమలలోచనుఁడవును, శ్రీమదానందతీర్థులవారికి పరశ్రేష్ఠమగు నాముష్మికానందమును, వరములను దయచేయువాఁడవునగు నీకు నమస్కారము.

శ్లో॥ సుందరీమందిర గోవిందవందే। ఆనంద...వరద॥ ౨

అ॥ హేసుందరీమందిర, సుందరీ=లక్ష్మీదేవికి, మందిర=గృహమువంటి వాఁడనఁగా ఆశ్రయమయినవాఁడా! (లక్ష్మీనివాసమయిన వక్షస్థలముగలవాఁడని భావము)

లేక, సుందరీ=లక్ష్మీదేవి, మందిర=మందిరముగాఁగలవాఁడా! (అనఁగా లక్ష్మీభుజాంతరస్థుఁడని తాత్పర్యము) లేక, సుందరీ=గోపికా స్త్రీలయొక్క, మందిర= మందిరములు నివాసస్థానము గలవాఁడా! లేక, సుందరీ=లక్ష్మీదేవికిని. గోపికాదిస్త్రీలకును, మంద=సంతోషమును, ర=దయచేయువాఁడా! హే గోవింద=వేదములచే ప్రతిపాదన చేయఁబడు స్వరూపముగల యోశ్రీకృష్ణా! హేఆనంద...వరద, ఆనందతీర్థ=శ్రీమదానందతీర్థులవారికి, పరానంద=పరమానందరూపముగల, వరద=వరములను దయచేయువాఁడా! వందే=(నిన్ను) నమస్కరించెదను.

తా॥ లక్ష్మీదేవికి స్థానభూతుఁడవును, మోక్షప్రదుఁడవును, శ్రీమదానందతీర్థులవారికి వరములనుదయచేయు నీకునమస్కరించెదను.

శ్లో॥ చంద్రసురేంద్ర సువందితవందే॥నంద ... ... వరద॥ ౩

అ॥ హేచంద్ర...వందిత, చంద్ర = చంద్రునిచేతను, సుర = దేవతలచేతను, ఇంద్ర = ఇంద్రునిచేతను, సు = విశేషముగ, వందిత= స్తుతింపఁబడిన నమస్కరింపఁబడిన వాఁడా! లేక-చంద్ర =చంద్రునిచేతను, సురేంద్ర= దేవేంద్రునిచేతను, సువందిత = విశేషముగనమస్కరింపఁబడినవాఁడా ! లేక—హేచంద్ర = భక్తులకునాహ్లాదముకలుగఁజేయువాఁడా! హేసురేంద్రసువందిత, సురేంద్ర = దేవతాశ్రేష్ఠులచే, సువందిత = మిగులస్తుతింపఁబడి నమస్కరింపఁబడువాఁడా! లేక-హేచంద్రసుర, చంద్ర =చంద్రునికి, సు = అనుకూలమైన, ర = సుఖమునుకలుగఁజేయువాఁడా! హేఇంద్ర సువందిత = ఇంద్రునిచే విశేషముగ స్తుతింపఁబడినవాఁడా! హేఆనందతీర్థపరానందవరద, ఆనంద తీర్థ = శ్రీమదానందతీర్థులవారికి, పరానంద = పరమానంద రూపమైన, వరద = వరములను దయచేయువాఁడా! వందే = (నిన్ను) నమస్కరించెదను.

తా॥ ఇంద్రుఁడు, చంద్రుఁడు మొదలగువారిచే లెస్సగాస్తుతింపఁబడెడువాఁడవును శ్రీమదానందతీర్థులవారికి వరములను దయచేయు నీకు నమస్కారము.

శ్లో॥ చంద్రకమందిరనందకవందే । ఆనంద...వరద॥ ౪

అ॥ హేచంద్రికమందిరనందక, చంద్రిక = నెమలికన్నులతోఁగూడిన, మందిర-కిరీటముచే, నందక = ఆనందించువాఁడా! లేక- చంద్రక = సువర్ణవికారమైన బాలచంద్రునివంటి రేఖలకు, మందిర =ఆశ్రయమయిన అనఁగా అట్టిచంద్రవంకలతోఁగూడిన, నందక = ఖడ్గముగలవాఁడా! లేక- హేచంద్రికమందిర = చంద్రికాంతికిసమానమయిన కాంతివిశేషములకు నాశ్రయుఁడా! హేనందక = నందకమను ఖడ్గముగలవాఁడా! లేక-హేచంద్రికమందిర, చంద్ర =చంద్రునివలన, క = సుఖముగల [అనఁగా చంద్రోదయమైనప్పుడుప్పొంగెడు] సముద్రము, మందిర = నివాసస్థానముగాఁ గలవాఁడా! హే నందక, నంద = నందగోపునకు, క = సుఖమునుదయచేయువాఁడా! లేక- హేచంద్ర = చంద్రునివలె భక్తజనప్రియా! హేకమందిర, క = ఉదకములు, మందిర =నివాసస్థానముగాఁగలవాఁడా! లేక- క = సుఖమునకు, మందిర = ఆశ్రయమయినవాఁడా! (సుఖ

స్వరూపుఁడని భావము] హేనందక = సజ్జనులను ఆనందింపఁజేయువాఁడా! లేక, చంద్రక = సువర్ణఖచితమైన, మందిర = గృహంబులందు, నందక = (గోపికాస్త్రీలను) ఆనందింపఁజేయువాఁడా! లేక- చంద్రక, చంద్ర= చంద్రుఁడు, క= సూర్యుఁడు, వీరివలెప్రకాశించెడు, మందిర = వైకుంఠాదిలోకములలో నందక = ముక్తులనానందింపఁజేయువాఁడా! లేక- చంద్రక, చంద్ర = చంద్రుఁడు, క = వాయుమూర్తి వీరివలెనున్న [అనఁగా చంద్రుని వలె ఆహ్లాదకరముగాను, వాయుమూర్తి వలె శ్రమపరిహారకముగనున్న) మందిర=మందిరములందు, నందక=ముక్తులనానందింపఁజేయువాఁడా! లేక, చంద్రక=చంద్ర, సూర్య, వాయు, బ్రహ్మలను, మందిర=తన మందిరములయిన వైకుంఠాదులందు, నందక=ఆనందింపఁజేయువాఁడా! లేక, చంద్రక- చంద్ర=చంద్రునివలె, క=సుఖకరమైన, మందిర=మందిరములందు, నందక=ముక్తానంద కరుఁడా! లేక-చంద్రకమందిర, మందిర=సంతోషకరమైన, చంద్రక=చంద్ర,సూర్య,బ్రహ్మవాయువులను, నందక=ఆనందింపఁజేయువాఁడా! లేక-చంద్రకమందిరనందక, చంద్ర=చంద్రునివంటి, కమందిర=శిరోగృహములందనగా వైకుంఠాదిలోకములలోని చంద్రశాలలయందు, నందక=ఆనందించువాఁడా! లేక—హేచంద్రికమందిర, చంద్రక=చంద్రసూర్యులు, మందిర=స్థానముగాఁగలవాఁడా! (వారియందు సాన్నిధ్యముగలవాఁడని భావము) లేక-చంద్రక=చంద్రసూర్యులకు, మందిర=ఆశ్రయమయినవాఁడా! లేక చంద్రక=చంద్రసూర్యులు, మందిర=మందిరమందుఁగలవాఁడా! లేక- చంద్రకమందిర. చంద్రక=చంద్రసూర్యులకు, మంది=సంతోషమును, ర=దయచేయువాఁడా! లేక-హే చంద్రక, చంద్ర=చంద్రునికి, క=సుఖమునిచ్చువాఁడా! హేమందిరనందక. మందిర=సంతోషకరులయిన దేవతలకును, నందక=ఆనందప్రదుఁడా! లేక-హేచంద్ర=చంద్రనామముగలవాఁడా! హేక=కపిలనామముగలవాఁడా! హేమందిర=సంతోష కరుఁడా! హేనందక=నందునికి సుఖప్రదుఁడా! హేఆనంద...వరద, శ్రీమదానంద తీర్థులవారికి పరమానందరూపమయిన వరములను దయచేయువాఁడా! వందే=(నిన్ను) నమస్కరించెదను

తా॥ చెంద్రికన్న.తో నలంకరింపఁబడిన కిరీటమును ధరించువాఁడవును, నందక మనుఖడ్గమును గేలఁబూనినవాఁడవును శ్రీమదానంద...నమస్కారము.

శ్లో॥ బృందారబృందసువందితవందే। ఆ ... వరద॥ ౫

అ॥ బృందారక...వందిత, బృందార = దేవతలయొక్క, బృంద = సమూహముచే, సువందిత = విశేషముగ నమస్కరింపబడినవాఁడా! ఆనందతీర్థపరానందవరద = ఆనందతీర్థులవారికి పరమానందరూపమయిన వరములను దయచేయు (నిన్నుగూర్చి) వందే = నమస్కరించుచున్నాము...

తా॥ దేవతాసమూహములచే విశేషముగా నుతింపఁబడువాఁడవును. శ్రీమదానంద......నమస్కరించుచున్నాను.

శ్లో॥ మందారస్యందితమందిరవందే। ఆనంద ... ... వరద॥౧

అ॥ మందార = పారిజాతపుష్పములచే, స్యందిత=పరిమళింపఁజేయఁబడిన, మందిర=నివాసస్థానములైన శ్వేతద్వీప అనంతాసనవైకుంఠములు గలవాఁడా! లేక, మందార=పారిజాతవృక్షమువలె, స్యందిత=సర్వాభీష్టములను స్రవింపఁజేసెడు, మందిర=వైకుంఠాదిస్థానములుగలవాఁడా! మందారస్యందన అనుపాఠమందు, మందారస్యందన, మందిర, అని విభజించవచ్చును, హేమందారస్యందన, మందార= కల్పవృక్షము, స్యందన= సర్వాభీష్టములను స్రవించునటులఁజేయువాఁడా! మందిర,మంది = సంతోషమును, ర= దయచేయువాఁడా! ఆనందతీర్థపరానందవరద = ఆనందతీర్థులవారికి పరమానంద రూపమైన వరములను దయచేయువాఁడా, వందే= (నిన్ను) స్తుతించినమస్కరించెదను.

తా॥ పారిజాతపుష్పముల పరిమళముతో శోభించు శ్వేతద్వీప, అనంతాసన, వైకుంఠాదిస్థానములుగలవాఁడును శ్రీమదానందతీర్థ... నమస్కరించెదను.

శ్లో॥ ఇందిరా నందక సుందర వందే। ఆనంద...వరద॥ ౨

అ॥ ఇందిరానందక, ఇందిరా = లక్ష్మీదేవిని, నందక — సంతోషింపఁజేయువాఁడా! లేక, ఇందిరా = లక్ష్మీదేవికి, నంద= సంతోషమును, క = కలుగఁజేయువాఁడా! లేక, ఇందిరా = లక్ష్మీదేవికిని, ఆనంద = శతానందుఁడైన బ్రహ్మకును, క = సుఖముగలుగఁజేయువాఁడా! లేక-ఇందిరా. ఇంది = పరమైశ్వర్యరూపమైన సంతోషమును, రా = కలుగఁజేసెడు, యశోదయు, నంద = నదగోపుఁడు, వీరికి. క = సుఖముకలుగఁజేయువాఁడా! హేసుందర = దివ్యసుందరవిగ్రహా! ఇందిరానందక సుందర అని ఏకపదముగా జెప్పవచ్చును. ఇందిరా = లక్ష్మీదేవియు, ఆనంద = బ్రహ్మక = వాయుమూర్తి వీరికి, సుందర = అత్యంతసౌందర్యముగకనుపించువాఁడా! (శ్రీహరియొక్క అప్రాకృత సౌందర్యము వారికె గాని తదితరులకు కానరాదని భావము) లేక-లక్ష్మీబ్రహ్మవాయువులకన్న అత్యంత సుందరమయినవాఁడా! లేక-హేఇందిర = సంతోషమును కలుగఁజేయువాఁడా! హేఆనందక = ఆనందమును దయచేయునట్టియు, సుందర = సుందరమయినట్టియు, శ్రీకృష్ణా! లేక- ఆనందకరమైన సుందరుఁడా! లేక-ఆనంద = ఆనందతీర్థులవారికి, క = సుఖమును కలుగఁజేసెడువాఁడా! లేక-ఆనంద = ఆనందయుక్తునిగచేసిన, క= బ్రహ్మగలవాఁడా! (బ్రహ్మకు ఆనందప్రదుఁడని భావము) హేసుందర = అప్రాకృతదివ్యసౌందర్యముగలవాఁడా! ఆనందతీర్థపరానందవరద = ఆనందతీర్థులవారికి పరమానంద రూపమైన వరములను దయచేయువాఁడా! వందే = (నిన్ను) నమస్కరించి స్తుతించెదను.

తా॥ లక్ష్మీదేవికి ఆనందకారణుఁడవును సుందరుఁడును శ్రీమదానందతీర్థ...నమస్కరించెదను.

శ్లో॥ మందిరస్యందనస్యందకవందే। ఆనంద ... వరద॥ ౩

అ॥ మందిరస్యందనస్యందక, మందిర = మందిరములందు, స్యందన=రథములను,

స్యందక=పరిచారకులును గలవాఁడా! లేక-మందిర=మందిరములందు స్యందనస్యందక, స్యందక = ఆనందమును ప్రసరింపఁజేసెడు, అనఁగా కలుగఁజేసెడు, స్యందన = రథము లుగలవాఁడా! లేక- మందిర = సంతోషప్రదములయిన, స్యందన = రథములయందు, స్యందక = పరిచారకులుగలవాఁడా! లేక-మందిర = మందిరములవంటి,స్యందన = రథము లయందు, స్యందక = పరిచారకులుగలవాఁడా! లేక- మందిరస్యందన=రథములవంటిమం దిరములయందు, స్యందక = పరిచారకులుగలవాఁడా! లేక- మందిరస్యందన, మందిర = మందిరములను,స్యందన=నీచనాదిపరిచర్యలుచేసెడుబ్రహ్మాదులకు,స్యందక=పరమానందము నువసిఁజేయువాఁడా! లేక-మందిరస్యందన, స్యందక, అనిరెండుపదములుగా విడఁ దీయవచ్చును. హేమందిరస్యందన=మందిరములవంటి స్యందనములు, లేక.స్యందనముల వంటి మందిరములుగలవాఁడా! హేస్యందక=ఆనందమును వర్షింపఁ జేయువాఁడా! ఆనంద...వరద=ఆనందతీర్థులవారికి పరమానందరూపమయిన వరములనుదయచేయువాఁ డా! వందే=[నిన్ను) నమస్కరించి స్తుతించెదను.

తా॥ దివ్యమందిరములు, రథములు, పరిచారకులు మొదలగు మహదైశ్వర్యములు గలవాఁడును, శ్రీమదానందతీర్థ......నమస్కరించి స్తుతించెదను.

శ్లో॥ ఆనందచంద్రికాస్యందక వందే । ఆనంద ... వరద॥ ౯

ఆనందమయపదము ముగించుచున్నారు.

అ॥ హేఆనంద......స్యందక, ఆనంద = మోక్షానందమును, చంద్రికా = వెన్నెలను, స్యందక = ప్రసరింపఁజేయువాఁడా! (మోక్షానంద ప్రదుఁడని భావము) లేక, ఆనంద = ఆనందతీర్థులవారికి, చంద్రికా = వెన్నెలను, స్యందక = వర్షింప జేయువాఁ డా! (అనఁగా ఆహ్లాదమును కలుగఁజేయువాఁడని భావము) లేక- ఆనంద = ఆనందము ను, చంద్రికా = వెన్నెలను, స్యందక = వర్షింపఁజేయువాఁడా! హేఆనందతీర్థపరా నందవరద = ఆనందతీర్థులవారికి పరమానందరూపమయిన వరములను దయచేయువాఁ డా! వందే = (నిన్ను) నమస్కరించి స్తుతించెదను. ఈస్తుతిచే ప్రీతుఁడై శ్రీహరి మో క్షానందమును దయచేయునుగనుక శ్రీహరియే సర్వదా స్తోత్రార్హుఁడని తాత్పర్య ము. ఈయధ్యాయమందు తొమ్మిదిశ్లోకములుండుటచే, ఈస్తోత్రమును పఠించువారికి నవనిధిద్వేషములుపోయి నవవిధభక్తి కలుగునని సూచింపఁబడినది.

తా॥ మోక్షానందమును తేఁటవెన్నెలను ప్రసరింపఁజేయు మహానుభావుఁడవున్ను శ్రీమదానందతీర్థులవారికి పరమానందరూపమయిన వరములనుదయచేయువాఁడవును అగు నీకు నమస్కరించి స్తుతించెదను.

ఇతి శ్రీమదానంద తీర్థభగవత్పాదాచార్య విరచితే
ద్వాదశస్తోత్రే ద్వాదశో౽ధ్యాయస్సమాప్తః
శ్రీకృష్ణార్పణమస్తు

శ్రీ సీతారామాయనమః.

శ్రీమదానందతీర్థభగవత్పాదాచార్యేభ్యోనమః.

---

శ్లో॥ ఉత్పత్తిస్థితిసంహృతి ప్రణియతిజ్ఞానాని బంధావృతీ
మోక్షశ్చేతియతోభవంతి జగతోభావాస్స్వతంత్రాత్పరాత్
తంవందేనిరవద్యసద్గుణతనుం లక్ష్మీధరాలింగితం
దోర్భిశ్చక్రగదాంబుజాభయభృతం భక్తైకగమ్యంహరిం.

తా॥ ఈజగత్తుయొక్క ఉత్పత్తి, స్థితి, వినాశము, నియమనము, జ్ఞానము, బంధము, ఆవృతి, మోక్షము, అనెడిభావములు, పరాత్పరుఁడును, స్వతంత్రుఁడు నైనయేమహానుభావునివలనఁ గల్గుచున్నవో, అట్టినిర్దోషసద్గుణస్వరూపుఁడైనట్టియు, శ్రీభూదేవులచేనాలింగనము చేసికొనఁబడినట్టియు, బాహువులయందుశంఖచక్రగదాపద్మములను అభయముద్రను ధరించినట్టియు, భక్తులకుఁ బొందశక్యుఁడైనట్టియు, భక్తవత్సలుఁడైన శ్రీహరిని నమస్కరించెదను.

సీ. శకటదానవనాథు సంహరించినవెవ్వి
బలినధోలోకాన నిలిపెనెవ్వి
జహ్నుతనూజకు జన్మదేశములెవ్వి
తాతినేయువిచే సెనాతిగాఁగ
యర్జునురథముపై సలరెనేయవికాళి
యాహిపైఁ దాండవంబాడెనెవ్వి
శ్రీసతీమణియంక సీమనిలుచునెవ్వి.
యోగీంద్రహృద్వీధినుండునెవ్వి

గీ. గరుడశేషరుద్రకంజజాదులకెవ్వి
స్తోత్రపాత్రములయిసొంపుఁజెందు
నెవ్వియట్టియిందిరేశునిశ్రీపాద

పద్మములనుమిగుల భక్తిఁదలఁతు.

## భగవద్భక్తులకొఱకు విజ్ఞాపనము.

ద్వైతమతస్థాపకులైన శ్రీమదానందతీర్థ భగవత్పాదాచార్యుల వారిచేర రచింపఁబడిన "ద్వాదశస్తోత్ర,, మనెడు పంద్రెండధ్యాయములుగల యుత్కృష్ట గ్రంథమునకు నాలుగు సంస్కృత వ్యాఖ్యాన గ్రంథములను జూచి సరియగు తెలుఁగర్థము వ్రాసితిమి. "ప్రమాదోధీమతామపి" అనునట్టుల భ్రమప్రమాదాదులచే నిందేవేని లోపములుండినట్లయినఁ బండితులును, రసజ్ఞులును, దయాపూర్వకంబుగ క్షమింపవలయునని విధేయులమై విన్నవించుచున్నాము.

ఈద్వాదశస్తోత్రము శ్రీమదానందతీర్థశ్రీపాదులవారు రచించుటనుగూర్చిన యీక్రిందివృత్తాంతము చదువరులకొఱకై ప్రకటింపఁబడుచున్నది.

ద్వాపరయుగమునందు ద్వారకాపట్టణమునఁ గొంతకాలము విశేషవైభవ మహిమాతిశయములచేఁ బ్రసిద్ధిగాంచిన శ్రీకృష్ణవిగ్రహము ద్వారకాపట్టణము సముద్రనిమగ్నమయినపిమ్మట గోపీచందనముతోఁగూడుకొని (యొకలంకలో) నుండెననియు, ఓడవర్తకుఁడొకఁడా ద్వీపసమీపమునకు తనయోడను తీసికొనివెళ్ళుచుండఁగ సముద్రపుఁదల్ల కల్లోలముగా నుండినందున బరువునిమిత్తమా తిప్పనున్నతెల్లనిమంటిగడ్డలనతఁడా యోడయందుంచుకొని పోవుచుండెననియు శ్రీమధ్వాచారులవారు రజితపీఠపురమని పిలువఁబడు ఉడిపిపట్టణమందు సజ్జనోద్ధరణముకొఱకు శ్రీకృష్ణప్రతిమను ప్రతిష్ఠచేయఁదలఁచి త్రికాలజ్ఞానముగలవారు గావున సముద్రతీరంబునకుంజని జపము చేసికొనుచుండఁగ, ద్వీపాంతరమునుండి వచ్చుచున్నయా యోడ రేవు పట్టక దూరముగఁబోయి యెట్లునుగదలక నిల్చియుండెననియు, అందుకు భయఁపడి యాయోడయధికారి, తీరమునజపముచేయుచు, మిగులతేజస్సుచేఁబ్రకాశించుచున్న శ్రీమధ్వాచార్యులవారిని జూచి, యోమహాత్మా మీమహిమాతిశయమ్ముచే మమ్ము రక్షించితిరేని ఈయోడ

యుందుండు వస్తువులన్నియుఁ దమకు సమర్పణచేసి కొండు నని ప్రార్థింపఁగా, భక్తులకోరికలను నెఱవేర్చు పరమదయార్ద్రహృదయు లైన శ్రీమధ్వాచార్యులవారు తమశాటినివిసరి యాయోడ నొడ్డున కుఁ దక్షిణమే రక్షించినియు, అందుకాయోడయధిపతి మిగుల సం తసించి, ఓకరుణాకరా! ఈ యోడలోఁ దమకుఁ గావలసిన పదా ర్థములను దీసికొనుఁడని మధ్వాచార్యులవారిని బ్రార్థింపఁగ, నందు లోనున్న పెద్దగోపిచందనపు గడ్డనుమాత్రము తీసికొని ఉడిపి పట్టణ మునకు వచ్చి మధ్వసరోవరములో నాగడ్డనంతను శిష్యులచేఁ గడి గించి లోపలనున్న శ్రీకృష్ణప్రతిమను తాము స్వయముగ నభిషేక ము చేసిరనియు, మహానుభావులగు శ్రీమధ్వాచార్యులవారు ఆప్రతి మను స్పృశించి, ధ్యానించి యభిషేకముచేసినతోడనే దానియందు శ్రీహరి సాన్నిధ్యము గలిగెననియు, ఆకారణమువలన బలాఢ్యులయి న ముప్పదిమంది శిష్యులయినను ఆప్రతిమ నెత్తఁజాలకపోయిరనియు అప్పుడు శ్రీమధ్వాచార్యులవారొక్కరే యనాయాసముగ దానిని శిరస్సున ధరించి ఈ ద్వాదశస్తోత్రములచే శ్రీహరిని స్తుతిచేయు చు, చిఱునగవుతోఁగూడిన పరమసుందరాకృతి దివ్యమంగళవి గ్రహమయిన యాశ్రీకృష్ణప్రతిమను దమమఠమునకుఁ దెచ్చి ప్రతిష్ఠ చేసిరనియు, శ్రీమధ్వ విజయమునందుఁ జెప్పబడియున్నది.

కలియుగమునందు జన్మించిన దుష్టులగు దైత్యులచే ప్రచుర పఱుపఁబడిన దుర్మతములనెడు నంధకారమును నివారించి జ్ఞానమనె డు ప్రకాశమును వ్యాపింపఁజేయుటకొఱకు శ్రీహరి యాజ్ఞానుసార ముగ భూలోకమందవతరించిన వాయుమూర్తివారి యవతారమగు శ్రీమదానందతీర్థ శ్రీపాదులవారీ కలికాలమందు శ్రీహరిస్తవమే ప రమధర్మమని యెంచి సజ్జనులయందలి యనుగ్రహముచే రచించిన ఈదివ్యస్తోత్రమును నిత్యమునుపఠించుటయు, నిందలి విశేషార్థముల నుగ్రహించుటయు సర్వమునుముక్షుజనకర్తవ్యమని నిశ్చయించి యె

ల్లరకు సులభముగఁ దెలియునటులఁ దెలుఁగునఁ బ్రతిపదార్థ తాత్పర్య ములతోఁ బ్రచురించితిమి.

ఇట్టి సద్గ్రంథమును బ్రచురించుటకై మాకు సర్వవిధముల సహాయము చేసిన మామిత్రులలో ముఖ్యులయిన మ॥ రా॥ రా॥ హుండి రామా రావుపంతులు బి, యే, గారికి అనేకకృతజ్ఞతాపూర్వక వందన ములనాచరించుచున్నాము.



ఇట్లువిన్నవించు

వీ॥ వెం॥ సుబ్బారావు.

